# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి: 14 | జనవరి, 1970 | సంచిక: 3
పుష్యం–మాఘం–1891 శా.శ



ఈ సంచికలో....

ముఖచిత్రం : నూతన సంవత్సరానికి స్వాగతం
(చిత్రకారుడు : సూరి)

వెల: 50 పైసలు
సాలుచందా ఆరు రూపాయలు
Regd. No. H. 133.

పేజీ

# నూతన సంవత్సరానికి స్వాగతం

చంద్రమండలం మీద మానవుడు దిగడంతో 1969, చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన ప్రాధాన్యం పొందింది. కేవలం ఆ సంఘటనవల్లనే కాకపోయినా అంతర్జాతీయ, జాతీయ రంగాలలోనూ, రాష్ట్రంలోనూ జరిగిన అనేక ముఖ్యసంఘటనల కారణంగా 1969 సంవత్సరానికి ప్రాధాన్యం వచ్చింది. ముఖ్యంగా భారతదేశంలో అతి ప్రధానమైన అనేక సంఘటనలు జరిగినవి. భారతదేశపు మూడవ రాష్ట్రపతి డా॥ జాకీర్‌హుసేన్ మరణంతో దేశం సహృదయుడైన ఒక గొప్పమేధావినీ, రాజకీయవేత్తనూ కోల్పోయింది. బహుముఖ ప్రతిభాశాలీ, అర్ధశతాబ్దంపాటు దేశానికి ఎనలేని సేవచేసిన నాయకుడూ అయిన శ్రీ వి.వి. గిరి రాష్ట్రపతిగా ఎన్నికైనారు. ఈ ఎన్నిక ప్రభావం తరువాత జరిగిన రాజకీయ పరిణామాలకు దారితీసింది. అతివేగంగా జరిగిన తరువాతి సంఘటనలు అందరకు తెలిసినవే; ప్రత్యేకంగా పేర్కొనవలసిన అవసరంలేదు.

ఈ యేటి సంఘటనలలో ఒక గొప్ప విశేషం, మనకు చైతన్యాన్నీ, స్వాతంత్ర్యాన్నీ ప్రసాదించిన మహాత్ముని శతజయంతి ఉత్సవాలు. మనదేశంలోనూ విదేశాల్లోనూ, యీ ఉత్సవాలు పెద్ద ఎత్తున జరిగినవి. భగవంతుని ఏకత్వాన్నీ, మానవులలో సమానత్వాన్నీ ప్రబోధించిన గురునానక్ పంచ శతజయంతి కూడా యీయేడే రావడం హర్షించదగిన విశేషం. గాంధీజీ యిచ్చిన నూతన సందేశం భారతజాతిని జాగరితంచేసి, దేశరాజకీయ జీవితానికి ఒక స్వరూపం కల్పించింది. అలాగే మతంపట్ల విశాలదృక్పథంతో గురునానక్ చేసిన బోధలు వివిధ వర్గాల ప్రజల మధ్య పరస్పర సామరస్యధోరణికి దోహదం చేసినవి. 22 సంవత్సరాల తర్వాత మళ్లీ ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ భారతదేశానికి రావడం ఒక మహత్తరమైన సంఘటనగా పేర్కొనవచ్చు. సాటిలేని స్వాతంత్ర్య యోధుడు గఫార్‌ఖాన్. హింసాప్రియులైన పఠానులకు అహింసా సిద్ధాంతాన్ని నూరిపోసిన అఘటనా ఘటనా సమర్థుడు. ఆయన అక్షరాలా "దేవునిమనిషి", మానవత మూర్తీభవించిన మహామనిషి. స్వాతంత్ర్యంకోసం, స్వేచ్ఛాజీవనం కోసం బాద్షాఖాన్ చేసిన త్యాగాలు, ఆయన అనుభవించిన బాధల వంటివి యిరవయ్యో శతాబ్దంలో చాల అరుదుగా కనిపిస్తాయని ప్రధానమంత్రి పేర్కొన్నది పూర్తిగా యధార్థం. ఆయన నిరంతరం చేస్తున్న బోధలు — మానవశాంతి, సౌభ్రాతృత్వసందేశాలు — తప్పక ఫలవంతం కాగలవని ఆశిద్దాం.

1969 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అనేక కఠిన పరీక్షలకు గురి కావలసివచ్చింది. సర్కారుజిల్లాలలో రెండుసార్లు వచ్చిన తుఫానువల్లా, వరదలవల్లా, రాయలసీమలో అనావృష్టివల్లా, తెలంగాణా ఆందోళనవల్లా రాష్ట్రం అనేక విధాలుగా ఎంతో నష్టపడింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఏదైనా దుష్టగ్రహం ఆవేశించిందా అనిపించింది. ఇటీవలి చరిత్రలో రాష్ట్రంలో ఎప్పుడూ యింత బాధాకరమైన సంఘటనలు జరుగలేదు. యిన్ని సమస్యలు తలఎత్తలేదు. ఈ సమస్యల సవాలును ఎదుర్కోడానికి ఎంతో ధైర్యం, నిగ్రహం అవసరమైనవి. ఎంతో వివేకం ప్రదర్శించవలసి వచ్చింది. ఇంతటి కఠినపరీక్షలకు గురి అయినప్పటికీ మనం తెలివితేటలతో ప్రవర్తించి కష్టాలనుండి గట్టెక్కగలగడం ముదావహం. దెబ్బతిన్నప్పటికీ తట్టుకోగలిగి మళ్లీ స్వాస్థ్యం పొందగలగడం సంతోషకరమైన విషయం. సంవత్సరం పొడుగునా ఎన్నికష్టాలు వచ్చినా, ఎన్ని అడ్డంకులు కలిగినా వాటినన్నింటినీ వజ్రసంకల్పంతో ఎదుర్కొని బైటపడడం మన రాష్ట్రపు దృఢసంకల్పానికీ, దీక్షకూ నిదర్శనం. మనకు గొప్ప భవిష్యత్తు వుందనే విషయం దీనివల్ల ఋజువైంది.

1970 సంవత్సరం రాష్ట్ర, దేశ, ప్రపంచ పరిస్థితులలో శాంతి, అభ్యుదయం, స్థిరత్వంతో కూడిన నూతన అధ్యాయాన్ని ప్రారంభించగలదని ఆశిద్దాం.

— వి. వి. ఆర్.

# తెలుగు ప్రజల శ్రేయస్సు కోసం

— కాసు బ్రహ్మానందరెడ్డి

ఒక భాష మాట్లాడే ప్రజలతో ఒక రాష్ట్రం ఏర్పడింది. దానిని మన చిత్తం వచ్చినప్పుడు విభజించడానికి మనకు హక్కు లేదని మనవిచేస్తున్నాను. చారిత్రికంగా, భాషా విషయికంగా, నైతికంగా, అన్ని విషయాలతో కూడినటువంటి ఒక రాష్ట్రం విషయంలో ఏదో మన యిష్టం వచ్చినప్పుడు కలుసుకోవడం, విడిపోవడం జరిగితే, పాలకులు ఎవరైనా, ఎప్పుడైనాసరే అది మొత్తం తెలుగు జాతికే అన్యాయం చేసినట్లవుతుందని భావించేవాళ్ళలో నేను ఒకడిని. అందుకని ఎన్ని యిబ్బందులు వచ్చినా, ఎన్ని అవమానాలు జరిగినా, నా మీద ఎన్ని అబద్ధపు ప్రచారాలు జరిగినా నాకు మనస్సులో వున్నటువంటి లక్ష్యం ఒకటే. చాలా పెద్దదైన మన జాతి, ఎంతో చరిత్ర కలిగినటువంటిది, ఏవో కొన్ని దురదృష్ట కారణాలవల్ల విడిపోయిన ప్రజలు అదృష్టవశాత్తు ఒక కుటుంబంగా తిరిగి కలుసుకున్న తరువాత ఆ కలయికను విచ్ఛిన్నం చేయడం భార్యా భర్తలను వేరుచేయడం వంటిదే. అందుకని మనకు ఎంత బాధ కలిగినప్పటికీ, ఎంత ఆవేశం వున్నప్పటికీ, ఎంత కోపం వున్నప్పటికీ మనం దానిని మనస్సులోనే పెట్టుకొని, రాష్ట్ర సమగ్రతను చెడగొట్టకుండా ఏదైనా సర్దుబాటు చేసుకోవడానికి అవకాశం వుంటే చేసుకోవలసిందే తప్ప అన్య మార్గాలను గురించి ఆలోచించడం అన్యాయమే అవుతుంది.

ఈ సందర్భంలోనే ఫజల్ అలీ కమీషను యిట్లా చెప్పింది, అట్లా చెప్పింది అని కొందరు చెప్తున్నారు. అనేక పత్రికలలో వ్రాశారు. ఫజల్ అలీ కమీషను వారు తమ నివేదికలో బొంబాయినీ, పంజాబునూ ద్విభాషా ప్రాంతాలుగా సిఫార్సు చేశారు. కాని చివరకు కేంద్ర ప్రభుత్వం నిర్ణయించవలసి వచ్చినప్పుడు భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్ణయం జరిగింది. ఆ తరువాత ఒకటి రెండు రాష్ట్రాలు, అప్పుడు కాకపోయినా తరువాతనైనా ఒకటి రెండు సంవత్సరాలలో వేరుపడక తప్పలేదు. ఇది ఇటీవలి చరిత్ర. మనకు తెలిసినటువంటి విషయం. కాబట్టి అనవసరంగా, సందర్భం లేకుండా ఫజల్ అలీ కమీషను యిట్లా చెప్పింది, అట్లా చెప్పింది, అని అనుకోవడం చాలా పొరపాటు.

పెద్దమనుషుల ఒప్పందం జరిగింది. రాష్ట్ర ఐక్యతను ఒప్పుకుంటూ, అనుమానాలను తీర్చడానికి ఆ ఒప్పందం జరిగింది. అందరూ అంగీకరించి సంతకాలు చేసిన ఆ ఒప్పందంలోని మొదటి వాక్యాన్ని మనవిచేస్తాను.

"1956 నవంబరు మొదటి తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ జరగడంతో తమకు స్వంతంగా ఒక రాష్ట్రం వుండాలన్న తెలుగు ప్రజల చిరకాల వాంఛ సిద్ధించింది. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల నాయకులు సమిష్టిగా జరిపిన కృషి ఫలించింది. తెలుగు ప్రజల సాంస్కృతిక, ఆర్థికాభివృద్ధిని సమగ్రంగా సాధించాలన్నది ఉభయుల ప్రాథమిక లక్ష్యం. తెలంగాణా అభివృద్ధి, తెలంగాణా ప్రయోజనాల పరిరక్షణ కొరకు రక్షణ కల్పించడం అవసరమని రెండు ప్రాంతాల నాయకులు భావించారు".

## జనవరి 19 ఒడంబడిక

అదే విధంగా, 1969 జనవరి 19వ తేదీన 45 మంది పెద్దలు సంతకాలుచేసిన ఒప్పందంలో వ్రాసిన విషయం చూడండి. "పైన తెలిపిన మార్గాలలో పటిష్టమైన చర్యలు తీసుకొనడం ద్వారా తెలంగాణా ప్రాంతంలో ఏర్పడిన అసంతృప్తిని పూర్తిగా తొలగించ వచ్చునని మేము విశ్వసిస్తున్నాము. తెలుగు ప్రజల సాంస్కృతిక వికాసం, ఆర్థికాభివృద్ధి మన ప్రధాన కర్తవ్యంగా వుండాలి. మన రాష్ట్రంలో భారీ పెట్టుబడులు పెట్టి ఆర్థికాభివృద్ధికీ, యువతరానికి యితోధికంగా ఉపాధులు కల్పించడానికి అవకాశం కల్పించడానికై యిక్కడ సమైక్యతనూ, శాంతినీ కాపాడడం అత్యావసరమనే సంగతిని గమనించాలి. కాబట్టి మన రాష్ట్రంలో వేర్పాటు ధోరణులకు దారితీసే ఎటువంటి పనికీ మనం పూనుకోరాదు. కనుకనే కొంతమంది ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పాటు కొరకు లేవనెత్తిన నినాదాన్ని మేము తీవ్రంగా అసందిగ్ధంగా ఖండిస్తున్నాము. వివిధ రాజకీయ దృక్పథాలకు చెందిన మేము, మన రాష్ట్రపు సంపూర్ణ సమైక్యతనూ, సాంస్కృతిక అభివృద్ధినీ సాధించడానికై మా శక్తి సంతటినీ వినియోగించడానికి దృఢ సంకల్పంతో వున్నాము.

భారతదేశంలో ఆంధ్రప్రదేశ్ ప్రముఖ స్థానం ఆక్రమిస్తున్నది. జాతీయ సమైక్యత కొరకు మన వంతు కృషిని మనం జరపడానికి వీలుగా మన రాష్ట్రంలో సంపూర్ణ సమైక్యతను సాధించడం చాలా అవసరం."

తొమ్మిది మాసాల క్రితం అన్ని పక్షాల నాయకులు–ముఖ్యంగా యిప్పుడు ప్రత్యేక తెలంగాణాను కోరుతున్న వారితో సహా–చెప్పిన విషయం యిది.

## రక్షణలు తాత్కాలికమైనవే

ఒక రాష్ట్రంలో కలిసి వున్నప్పుడు కొందరికి ఏవో కొన్ని అన్యాయాలు జరిగినవంటే జరిగివుండవచ్చు. జరిగిన అన్యాయాలను

సరిదిద్దుకోవాలే కాని అన్యాయం ఏదో జరిగింది కాబట్టి మనం విడిపోవాలి, అంతకు తప్ప గత్యంతరం లేదు అనేటటువంటి భావం రావడం ఎంతో ప్రమాదకరమైన విషయం. ఏ పార్టీలో అయినా విభేదాలువుండవచ్చు. పార్టీనాయకుడిపైన బేధాభిప్రాయాలు వుండవచ్చు. నాయకుడిని తీసివేయాలనే భావం కూడా కొంతమందికి ఉండవచ్చు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో యిది జరుగుతూ వుండేదే. అయితే విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పడినదీ, నాలుగుకోట్ల ప్రజలు సమైక్యంగా ఒక ప్రభుత్వం క్రిందకు వచ్చినదీ ఒకరి నాయకత్వం కొరకు కాదనీ, శాసన సభ్యుల కొరకు కాదనీ మనం గమనించాలి. ఈ విశాలాంధ్ర రాష్ట్రం యిట్లా సాగితే ఎన్నివేలమంది శాసన సభ్యులు వస్తారో, ఎన్ని డజన్ల మంది ముఖ్యమంత్రులు వస్తారో, ఎన్ని వందలమంది మంత్రులు వస్తారో చెప్పలేను. అందువల్ల సంకుచిత దృష్టితో, వికృతమైన ఆలోచనలతో, ఒకరిపైన కోపంతో తెలుగు ప్రజలందరికీ అన్యాయం చేయబూనడంకంటే దేశద్రోహం యింకొకటి లేదని నేను గట్టిగా మనవి చేస్తున్నాను. ఈ దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి. ప్రజల అభిప్రాయం వారి ప్రతినిధుల అభిప్రాయం చెల్లితీరాలి. ప్రజాస్వామ్య మార్గాన్ని గట్టిగా అనుసరించవలెనే తప్ప ఏదో తాత్కాలిక ప్రయోజనం కొరకు కృత్రిమ మార్గాలను అన్వేషించకూడదు. అలా చేసినట్లయితే ఆ కృత్రిమ మార్గాలే రేపు వాటి నిర్మాతలను ఆహుతి చేస్తాయని నేను హెచ్చరిక చేస్తున్నాను. విశాలాంధ్ర ఏర్పడి 4 కోట్ల మంది తెలుగు ప్రజలు ఐక్యం కావడం ప్రధానమైన విషయం. అది ప్రాతిపదిక. అసలు ఒప్పందంలో ఏమి వున్నది? అప్పుడు పెద్ద నాయకులు — శ్రీయుతులు రంగారెడ్డి, చెన్నారెడ్డి, జె. వి. నరసింగరావు, సంజీవరెడ్డి, గోపాలరెడ్డి మొదలగు హేమాహేమీ లందరూ విశాలాంధ్ర శాశ్వతమైన ప్రాతిపదికతో ఏర్పడినదని అన్నారు. అయితే కొన్ని అనుమానాలు వున్నందువల్ల అయిదు సంవత్సరాల వరకు — అనుమానాలు తీరేంత వరకు — కొన్ని ఏర్పాట్లు చేసుకుందాము అనుకున్నారు. మొట్టమొదటి ఏర్పాటు ఉద్యోగ అవకాశాలకు సంబంధించినది. దీనికి అయిదు సంవత్సరాల కాల పరిమితి నిర్ణయించబడింది. ఆ ఒప్పందం ప్రకారం ప్రాంతీయ సంఘం కాలపరిమితి పది సంవత్సరాలు. అంటే అర్థం ఏమిటి? విశాలాంధ్ర అన్నది శాశ్వతమైన అంశం. రక్షణలు అన్నవి అనుమానాలు తీర్చుకోవడానికి తాత్కాలికంగా ఏర్పర్చుకున్నటువంటివి. కాని యిప్పుడు ఏమవుతున్నదంటే కుక్కను వద్దిలి తోక పట్టుకున్నట్లు అసలు విషయాన్ని మరచిపోయి—అంటే 4 కోట్ల మంది తెలుగు ప్రజల భవిష్యత్తును ప్రక్కకుతోసి—రక్షణలకు ఏదో భంగం జరిగిందనీ, ఆ కారణంవల్ల వేరుపడిపోవాలనీ, యిది తప్ప గత్యంతరం లేదనే అభిప్రాయానికి రావడం జరిగింది. ఇది ఎంత పొరపాటు అయినదో తిరిగి ఆలోచించాలని కోరుతున్నాను.

కోస్తా జిల్లాలలోని ప్రజలు కానీ, రాయలసీమలోని ప్రజలు కానీ, లేక తెలంగాణాలోని ప్రజలు కానీ వారిలో వారికి సంఘర్షణ ఏమీ లేదని ప్రత్యేక తెలంగాణాను లాంఛనంగా కోరిన సభ్యులతో సహా అందరు సభ్యులూ అంగీకరించారు. ప్రజలలో సంఘర్షణ ఎందుకు వుంటుంది? వారు ఎంత సేపటికీ కోరేవి, నీటిపారుదల ప్రాజెక్టులు, విద్యుచ్ఛక్తి, మంచి గృహవసతి, విద్యాసౌకర్యాలు మంచి జీవన పరిస్థితులు మొదలగు సౌకర్యాలు. వారికి వాదవలతో నిమిత్తంలేదు. ఉద్రేకంతో ఎవరైనా ఒకరు ఉపన్యాసం యిస్తే ప్రజలు చప్పట్లు కొట్టవచ్చు. ఇంకొకరు ఉపన్యసించినా హర్ష ధ్వానాలు చేయవచ్చు. ఇప్పుడే మనమందరం అనుకున్నాము. నాలుగు కోట్ల ప్రజల మధ్య యిచ్చి పుచ్చుకోవడాలు జరుగుతున్నాయి. రకరకాలైన సంబంధాలు ఏర్పడుతున్నాయి. భేదాభిప్రాయాలు వచ్చినాయి కనుక విడిపోవాలని వారెవరూ మనకు చెప్పలేదు. నాయకులు ఎందుకు చెపుతున్నారు? ఏ పరిస్థితులలో చెపుతున్నారు? ఏమిటి వారు కోరుతున్నది? అనేదే మనం అర్థం చేసుకోవాలి.

## ఆంధ్రరాష్ట్రం ఎందుకు పుట్టింది?

మద్రాసు నుంచి ఆంధ్రరాష్ట్రం ఏ కారణంవల్ల విడబడిందో అదే కారణంతో ఆంధ్రప్రదేశ్ నుంచి తెలంగాణా విడబడాలని శ్రీకొండాలక్ష్మణ్ ఒకవిపరీతమైన వాదంచేశారు. ఎంత తప్పుయిది! అసలు భాషా ప్రయుక్త రాష్ట్రోద్యమాన్నీ, దాని స్వరూపాన్నీ, శ్రీ లక్ష్మణ్ అర్థంచేసుకున్నారా లేదా అని నా సందేహం. దేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడాలనే వాదం ఎప్పుడు వచ్చింది? స్వరాజ్యం రాకముందు 1913 లో వచ్చినటువంటి భాషా ప్రయుక్త రాష్ట్ర నినాదం క్రింద ఆంధ్రరాష్ట్రం కావాలనే ఉద్యమం వచ్చినదే కాని మద్రాసు రాష్ట్రంలో కొన్ని అన్యాయాలు జరిగినాయని ఆ ఉద్యమం పుట్టలేదు. అన్యాయాలు జరిగితే జరిగివుండవచ్చు కాక. అన్యాయాలు జరిగినందువల్లనే ఆంధ్ర రాష్ట్రం కావాలనే కోర్కె పుట్టిందనుకోవడం చరిత్రను బాగా అర్థం చేసుకోక పోవడమే అవుతుంది.

ఒక ఆంధ్ర రాష్ట్రమే కాదు, దేశంలో వివిధ ప్రాంతాల ప్రజల శ్రేయస్సు కొంకు, పరిపాలనా సౌలభ్యం కొరకు, ప్రజానీకంలో భావ సమైక్యతను సాధించే ఉద్దేశంతో, యింకా అనేక యితర కారణాలవల్ల యిప్పటికి 56, 57 సంవత్సరాల క్రితం భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడాలనే సిద్ధాంతం బయలు దేరింది. దేవుని దయవల్ల 1953 లో ప్రారంభమై 1956 వ సంవత్సరంలో రాష్ట్రాల పునర్విభజన జరిగింది. అందుకని అటువంటి పొరపాటు అభిప్రాయం వారు చెప్పడం నాకు చాలా బాధ కల్గించింది.

## లోపాలు వుంటే సరిదిద్దుకోవచ్చు

తెలంగాణా విలీనీకరణ జరిగిన తరువాత మొత్తంరాష్ట్రంలో ముఖ్యంగా తెలంగాణాలో అనేక భాగాలలో అభివృద్ధి జరిగింది. కాని అనుకున్నటువంటి ఒకటి రెండు అంశాలలో లోపం జరిగింది. ప్రభుత్వంవల్ల కాదు. ప్రభుత్వంలో వున్నటువంటి సభ్యులవల్లకాదు. పరిపాలనలోని అనేక స్థాయిలలో మూడు, నాలుగు ఉద్యోగాలు పోయినంత మాత్రాన మించి పోయింది లేదు. మనం దీనిని సర్దుబాటు చేసుకోవచ్చు.

ఒప్పందం జరిగింది ఒప్పందం ప్రకారం తు. చ. తప్ప కుండా అన్నీ జరిగి వుండవలసింది. అనేక కార్యక్రమాలు నిజానికి జరిగాయి.

ఈ నాడు తెలంగాణాలోనే లక్ష 70 వేల మంది సర్కారీ నేటు సర్వీసులో పని చేస్తున్నారు. ఈ సంఖ్యలో మూడు వేలు కానివ్వండి నాలుగు వేలు కానివ్వండి ఎంత శాతమో ఆలోచించండి. నేను దానిని సమర్థించడం లేదు. లోపం జరిగి వుంటే దానిని సరిదిద్దుకునే శక్తి మనకు లేదా? సరిదిద్దుకోకూడదా? ఆ కారణాన్ని చూపించి రాష్ట్రం విభజించాలని అనడం న్యాయమా అని ప్రశ్నిస్తున్నాను. ఇది కొందరిలో కలిగిన నిరాశా నిస్పృహల పర్యవసానమేగాని యింకొకటి కాదని మనవి చేస్తున్నాను. నాలుగు వేలు కాదు, అయిదు వేల ఉద్యోగాలు అనుకోండి. అది మాత్రం పెద్ద కారణం అవుతుందా? రేపు ప్రొద్దున్న ఒకవేళ రాష్ట్ర విభజన జరిగిందే అనుకుందాం. ఆ రాష్ట్రమైనా స్థిరంగా వుంటుందా? ఉద్యోగాల వాటా ఆ జిల్లాకు యింత, ఈ జిల్లాకు యింత, ఆ ఊరుకు యింత, ఈ ఊరుకు యింత అని ముక్కముక్కలై గ్రామ గ్రామం, వీధి వీధి ఆ కారణం వల్ల విడి వడి పోవలసిందేనా? ఇది న్యాయమేనా? దేశం మొత్తం మీద, ప్రపంచం మొత్తంమీద చూడండి. ఏ దేశంలోనైనా సరే అన్ని జిల్లాలలోనూ అభివృద్ధి స్థాయి ఒకే ప్రమాణంలో వున్నదా? ఈ రోజున తెలంగాణాను తీసుకోండి. దీని పరిస్థితీ అంతే. వివిధ చారిత్రిక కారణాలవల్ల, ప్రకృతికి సంబంధించిన కారణాలవల్ల అభివృద్ధి వివిధ స్థాయిలలో వుంది.

కొన్ని ఉద్యోగాలు కారణంగా చూపి, దేశ చరిత్రలో ఒక బ్రహ్మాండమైన సంఘటన జరిగి, నాలుగు కోట్ల మంది తెలుగు ప్రజలు ఏకమైన తరువాత వారిని విడగొడదాము, చీలుద్దాము, వారి మనస్సులలో విషం వేద్దాము, వారిని మళ్ళీ చేరకుండా చేద్దాము, ఒకరిని ఒకరు తిట్టుకునేటట్లు చేద్దాం అనడం ఎంత విపరీతమైన వాదం? ఒకొక్కసారి, ఆలోచిస్తే హృదయం మండిపోతుంది!

రక్షణలు మొదట ఐదు సంవత్సరాల కొరకు ఉద్దేశించబడి నప్పటికీ, ఒప్పందంలో అయిదు సంవత్సరాలు అని వుంది కాబట్టి నాటి వర్తింపును విస్తరింప జేయడానికి వీలులేదని ఎవరైనా అన్నారా? శాసన సభలో ఆంధ్రప్రాంతం నుంచి వచ్చిన సభ్యులు ఎవరైనాసరే ఈ విధంగా విస్తరింపజేయడానికి వీలులేదని అభ్యంతరం చెప్పారా? ఆ విధంగా పొడిగించడం మంచిదని స్నేహితులు అంతా అనుకున్నారు. పొడిగించడం జరిగింది. అంతేకాని ఎవరో ఆందోళన చేయడంవల్ల పొడిగించలేదు. శాసన సభ్యులు అనేక మంది మంచిదని చెప్పినందువల్లనే చేయడం జరిగింది. మళ్ళీ అయిదు సంవత్సరాలపాటు పొడిగించాలని కోరారు. ఇది చట్టబద్ధమైన ప్రభుత్వేతర సంస్థలకు కూడ వర్తించేటట్లు చట్టం కూడా చేశాము. అన్ని విషయాలూ సుహృద్భావంతోనే చేశాము. ఏదైనా ఒక తప్పు వున్నదని సభ్యులు దృష్టికి తీసుకొని వచ్చినప్పుడు దానిని సరిదిద్దడానికి ప్రయత్నం చేశామా. లేదా? ఉద్యమం వచ్చింది కాబట్టి చేశామా, అంటే కాదు. 1969 జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలల్లో ఉద్యమం వచ్చివుండవచ్చు. కాని 1968 జూలై మాసంలోనే — కొంత మంది దొంగముల్కీ సర్టిఫికెట్లతో వచ్చి చేరుతున్నారని తెలియగానే ఈ సర్టిఫికెటు ఆధారంగా ఉద్యోగాలు యివ్వడానికి వీలులేదు, ఏదైనా ఒక కారణం వల్ల, ఒకవేళ తెలంగాణా ప్రాంతంలో అర్హులైనవారు లేకపోయినప్పుడు ఆ ఉద్యోగాలను ఖాళీగా వుంచవలసిందే తప్ప వాటిని నింపడానికి వీలులేదని ఉత్తర్వులు చేయడం జరిగింది. శ్రీ సంజీవరెడ్డిగారి హయాములో 1958-59 సంవత్సరంలోనే తెలంగాణా ఉద్యోగులకు ఎవరికైనా అన్యాయం జరిగితే పరిశీలించడం కొరకు ముగ్గురు సభ్యులతో ఒక కమిటీని నియమించడం జరిగింది. అప్పటి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, అప్పటి రెవెన్యూ బోర్డు సభ్యుడు శ్రీ గులాం హైదర్, యిప్పుడు ప్రత్యేక తెలంగాణా కావాలంటున్న శ్రీ ఎల్. ఎన్. గుప్తా ఈ కమిటీ సభ్యులుగా వున్నారు.

## ప్రజలే పాలకులు

ఆంధ్ర పాలకులు, ఆంధ్ర పాలకులు అని పదే పదే అంటున్నారు. ఆంధ్రపాలకులనీ, తెలంగాణా పాలకులనీ ఎవరూ లేరు. ప్రజలే పాలకులు. ఈ రాష్ట్ర ప్రజలే ఈ రాష్ట్ర పాలకులు. 'పాలకులు' అనే భావం యివాళ ప్రజలను విడదీయడానికి వచ్చింది. "ఇదిగో నువ్వు నీచంగా చూడబడుతున్నావు" అనే మాటలుకూడా ఆ ఉద్దేశంతోనే వచ్చాయి. ఎక్కడో ఎవరో పదిమంది వ్యక్తులు ఆ విధంగా ప్రవర్తించారనుకోండి. అంతమాత్రాన సమాజం మొత్తం యిక్కట్లు పడవలసిందేనా? సమాజంలో అనేక తరగతుల ప్రజలున్నారు. కొందరు దొంగలూ వున్నారు ఎవరో ఏమిటో అన్నంత మాత్రాన దానిని సమాజమంతటికీ, నాలుగు కోట్ల మంది ప్రజలకు ఆపాదిస్తారా? ఇది పూర్తిగా పొరపాటు. ఎవరైనా ఏదైనా అంటే అతనిని శిక్షించాలి. అతను దానిని చేయకుండా చూడాలి. ఎవరైనా తప్పు చేస్తే, "అతను అలా చేయకూడదు. అతనిని శిక్షించాలి" అని కోరాలి ఎవరో అయిదుగురు లేక పది మంది వ్యక్తులు అంటున్నారు కాబట్టి ఇది రాష్ట్ర విభజనకు, ప్రజలయిక్కట్లకూ కారణం కాకూడదు. మనంసోదరులుగా జీవిస్తూ, ఉత్తమ భారత పౌరులుగా వర్ధిల్లాలి. ఎప్పుడైనా ఎవరికైనా కష్టం కలిగితే దాన్ని సరిదిద్ది క్షమాపణ చెప్పుకునే పద్ధతిలో మనం వుండాలి.

జనవరి 19వ తేదీన కూడిన 45 మంది నాయకులు అనుకున్న దేమిటి? తక్షణమే ఈ కార్యక్రమాలు చేపట్టాలని చెప్పారు. అప్పుడు నేను ఉద్రేకాలు కల్పించే విధంగా చెప్పానా? ఏ ఉద్యోగాలకైతే యిక్కడి నివాసార్హత లేనివారు వచ్చి చేరారో వారిని శీఘ్రంగా పంపిద్దాం అనుకున్నాం. ప్రయత్నంచేశాము. దాని మూలంగా సమస్య కోర్టులకు ఎక్కింది. దానివల్ల కొన్ని చిక్కులు వచ్చాయి. 1968 జూలైలో కానీ, అంతకు ముందుకాని నాయకులు ఏదయితే చెప్పారో, జరిగిన లోపాలను ఎట్లా సరుబాటు చేయాలని అనుకున్నారో ఆ దృష్టితోనే ప్రభుత్వం ప్రవర్తించింది తప్ప మరొక విధంగా జరగలేదు. ఈ నాటికి కూడా చాలా మంది స్నేహితులకు విశాలాంధ్రలోనే నమ్మకంవున్న సంగతి నాకు తెలుసు.

సంఘంలో భావోద్రేకాలకు సంబంధించిన ఒక సమస్య వచ్చినప్పుడు, స్థానికమైన సమస్య వచ్చినప్పుడు ఉద్రేకం వచ్చి ఆ ప్రవాహంతోపాటు ప్రయాణం చేస్తే సులువుగా వుంటుందేమోనని కొందరు అనుకోవడంలో తప్పులేదు. సమైక్య ఆంధ్రప్రదేశ్ కొరకు దృఢంగానుంచొన్న మిత్రులు కొందరు "నేను మే, జూన్ నెలలలో ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలోనికి ప్రవేశించాను. బలవంతంగా తప్పని సరిగా ప్రవేశించవలసి వచ్చింది" అని చెప్పారు.

జనవరి ఒప్పందంనాటి వరకూ ఎవరికీ యింకొక అభిప్రాయం వుందని నేను అనుకోలేదు. ఖచ్చితంగా అప్పుడు మంచి మనస్సుతో ఆంధ్రప్రదేశ్ కావాలనే కోరికతో అందరు స్నేహితులూ పాల్గొన్నారు. లేకపోతే అటువంటి ఒప్పందం కూడా వచ్చేది కాదని నేను మనవి చేస్తున్నాను నేను యిదివరకే అనేక సార్లు యీ ఆందోళన ఎందుకు వచ్చింది. ఎట్లా జరుగుతున్నది ఎవరి ప్రోద్బలంతో జరుగుతున్నదీ చెప్పాను. ఇప్పుడు ఆ అభిప్రాయాలను మార్చుకోవలసిన అవసరంలేదు.

## మిగులు నిధులు

ఇక మిగులు నిధుల విషయం వున్నది. నేను వెనుకటి ముఖ్య మంత్రులను నిందించదలచుకోలేదు. మంత్రులుగా పని చేసిన స్నేహితులు చాలా మంది వున్నారు పేర్లు చెప్పాలంటే పెద్ద జాబితా అవుతుంది. ప్రత్యేక తెలంగాణా కోరే స్నేహితులు వున్నారు. ప్రత్యేక తెలంగాణా కాదు, సమైక్య ఆంధ్రప్రదేశ్ కాదు—ఏమీ అనకుండా వుండేవారు కొంతమంది వున్నారు. ఎంత మంది వున్నప్పటికీ వారిని కూడా నేను ఏమీ అనడంలేదు. మిగులు నిధుల లెక్కలు తేల్చారు. రెండవ ప్రణాళికలో రూ. 22 కోట్లు అన్నారు. మేము వెంటనే వాగ్దానం చేశాము. అది ఖర్చు చేయడం కూడా జరిగింది. అది ఎవరు ఖర్చు చేశారు ? ఈ ప్రభుత్వమే ఖర్చు చేసింది. మూడవ ప్రణాళికలో వచ్చిన నిధులను గురించి ఎవరైనా అడిగారా ? గవర్నరుగారి ప్రసంగంలో ముందే చెప్పడం జరిగింది. అధికారులిచ్చిన అంచనాల ప్రకారం యింత మిగిలి వున్నది; ఈ మిగులు నాలుగవ పంచవర్ష ప్రణాళికలో ఖర్చుపెడతాము; ఇది వరకు రెండవ పంచవర్ష ప్రణాళికలో ఏ మిగులు వుందో అది మూడవ పంచవర్ష ప్రణాళికలో ఖర్చు చేస్తామని గవర్నరు ప్రసంగంలో పేర్కొనబడినది అప్పుడు ఉద్యమం లేదు. స్నేహితులు ప్రభుత్వానికి దురుద్దేశాన్ని ఆపాదించనూ లేదు. ప్రాంతీయ సంఘం చెప్పింది. కాని సమస్య బహిరంగం కాలేదు. అయినప్పటికీ మిగులు నిధులను గురించిన విధానం ప్రకటించాము, ఇంకా పది కోట్లు ఎక్కువనో, 4 కోట్లు ఎక్కువనో ఉంటే వుండవచ్చు. అందుకని మేము కుమార్ లలిత్‌ను నియమించాము. ఒక విషయం మీద అనుమానం వచ్చినప్పుడు ఆ బాధ్యత నా మీద పెట్టుకోవటం న్యాయం కాదు. ఒత్తిడికి లొంగిపోయాననో, దౌర్జన్యానికి లొంగిపోయాననో, లేకపోతే యింకొకటో అనుకోవడం ఎందుకు ? తెలిసిన వారిని పిలుద్దాము, వారు ఎంత చెబితే అంత ఒప్పుకుందాము, పది కోట్లు అటుఅయినా, ఇటుఅయినా ఒప్పుకుందాము అన్నాను. లలిత్ నివేదిక ఒక వారం రోజులు ఆలస్యం అయితే వారు ఏవో లెక్కలు యిచ్చిన తరువాత ప్రభుత్వంలో దిద్దుతున్నారు అని అనుమానాలు వచ్చాయి. ఈ అనుమానాలు వచ్చినందుననే నేను నివేదికను శాసన సభలోనే మొట్టమొదటి సారిగా కవరు విప్పి చెప్పవలసి వచ్చింది. నిజానికి దానిని యిక్కడే విప్పవలసిన అవసరం నాకు లేదు శాసన సభకు చెప్పవలసిన బాధ్యత వుందనుకోండి. సభ ఎదుటనే కవరు విప్పి నిజాయితీని ఋజువు చేసుకోవలసిన అవసరం మాత్రం లేదు. కాని అప్పుడు నెలకొని వున్న అనుమాన పరిస్థితిలో అలా చేస్తే మంచిదేమో అనుకున్నాను. లలిత్ నివేదికను ఒప్పుకొని యింకా ఏదైనా వుంటే తరువాత చూచుకోవచ్చునని ఆ రోజున నేను మనవి చేశాను. దాని పైన రగడ లేచింది. పార్లమెంటులో చర్చ వచ్చింది. తరువాత భార్గవ కమిటీని నియమించారు. కొద్ది రోజులలో వారు తమ నివేదిక అందజేయగలరనుకుంటున్నాను. వారి నివేదికలో మిగులు మొత్తం యింత అని తెలసివ్వండి. వారు ఎంతచెప్పితే అంత మొత్తం అంచలవారీగా, వీలుంటే మూడు నాలుగు సంవత్సరాలలోనే ఖర్చు చేసుకునే ప్రయత్నం చేసుకుందాము. ఒక కుటుంబమే కాదు, ఒక రాష్ట్రమే కాదు— నిర్వహించుకునేటప్పుడు ఏవైనా ఒడుదుడుకులు వస్తే రావచ్చు. వాటిని సర్దుబాటు చేసుకోవచ్చు కదా—జాతీయ అభివృద్ధి మండలిలో దేశం మొత్తం పైన 3,500 కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టితే ఆంధ్రరాష్ట్రానికి వచ్చింది 120 కోట్లు ! అసలు ఆంధ్రరాష్ట్రం ఇండియను యూనియనులో వుందా లేదా అని నేను ప్రశ్న వేశాను. నాకూ కోపం వస్తుంది. ఖర్చు పెట్టవలసింది ఖర్చుపెట్టలేదనే అభిప్రాయం వచ్చినప్పుడు కోపం రావడం సహజమే. అటువంటప్పుడు దానిని సర్దుబాటు చేసే విషయం ఆలోచించాలి తప్ప నా రాష్ట్రానికి రావలసినంత రాలేదు కాబట్టి నేను భారత దేశంలో భాగంకాదని చెప్పవచ్చా ?

## స్వయం పోషకత్వం అంటే ?

ఎవరు చెప్పినా ఎంత సేపూ ఆంధ్రరాష్ట్రం స్వయంపోషకమైనది. తెలంగాణా రాష్ట్రం స్వయంపోషకమైనదని చెబుతున్నారు. ఈ స్వయం పోషకత్వం ఏమిటో నాకు అర్థం కావడం లేదు. గుంటూరు జిల్లా స్వయంపోషకమైనది. నర్సారావు పేట తాలూకా కూడా స్వయంపోషకమైనదే, ప్రతి తాలూకా స్వయం పోషకమైనదే. ఈ స్వయం పోషకత్వం అన్నది దేనిలో అనేదే ప్రశ్న.

వేయి రూపాయలు వచ్చేవారూ కుటుంబం గడుపుకుంటున్నారు. రోజుకు రెండు రూపాయలు వచ్చేవాడూ కుటుంబం గడుపుకుంటున్నాడు. కాబట్టి స్వయం పోషకత్వంకాదు కావాల్సింది.

చిన్న రాష్ట్రాలు అయినంత మాత్రాన గ్రామ గ్రామానికీ, తాలూకా తాలూకాకూ జిల్లా జిల్లాకూ రాష్ట్రాలు ఏర్పాటు చేసుకుంటే దానివల్ల అభివృద్ధి బ్రహ్మాండంగా ఆకాశంనుండి వచ్చి పడుతుం

దనేది ఋజువు చేయగలిగిన శక్తి ఎవరికైనావుంటే అదే మంచి దని ఒప్పుకుందాం. ప్రత్యేక తెలంగాణా రాష్ట్రంవస్తే, అభివృద్ధి త్వరగా జరుగుతుందనీ, కలిసివుంటే 10 సంవత్సరాల్లో జరిగే అభివృద్ధి, విడిపోతే 5 సంవత్సరాల్లో జరుగుతుందని చెప్పే వారిని నేనింతవరకు చూడలేదు. చిన్న రాష్ట్రమైతే ప్రజలు బ్రతకలేరనే ప్రశ్నేలేదు. 1,00 రూపాయలు వచ్చే మంత్రి, 300 రూపాయలు వచ్చే శాసన సభ్యుడూ బ్రతుకుతున్నారు. వంద రూపాయలు వచ్చే జవానూ బ్రతుకుతున్నాడు. బ్రతకడం కాదు ప్రశ్న. ప్రత్యేక రాష్ట్రంలో ప్రజల అవసరాలను శీఘ్రంగా తీర్చ డానికి వీలుగా అభివృద్ధి వేగవంతం ఎలా అవుతుందన్నదే ప్రశ్న. ఎలాగో చెప్పేవారు లేరు.

## పెద్ద రాష్ట్రాలవల్ల ప్రయోజనం

ఇంకొకటి కూడా మనవి చేస్తున్నాను. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత హైద్రాబాదు నగరం ఒక పెద్ద రాష్ట్రానికి రాజధాని అయింది. ఇక్కడ అభివృద్ధి జరగడం సహజం. వద్దన్నా, కాదన్నా కూడా జరుగుతుంది. ఒకరు అడ్డుపడినా ఆగేది కాదు. ఈ గొడవలు వచ్చిన తరువాత లెక్కలు చెప్పుకోవలసిన పరిస్థితి ఏర్పడినది. కాబట్టి నేను మొన్న లెక్కలు చెప్పాను. అంతవరకూ, హైదరాబాదు నగరంలోనే 80 కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టబడిందనీ, ఆంధ్రప్రాంతంలో 40 కోట్లు మాత్రమే పెట్టుబడి పెట్టారనీ ఎంత మందికి తెలుసు ? దీనివల్ల యిక్కడ సుమారు 25 వేలమందికి ప్రత్యేకంగా ఉద్యోగాలు వచ్చాయా లేదా? ప్రభుత్వాలు మార్చినా, తలక్రిందులు చేసినా, పారిశ్రామికాభి వృద్ధి, వ్యవసాయాభివృద్ధి జరిగినప్పుడే అభివృద్ధి సాధ్యమవు తుంది కాని పోట్లాడటం వల్ల కాదు. నాలుగువేల ఉద్యోగాలు అటు వచ్చినా, యిటువచ్చినా, తెలంగాణా వారికి వచ్చినా. ఆంధ్రవారికి వచ్చినా మనం మొత్తం మీద చూసుకోవాలి, యువకుల భవి ష్యత్తు, యిప్పుడు చదువుకుంటున్న యువకుల భవిష్యత్తుకు లాభదా యకమా అని చూడాలి. ఇంత పెద్ద రాష్ట్రం అనీ, యింత పలుకు బడి వుందనీ, యింత బలంవుందనీ, శాసన సభ గట్టిగా వుందనీ అనుకున్న మన రాష్ట్రానికే పలుకుబడి లేకపోతే చిన్న రాష్ట్రంలో తెలంగాణా రాష్ట్రం కావచ్చు ఆంధ్రరాష్ట్రం కావచ్చు-అభివృద్ధి ఏదో ఆకాశం నుంచి తెస్తామనడం కేవలం ప్రజలను భ్రమపెట్ట డమేనని నేను ఖచ్చితంగా మనవి చేస్తున్నాను.

## రాష్ట్రపతి పాలన

రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన కావాలి అన్నారు. ఎందుకు? రాష్ట్రపతి పాలనను ఎప్పుడు పెడతారు? ఎవరికో కొంతమందికి యిష్టం లేకపోతే రాష్ట్రపతి పాలన రావలసినదేనా? మనం శాసన సభ్యులుగా ఎన్నుకోబడ్డాము. 40 మంది కేకలు పెడితే పోతాము. అంతేనా? రాష్ట్రపతి పాలన విధించాలన్నా, ప్రత్యేక అధికారిని నియమించాలన్నా, అవి భారత ప్రభుత్వం చేయవలసిన పనులు. రాష్ట్రపతి పాలన కావాలనడం వితండ వాదం. రాష్ట్రపతి పాలన వస్తే సమస్య పరిష్కారం అవుతుందా? లేక దొడ్డిదారిన ప్రత్యేక తెలంగాణా ఏర్పడ డానికి వీలుంటుందా? లేక ఎవరిపై కోపంవచ్చిం దో వారు పోతే చాలుననే భావమా?

రాష్ట్రపతి పాలన కోర్కెలోని రహస్యం ఏమిటో అందరికీ తెలుసు. పైగా పద్దిరోజుల వరకే రాష్ట్రపతి పాలన కావాలట. ఇదేమివాదమో నాకు అర్థం కావడం లేదు. మేమందరం రాజీనామా పెడతామంటే పెట్టవచ్చు. రాష్ట్రపతి పాలన యీ సమస్యకు పరి ష్కార మార్గంకాదు. లేకపోతే ముఖ్యమంత్రి రాజీనామా పెట్టా లట! నేనెందుకు రాజీనామా పెట్టాలో! నేను నాయకుణ్ణిగానూ, ముఖ్యమంత్రిగానూ వుండాలా అక్కరలేదా అనేది నిర్ణయించేది నా పార్టీతప్ప మరొక్కరుకాదు.

మనం పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో వున్నాము. శాసన సభఅంటూ వుంది. మెజారీ పార్టీ నాయకుడు ఎవరో ఒకరు వస్తారు. అతను ఆ పార్టీలో వున్నంతవరకు అందరి ఆమోదంపై శాసనసభకు ఆమోదం వున్నంత వరకు వుంటాడు. లేకపోతే లక్షణంగా పోతాడు. పార్టీ సభ్యుల విశ్వాసం వుండి కూడా నేను ఎందుకని రాజీనామా పెట్టాలి ?

మా శాసన సభ పార్టీ జూలైలో సమైక్య ఆంధ్రప్రదేశ్ వుండితీరాలని తీర్మానం చేసింది. ఆంధ్రజాతి సమైక్యత చాలా ముఖ్యం.

ప్రత్యేక తెలంగాణా అని ఎవరైతే అన్నారో వారు సమైక్య తను కాపాడ డానికి ఆ నినాదాన్ని ఉపసంహరించుకొని సమైక్య రాష్ట్రం కావాలని అన్నప్పుడు నారాజీనామా. మీ ఎదుట పెడతాను.

విద్యార్థులు ఏ కారణం వల్లనైతే నేమి తిరిగి కళాశాలలకు పాఠశాలలకు వెళ్ళాలనుకున్నారు. ఇందుకు తోడ్పడిన స్నేహితు లందరినీ అభినందిస్తున్నాను. మన అభిప్రాయ భేదాలు వుంటూ వుంటాయి. కాపురంలో వుండే యిబ్బందులు ఒకరోజుతో పోయేవా? కాని మన కోరికల కొరకు లేత మనస్సులకు మనం హాని కలిగించకూడదు వారు మన భవిష్యత్తు. మనసొత్తు. వారు కళాశాలలకు పోవడమనేది చాలా మంచి విషయం. వారిని తిరిగి వెళ్ళగొట్టడానికి ప్రయత్నం చేయవద్దని వినయ పూర్వకంగా వేడు కుంటున్నాను. మన పిల్లలను జాగ్రత్తగా పెంచుకోవలసిన బాధ్యత మనందరికీ వుంది. మనం ఆ దృష్టితో ఆలోచిద్దాము.

ఇంకొక్కటి మనవి చేస్తున్నాను. మన వాదోపవాదాలు ఎట్లా వున్నప్పటికీ గత పదెనిమిది మాసాలుగా ఏది జరిగినప్పటికీ మనం అందరం—ముఖ్యంగా కాంగ్రెసు పార్టీలో వున్న స్నేహితులు యావన్మంది సమైక్యంగా కృషి చేయాలని వినయ పూర్వకంగా— మనవి చేస్తున్నాను. బస్సులపై రాళ్లు రువ్వారు, తగుల బెట్టారు. రైలు పట్టాలు పీకారు. దానివల్ల కొన్ని లక్షలు నష్టంకావచ్చు. అది పెద్ద విషయంకాదు. అయితే దానివల్ల, రాష్ట్రంలో మనం పెంచుకున్న మంచి వాతావరణానికి చాలా నష్టం కలిగింది. కొన్ని కోట్ల రూపాయల నష్టం జరిగింది. ఈ విధంగా జరిగితే ప్రత్యేక తెలంగాణా కాదు, ప్రత్యేక ఆంధ్రకాదు, ప్రత్యేక రాయలసీమకాదు, ప్రత్యేకంగా ఏది వచ్చినా నిష్ప్రయోజనమే. అందుకని మనం మళ్ళీ మంచి వాతావరణాన్ని సృష్టించుకుని సమైక్య రాష్ట్రం వుంచుకొని కృషి చేసినట్లయితే మన నాలుగవ పంచవర్ష ప్రణాళిక కూడా ఒక విధంగా నిరాశాజనకంగా వుండకుండా ఆశాజనకంగా

పంటుందని మనవి చేస్తున్నాను. దానితోపాటు అనేక విధాలుగా కాళివృద్ధి ఏర్పాట్లు చేసుకొనడానికి అవకాశం వుంటుంది. విశాఖ పట్టణం. 500 మైళ్ళ దూరంలోవుంది. అక్కడ ఉక్కు ఫాక్టరీ వువ్వాలని కరీంనగర్ విద్యార్థులు, హైదరాబాదు విద్యార్థులు. మహబూబ్‌నగర్ విద్యార్థులు సమ్మెచేసి బ్రహ్మాండమైన నినాదం యిచ్చారు. అట్లాగే బొగ్గు ప్రాతిపదికగాగల ఏదయినా ఎరువుల ఫ్యాక్టరీ కావాలంటే రాష్ట్రంలో యావన్మంది, శాసన సభలోని ప్రతి ఒక్కరూ 70 కోట్ల ప్రాజెక్టు వచ్చితీరాలని నినాదం యిచ్చి నారే తప్ప అది వద్దు యిది వద్దు అనలేదు. దేవుని దయవల్ల అది మనకు వచ్చింది. యువకులు కావచ్చు. ఇంకొకరు కావచ్చు. ప్రాణ నష్టం జరిగినప్పుడు సానుభూతి చూపవలసిన అవసరంవుంది జరిగిన నష్టానికి చాలా విచారపడుతున్నాము. ఇంకొకరిని చంపా లని కొట్టాలని ఎవరికైనా వుంటుందా? ప్రశాంతంగా వుండాలనే అందరమూ కోరుకుంటాము. అందుకని మీరు కానీ, యింకొకరు కానీ, విద్యార్థులను, పేద ప్రజలను మోసంచేసి వారిని పెడదారిన పెట్టడానికి, తుపాకులకు గురిచేయడానికి ప్రయత్నించవద్దని మనవి చేస్తున్నాను. ఇది చాలా నష్టదాయకమైనది. కోపంతో ఏ సమస్యా పరిష్కారంకాదు. సమస్య వున్నట్లయితే దానిని జాగ్రత్తగా మనం కూర్చుని ఒకటికి నాలుగుసార్లు ఆలోచించుకుని పరిష్కారం చేసుకోవలసిందే తప్ప నిస్పృహవల్ల, కోపంవల్ల, ఉద్రేకంవల్ల, ఏ సమస్యా పరిష్కారంకాదు. మనం కలిసికట్టుగా పనిచేసినప్పుడు అభివృద్ధి సాధించుకునే సామర్థ్యం మనకు వుంటుంది. దానిని పెంపొందించుకోడానికి మనం ప్రయత్నం చేయాలి. అదృష్టవశాత్తు కలిసిన నాలుగు కోట్ల మంది తెలుగు ప్రజలను చీల్చడానికి ప్రత్య క్షంగా కానీ, పరోక్షంగా కానీ ఎంతమాత్రం ప్రయత్నం చేయ వద్దు. అటువంటి ప్రయత్నం జరిగినట్లయితే పునః ఆలోచించుకొని నిదానంగా మంచి చెడులు యోచించుకొని, విజ్ఞతతో వ్యవహరించి దానిని వదలుకోవడం మంచిదని మనవి చేస్తున్నాను.

దేశంలో ఐక్యత కొరకు, ఆంధ్రజాతి సమైక్యత కొరకు, ఆంధ్రజాతి సమగ్రంగా పురోభివృద్ధి చెందడానికి మనలను ఎదు ర్కొంటున్న అనేకమైన సమస్యలను ధైర్యంగా ఎదుర్కొని పరిష్కరించడానికి, యిక్కడ సామాన్య ప్రజలకు ప్రశాంతమైన జీవన పరిస్థితిని కల్పించి వారి అభివృద్ధికి తోడ్పడేందుకు సహాయం చేయవలసిందిగా అందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను.

[తెలంగాణా సమస్య గురించి ఆంధ్రప్రదేశ్ శాసనసభలో జరిగిన చర్చకు సమాధానంగా 29–9–1969 తేదీన ముఖ్యమంత్రి చేసిన ప్రసంగం ఆధారంగా].

## పరిపాలనా విషయాలు

ఉద్యోగుల ఫిర్యాదులను పరిశీలించడానికి రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్ర పబ్లిక్ సర్వీసుకమీషను మాజీ అధ్యక్షులు శ్రీగులాం హైదర్ అధ్యక్షతన ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించింది.

ఈ సంఘంలో రెవిన్యూబోర్డు సభ్యుడు శ్రీ ఎక్బాల్ చంద్, రెవిన్యూ శాఖకార్యదర్శి శ్రీ కృష్ణస్వామిరావు సభ్యులుగా ఉంటారు.

సర్వీసుల ఏకీకరణ విషయంలో భారతప్రభుత్వ ఆదేశాలను విస్మరించడం, తెలంగాణా ఉద్యోగుల నియామకం, ప్రమోషనులు మున్నగు విషయాలలో ప్రత్యేక నిబంధనలు అమలు పరచక పోవడం వల్ల తెలంగాణా ఉద్యోగులు చేసే ఫిర్యాదులను యీ సంఘం పరిశీలిస్తుంది.

### చేనేత పరిశ్రమకు కనీస వేతనాలు

చేనేత పరిశ్రమ సంస్థలలో పనిచేస్తున్న వారి పని పరిస్థితులను పరిశీలించి వారికి నీసవేతనాలు కనిర్ణయించే విషయంలో ప్రభుత్వానికి సలహాయిచ్చేందుకై రాష్ట్ర ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. శాసన సభ్యులు శ్రీ ఎ. నరసింగ రావు దీనికి అధ్యక్షులు.

ఇతర సభ్యులు :

శ్రీయుతులు చామీకరన్ (రిటైర్ రీజినల్ ఎంప్లాయిమెంటు ఆఫీసరు, కర్నూలు, (స్వతంత్ర సభ్యులు) ప్రగడ కోటయ్య (నిడు బ్రోలు, గుంటూరు జిల్లా), కాసిన బసవరాజు (నరసన్నపేట, శ్రీకాకుళంజిల్లా), పండితశివలింగు (బోధన్, నిజామాబాదుజిల్లా)- (యాజమానుల ప్రతినిధులు)

బి.వి. ఆంజనేయశర్మ(గుంటూరు), కె.గోపాలకృష్ణమూర్తి (రైలుపేట, గుంటూరు) శ్రీ ఎం.వీరాస్వామి (వరంగల్లు)- కార్మి కుల ప్రతినిధులు.

గుంటూరుజిల్లా కార్మికశాఖ యిన్స్పెక్టరు ఎక్స్ అఫీషియో కార్యదర్శి.

ఈ సంఘం ప్రధానకార్య స్థానం హైదరాబాదులో వుంటుంది. మూడు నెలలలోగా యీ సంఘం తమ నివేదికను ప్రభుత్వానికి సమర్పిస్తుంది.

# తుఫాను నష్టం వివరాలు

గత సంవత్సరం నవంబరు 7వ తేదీన వచ్చిన తుఫాను వల్ల తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలు, కృష్ణా, విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలలో అపారనష్టం సంభవించింది. గుంటూరు, ఖమ్మం జిల్లాలలో కూడా కొంతనష్టం జరిగింది. ముఖ్యంగా యీ తుఫాను దెబ్బ గోదావరి డెల్టా ప్రాంతానికి ఎక్కువగానూ, కృష్ణా డెల్టాలో కొంతవరకూ తగిలింది. కొల్లేరు సరస్సు పరిసర ప్రాంతానికి బాగా దెబ్బ తగిలింది. మొత్తంమీద 5000 గ్రామాలకూ, 90 లక్షల మందికి పైగా ప్రజలకూ తుఫానువల్ల నష్టం సంభవించింది

## ప్రాణనష్టం

తుఫానువల్ల 250 మంది ప్రాణాలు కోల్పోయారు. కొల్లేరు సరస్సు ప్రాంతంలో ఒకచోట వరద నీటిలో గుడిసెలు మునిగిపోయి 40 మంది మత్స్య పారిశ్రామికులు మరణించారు. 35,000 పైగా పశువులు కూడా తుఫాను దెబ్బకు చనిపోయాయి.

## ఆస్తులు

నాలుగు లక్షలకు పైగా యిండ్లు కూలిపోవడమో, బాగా దెబ్బతినడమో జరిగింది. పంచదార ఫ్యాక్టరీలు, బియ్యం మిల్లులు, ఫ్యాక్టరీ షెడ్డులు, పెంకుటిండ్లు మొదలైన వాటి కప్పులు గాలికి ఎగిరిపోయాయి. చేపలు పట్టే సామగ్రి, నేతమగ్గాలు పాడైపోయినందున అనేక మంది మత్స్య పారిశ్రామికులూ, చేనేత పారిశ్రామికులూ నష్టపడ్డారు.

## పంటలు

వరిపంట కోతకువచ్చే సమయంలో తుఫాను వచ్చినందున కోస్తా జిల్లాలలో సుమారు 3 లక్షల యకరాల్లో పంట పూర్తిగా నాశనమైంది. ఇంకా 18 లక్షల యకరాల్లో పంట దిగుబడి చాలా వరకు తగ్గింది. చెరకు, కొబ్బరి తోటలకు కూడా బాగా నష్టం కలిగింది. అరటి, తమలపాకుల తోటలు పూర్తిగా దెబ్బతిన్నాయి. మొత్తంమీద అన్ని పంటలు కలిసి 30 లక్షల యకరాల్లో నష్టం జరిగింది.

## పబ్లిక్ వర్క్స్

కోస్తా జిల్లాలలో వరద కట్టలు, నీటి పారుదల, మురుగు నీటి సౌకర్యాలకు సంబంధించిన నిర్మాణాలు దెబ్బతిన్నవి. రోడ్లు, పబ్లిక్ భవనాలు, పాఠశాలల భవనాలకూ నష్టం కలిగింది. విద్యుత్ తంత్రులు, టెలిఫోన్, టెలిగ్రాఫ్ పరికరాలకు కూడా బాగా నష్టం సంభవించింది.



తుఫాను బాధితులకు నవంబరు 16న ముఖ్యమంత్రి కాకినాడలో వస్త్రాలను అందజేస్తున్న దృశ్యం

ఖమ్మం, కృష్ణా, ఉభయ గోదావరిజిల్లాలు, విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలలో తుఫాను నష్టం డబ్బు రూపంలో అంచనా వేస్తే మొత్తం రు. 110 కోట్లు.



విశాఖ పట్టణంలో నవంబరు 17న జిల్లాపరిషత్తు సమావేశంలో ప్రసంగిస్తున్న ముఖ్యమంత్రి



తూర్పుగోదావరి జిల్లాలో తుఫానులో తల్లిదండ్రులను కోల్పోయిన ఇద్దరు బాలురను ముఖ్యమంత్రి పరామర్శించినప్పటి చిత్రం



తుఫాన్‌లో దెబ్బతిన్న వైజాగ్ బీచ్‌ను పరిశీలిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, రెవెన్యూ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి.

## డబ్బురూపంలో

డబ్బు రూపంలో నష్టం అంచనా వేస్తే, ఎంత తక్కువ వేసుకున్నా మొత్తం నష్టం రూ 110 కోట్లవరకు వుంటుంది.

జిల్లావారీ నష్టం వివరాలు (రూ. లక్షలలో)

| | వివరాలు | ఖమ్మం | కృష్ణా | పశ్చిమ గోదావరి | తూర్పు గోదావరి | విశాఖ | శ్రీకాకుళం | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | పశువులు | 6 | 8.25 | 26 | 22.50 | – | 0.20 | 62.95 |
| 2. | పనిముట్లు | – | 17 50 | 12.10 | 22.50 | 3.75 | – | 55.85 |
| 3. | ప్రైవేటు భవనాలు | 16 | 64.50 | 470 | 520 | 11.30 | 4.85 | 1,086.65 |
| 4. | పబ్లిక్ భవనాలు | 1 | 5 | 5 | 7 | 3 | – | 21.00 |
| 5. | పాఠశాలలు | 1.50 | 5 | 45 | 45 | 5 | 2 | 103.50 |
| 6. | పట్టా భూములు | – | 6.50 | 19 | 75 | 4 | 2 | 106 50 |
| 7. | పంటలు | 245 | 2,027 | 2,189 | 2,224 | 462 | 355 | 7,502.00 |
| 8. | సేద్యపు నీటి పారుదల వనరులు | 25 | 72 | 65 | 85 | 58 | 40 | 345.00 |
| 9. | రోడ్లు | 0 50 | 34 | 242 | 224 | 27 | 23 | 550.50 |
| 10. | వాటర్ వర్క్సు | 0.10 | 2 | 2 | 5 | 1 | 1 | 11.10 |
| 11. | ఇతరములు | 11 | 203 | 423 | 425 | 11 | 11 | 1,084.00 |
| | మొత్తం | 306.10 | 2,444.75 | 3,498.10 | 3,655.00 | 586.05 | 439.05 | 10,929.05 |

# తూర్పు గోదావరి జిల్లాలో తుఫానుబాధితుల కొరకు సహాయక చర్యలు

తుఫానువల్ల సంభవించిన నష్టాల తీవ్రతను అనుసరించి తూర్పు గోదావరిజిల్లాను మూడు మండలాల క్రింద విభజిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు చేసినట్లు జిల్లా కలెక్టరు శ్రీ ఎల్. మాల కొండయ్య తెలియజేశారు. సముద్రపుటలల రాపిడివలన సముద్రపు, నీటిలో మునగడం వలన దెబ్బతిన్న కోస్తా ప్రాంతాలు మొదటి మండలంలో చేరుతాయి. మొదటి మండలంలో చేరే ప్రదేశాలను ఆనుకొనిఉండి, పంటలు బాగా దెబ్బతిన్న ప్రాంతాలు రెండవ మండలంక్రిందికి వస్తాయి. తుఫానుదెబ్బ తగిలినప్పటికీ మొదటి మండలంలోనూ, రెండవ మండలంలోనూ తగిలినంతటి తీవ్రమైన దెబ్బతగలని జిల్లాలోని మిగతా ప్రాంతమంతా మూడవ మండలంగా వ్యవహరించబడుతుంది.

ఈ విభజన ననుసరించి కలక్టరు జిల్లా మ్యాపును తయారు చేశారు. ఆయా ప్రాంతాలలో సహాయక కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి. రెవెన్యూ డివిజనల్ ఆఫీసర్లు, తహశీల్దార్ల సమావేశాన్ని కూడా కలక్టరు ఏర్పాటుచేశారు. సహాయక కార్యక్రమాలను చేపట్టడంకొరకు ఒక్కొక్క ఫిర్కాను ఒక డిప్యూటి తహశీల్దారు, ఒక తహశీల్దారు లేక బి. డి. ఓ. ఆధీనంలో ఉంచుతూ జిల్లానంతటినీ విభజించారు. సహాయక కార్యక్రమాలన్నింటినీ అమలుజరపడం కొరకు లక్ష్యాలను నిర్ణయించారు. మరణించినవారి కుటుంబాలకు ఇండ్లు కూలిపోయిన వారికి డిసెంబరులో ఆర్థిక సహాయం అందజేశారు.

ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం మొదటి మండలంలో అన్ని పంటల విషయంలోనూ పూర్తి రెమిషను ఇస్తారు. రెండవమండలంలో పసుపు, కూరగాయలు తమలపాకుతీగెలు ఇంకా ఇతర తోటలకు సంబంధించిన పైర్ల విషయంలో పూర్తి రెమిషను యిస్తారు. కొబ్బరి తోటలకుకూడాపూర్తి రెమిషను ఇవ్వాలని కలక్టరు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. రెండవమండలంలో ఇతర పైర్ల విషయంలో దిగుబడి రూపాయికి నాలుగుఅణాలులేక అంతకు తక్కువ వున్న సందర్భంలో పూర్తి రెమిషన్ను, దిగుబడి నాలుగు అణాలకు పైనా, ఆరు అణాలకు మించకుండా ఉన్న సందర్భంలో సగం రెమిషన్ను మంజూరుచేసారు. చెరకుపంట విషయంలో, దిగుబడి ఎకరానికి 10 టన్నులు లేక అంతకుతక్కువ ఉన్న సందర్భంలో పూర్తి రెమిషన్ను, దిగుబడి 10 టన్నులకంటె ఎక్కువగా ఉండి 15 టన్నులకు లోపుగావున్న సందర్భంలో సగం రెమిషన్ను మంజూరుచేస్తారు. మూడవమండలంలో సైతం తమలపాకు తీగెలు, పసుపు, కూరగాయల విషయంలో పూర్తి రెమిషన్ను ఇస్తారు. మిగతా పైర్ల విషయంలో మామూలు రెమిషను నిబంధనలు వర్తిస్తాయి.

ఋణాలు, డ్రైనేజి సెస్సుతోసహా సెస్సులు, పూర్తిగాకానీ, పాక్షికంగాగానీ రెమిషనులకు అర్హత కలిగివున్న భూముల విషయంలో అడ్వాన్సు బెటర్‌మెంటు కంట్రిబ్యూషను ఇన్‌స్టాల్‌మెంటు భూమిశిస్తు బాకీల వసూళ్లన్నీ వాయిదా వేయబడినవి. ఐతే సగం రెమిషనుకు అర్హతకలిగివున్న భూముల విషయంలో ప్రస్తుత సంవత్సరానికి చెల్లించవలసివున్న మిగతా సగం భూమిశిస్తును మామూలు పద్ధతిలో వసూలుచేస్తారు.

కలక్టరు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, రోడ్డు_భవనాలు, (ఇరిగేషన్ బ్రాంచి) డివిజనల్ ఇంజనీర్లు (ఎలక్ట్రిసిటి), (టెలిఫోను డివిజన్లు) ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు(జిల్లాపరిషత్తు) సమావేశాన్ని ఏర్పాటుచేసి సహాయ కార్యక్రమాలను గురించి చర్చించారు. తాళ్లరేవు ప్రాంతంలో మినహా జిల్లాలోని అన్ని ప్రాంతాలలోనూ విద్యుచ్ఛక్తి కనెక్షనను పునరుద్ధరించారు. తాళ్లరేవులో వీటిని పునరుద్ధరించడానికి మరికొన్ని రోజులు పట్టుతుంది. కొన్ని గ్రామాలు మినహా కొన్ని ట్రంక్ కనెక్షన్లుతప్ప జిల్లాలో అంతటా టెలిఫోను కనెక్షన్లను సరిచేయడం పూర్తయింది.

జిల్లా కలెక్టరు రోడ్డు పనులకొరకు రోడ్లు, భవనాలశాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లకు రూ. 10 లక్షలను, పంచాయతీరోడ్ల కొరకు రూ. 15 లక్షలను, భవనాలకొరకు కాకినాడ, రాజమండ్రి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లకు రూ. 5 లక్షలను, జిల్లా పరిషత్తు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుకు రూ. 10 లక్షలను కేటాయించారు. 1970 ఫిబ్రవరిలోగా వరదకట్టల మరమ్మతులకు, డ్రైనేజి, ఇరిగేషన్ పనులకు ఖర్చుచేసే నిమిత్తం గోదావరి కేంద్ర డెల్టా, తూర్పు డెల్టా, గోదావరి హెడ్ వర్క్సు డివిజను, (ధవళేశ్వరము) ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లకు, ఏలేరు డివిజను (పెద్దాపురం) ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుకు కలిపి రూ 25 లక్షలు కేటాయించబడినవి. ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ల ఆధీనంలో పనిచేయడానికి ప్రత్యేక సిబ్బందిని నియమించడం కొరకూ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లకు జీపులను కేటాయించడం కొరకు కలెక్టరు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

"డాపోగ్" పద్ధతిలో నారుమళ్లను పెంచడం కొరకు అదనంగా అవసరమైన విత్తనాలగింజల ఖర్చును, నెల్లూరుజిల్లా నుంచి విత్తనాలగింజలను తెప్పించడానికి అదనంగాజరిగే, రవాణా ఖర్చును, క్రిమిసంహారక మందుల ఖర్చును భరించడానికి సబ్సిడీ క్రింద రూ. 1,65,000 ల మొత్తాన్ని కలక్టరు మంజూరుచేశారు. తుఫానువల్ల దెబ్బతిన్న అనేక ప్రభుత్వ, ప్రయివేటు సంస్థలకు కూడా ఆయన డబ్బు మంజూరుచేశారు. దెబ్బతిన్న పబ్లిక్ భవనాలను మరమ్మతు చేయడంకొరకు, వీధిదీపాలను తిరిగి అమర్చడం కొరకు కాకినాడ మునిసిపాలిటీకి ఒక లక్ష రూపాయలు ఇచ్చారు.

విత్తనాలను, ఎరువులను కొనుక్కోవడం కొరకు, వ్యవసాయ ఖర్చులను భరించడంకొరకు రైతులకు ఆపత్కాల తక్కావీలను ఇచ్చేనిమిత్తం తుఫానుదెబ్బతిన్న జిల్లాలకు ప్రభుత్వం రూ. 50 లక్షలు మంజూరు చేసినట్లు కలక్టరు తెలియజేశారు.

# మహాభారతము

తిరుపతి వెంకట లక్ష్మణశాస్త్రి

ఋతుపర్ణునకు కుండిన నగరములో స్వయంవర సన్నాహము లేవియు కానరాలేదు. అతడు భీమరాజును అడుగజాలకుండెను. ఈ సన్నాగమంతయు అంతఃపుర స్త్రీలు చేసియుండిరి. వారికి మాత్రమే ఋతుపర్ణుడు వచ్చుట తెలియును. అప్పుడు భీమరాజు ఆదరపూర్వకముగా ఋతుపర్ణునితో, 'మీరు ఏ కార్యముచేత ఇక్కడికి విచ్చేసితిరి? మీకు నేనేమి సేవ చేయుదును?' అని యడిగెను. ఋతుపర్ణుడు చాల తెలివిగల వాడుగనుండెను. అక్కడ స్వయంవరార్థమై రాజులు గాని, రాజపుత్రులు గాని ఎవరును రాలేదు. బ్రాహ్మణులును లేరు. స్వయంవర కథయే లేదని తలచి భీమరాజుతో, 'మిమ్ము దర్శించి మీకు నమస్కరించి పోవదలచి యిక్కడకు వచ్చితిని.' అని ఋతుపర్ణుడు బదులు చెప్పెను.

అదివిని భీమరాజు మెల్లగా నవ్వి, ఏదో మహా కారణము లేకుండ అనేక గ్రామములు, నగరములు, వనములు దాటి యితడు ఇన్ని యోజనముల దూరము ప్రయాణము చేసియుండడు, ఏదైనను తరువాత తప్పక తెలియును గదా! యని అతనిని సత్కరించి విశ్రాంతి తీసికొనుటకు పంపెను.

ఋతుపర్ణుడు వెడలిపోవగనే బాహుకుడు రథమును రథశాలలోనికి తీసికొనిపోయి అశ్వములకు మేత,నీరు పెట్టి సుఖముగా రథములోనే విశ్రాంతి తీసికొనుచుండెను. దమయంతి, "రథ ధ్వని విని అది నలుడు తోలునప్పటి ధ్వనియేయని యనుకొని సంతసించితినిగాని, నలుడు కనపడలేదు. బహుశః, ఆ రథ చాలన శక్తి నలుని నుండి వార్ష్ణేయుడు నేర్చుకొని యుండును. లేదా ఋతుపర్ణునకు గూడ అశ్వహృదయ విద్య తెలిసియుండును అతడే రథమును నడపియుండును," అని చింతించుచు నలుని వెదకుటకు తన దూతిని పిలచి నలుని వెదకు విధానమును ఆమెకు తెలిపి ఆదరించి పంపెను. అట్లు దమయంతి పంపిన 'కేశిని' యను దూతి బాహుకుని వద్దకు పోయెను. ఆ యిరువురకు ఈ విధముగా సంభాషణ జరిగెను :—

కేశిని:— మహాభాగా! నీకు స్వాగతము. దమయంతి నీతో పలుకుమనిన మాటలను వినుము. మీరెప్పుడు మీ యూరినుండి బయలుదేరినారు? ఇక్కడికి ఎందుకు వచ్చితిరి? దమయంతి వినదలచు కొనినది.

బాహుకుడు:— ఋతుపర్ణ మహారాజు ఒక బ్రాహ్మణుని ద్వారా రేపు దమయంతికి రెండవ స్వయంవరము జరుగునని విని యుండెను. ఆ స్వయంవరము కొరకు మా రాజు, శత యోజనముల దూరము అలసటలేక త్వరగా వాయు వేగములతో పరుగెత్తగల అశ్వములుగల రథముపైన వచ్చెను. ఆ రథమునకు సారథిగా నేను ఉంటిని.

కేశిని:— ఆ మూడవ వాడెవడు? అతడేలవచ్చె? నీ వెవడవు? నీ పైన రథసారథ్య భారము ఏలమోపబడెను?

బాహు:— అతడు పుణ్య శ్లోకుడగు నలునకు సారథిగా నుండెనట. అతని పేరు వార్ష్ణేయుడు. నలుడు వనవాసమునకు పోయిన తరువాత ఋతుపర్ణుని కొలువులో సారథిగా చేరినాడట. నేను గూడ సాతథ్యములోను వంట చేయుటలోను కుశలుడను. ఋతుపర్ణుడు నన్ను గూడ తన కొలువులో నియమించెను.

కేశిని:— నలుడు ఎక్కడికి పోయిన సంగతి వార్ష్ణేయునకు తెలియునా? నలరాజు గూర్చి యితడు నీతో నెప్పుడైన ముచ్చటించెనా?

బాహు:_ వార్ష్ణేయుడు నలుని సంతానమును ఈ నగరములోనే ఉంచి ఋతుపర్ణుని కడకుపోయెనట. ఆ తరువాత నలుని సంగతి అతనికి తెలియదు. ఇతరు లెవ్వరును నలుని గుర్తు పట్ట జాలరు. నలుడిప్పుడు స్వరూపము నశించగా గూఢముగా ఈ లోకములో సంచరించుచున్నాడు. నలరాజు తన గుణములను గాని, లక్షణములను గాని యితరుల యెదుట ఎప్పుడుగూడ ప్రకటించడు గనుక అతని జాడ అతనికే తెలియును. లేదా భగవంతునకు తెలియును.

కేశిని:_ పూర్వము ఒక బ్రాహ్మణుడు అయోధ్యకు పోయి దమయంతి యొక్క కథనమును జనులలో చెప్పినప్పుడు ఆ బ్రాహ్మణునకు నీవు బదులు పలికి యుంటివి. ఆ ప్రియ వచనములనే యిప్పుడు తిరిగి నీ ముఖతః దమయంతి వినదలచుచున్నది.

అదివిని బాహుకుడు, మనస్సులో బాధపడి కన్నీరుగ్రమ్మగా దుఃఖమును అణచుకొని డగ్గుత్తుకతో తాను అప్పుడు అనిన మాటలన్నియు చెప్పుచు కన్నీరు ఆపికొనజాలక బిగ్గరగా ఏడ్చెను. తరువాత ఆ వృత్తాంత మంతయు కేశిని దమయంతి కడకు పోయి తెలిపెను.

ఆ మాటలన్నియు విని దమయంతి అతడే నలుడని అనుమానపడి కేశినితో, 'నీవు తిరిగి అతని కడకు అతనికి ఎరుక పడకుండ పోయి అక్కడనే చాటుగా నిలిచి యుండి అతని ప్రవర్తనమును పరీక్షించుము. అతడు చేయు ప్రతి కార్యమునకు కారణమరయు చుండుము. అతడు నిర్బంధించినను, అగ్నినిగాని జలమునుగాని అతనికి ఈయకుండ జూడుము. అది యంతయు చూచి నాకు తెలుపుము.

దమయంతి యాజ్ఞగొని కేశిని బాహుకుని కడకు పోయెను. అశ్వవిద్యా విశారదుడగు బాహుకుని లక్షణములన్నియు కనిపెట్టెను. తిరిగి దమయంతి వద్దకు వచ్చి బాహుకుని యందుగల దైవ_మానుష విశేషములన్నియు ఈ విధముగా తెలిపెను "దమయంతీ! అతడు చేయు ప్రతికార్యము పవిత్రమైనది. అట్టి మానవుని నేనింతకు పూర్వము ఎక్కడ గూడ చూడలేదు, వినలేదు. అతడు చిన్న ద్వారముకడకు పోయికూడ తలవంచి దానిలో దూరడు. ఆ ద్వారమే యతనికన్న పొడవుగా తత్కాలమునందు పెరిగి యతడు తలవంచకుండ పోవుటకు అనువుగానగును. ఇరుకైన స్థలములుగూడ అతడు పోవుచున్నప్పుడు విశాలములగును. భీమరాజు ఋతుపర్ణునకు అనేక భోజ్యపదార్థములను పంపి యుండెను. వంటయింటిలో నిర్జలములైన కడవలు ఉంచబడి యుండెను. వానిని నలుడు చూడగనే అవి జలపూర్ణములయ్యెను. ఆ నీటితో నతడు భోజనవస్తువులను కడిగి పొయ్యిపై నుంచెను. కొంచెము గడ్డి తీసికొని సూర్యునకు చూపించగనే అది మండి మండి అగ్నిని ప్రజ్వలింప జేయుటకు అనువుగా నయ్యెను. అతడు అగ్నిని స్పృశించినను దానివేడి అంటదు. ఘటములలో జలము కొంచెమున్నను, అతనికి కావలసినప్పుడు నిండుగా వచ్చును. అతడు పుష్పములను తీసికొని చేతితో నలిపినను అవి తిరిగి వికసిత పుష్పముల వలెనే యుండును. ఇవియేకాక అతని యందు ఇంకను అద్భుతములు అనేకములు చూచితిని." అని చెప్పెను.

దమయంతి ఆ మాటలన్నియు విని యతడు నలుడేయని ఆ యద్భుత చేష్టల వలన నిశ్చయించుకొనెను. తిరిగి కేశినిని బాహుకుని కడకు పంపి, అతడు పరాకుగా నున్నప్పుడు అతడు చేసిన వంటకములను తీసికొని రమ్ము' అనెను. కేశిని అట్లే చేసెను. అవి రుచి చూచి దమయంతి 'ఇది నలుని పాకమే సందేహములేదు' అని నిశ్చయించుకొనెను. ఇంకను పరీక్షింప దలచి దమయంతి తన కొడుకును, కూతురిని కేశిని వెంట బాహుకుని కడకు పంపెను. బాహుకుడు వారిని చూడగనే పుత్ర ప్రేమ చేత ఒడిలో కూర్చున బెట్టుకొని తలమూర్కొనుచు ఆదరించి మిగుల దుఃఖించెను. తన రహస్యము బయట బడునను భయముతో నతడు కేశినితో "కల్యాణీ! నాకును ఇట్టి పిల్లలే యుండిరి. వీరిని చూడగనే వారు జ్ఞప్తికి వచ్చి దుఃఖించితిని. భద్రే! నీవు మాటిమాటికి ఇక్కడికి వచ్చుచు పోవుచున్నావు. ఎవరైన చూచినచో మనపై దోషమును మోపుదురు. మేము ఇక్కడికి అతిథులముగా వచ్చినవారము. కనుక నీవు సుఖముగా రాజభవనములోకి పొమ్ము, ఇంక రాకుము" అని చెప్పి ఆమెను పంపెను.

## రూపమొక్కటితప్ప నలుడే ....

కేశిని వచ్చి జరిగిన సంగతి దమయంతికి తెలిపెను. ఆ వృత్తాంత మంతయు విని దమయంతి కేశినిని తల్లికడకు పంపి ఆమెతో నిట్లు చెప్పుమనెను:_ "నేను బాహుకుని వృత్తాంత మంతయు కనుగొనినాను. రూపమొక్కటి దప్ప ఇతర లక్షణము లన్నియు నలునివే యతనికి ఉన్నవి. కనుక నేను స్వయముగా అతనిని చూచి నిర్ణయింప దలచినాను. అతనినైనను నాకడకు రప్పింపుడు, లేదా, నన్నైనను అతని కడకు పంపుడు. నీకు ఉచితమని తోచినచో తండ్రిగారికి ఈ సంగతి తెలుపుము. లేదా, వారికి తెలుపకయే యీ యేర్పాట్లను చేయుము."

ఆ మాటలను విని, తల్లి భీమరాజునకు ఆ సంగతియంతయు తెలిపెను. అతడు అనుజ్ఞ యిచ్చెను. తల్లి దండ్రుల యాజ్ఞగొని దమయంతి రాజభవనములో తానుడున్నచోటికి బాహుకుని పిలిపించెను. అతడు రాగనే చూచి దమయంతి మిగుల దుఃఖించి యతనితో నిట్లనెను:_ బాహుకా! పూర్వ మెక్కడనైన నీవు, నిద్రించుచున్న భార్యను విడిచిపెట్టి పోయిన ధర్మాత్ముని చూచితివా? నిరపరాధురాలైన ప్రియకాంతను అలసి నిద్రించుచున్న దానిని విడిచి నలుడు దప్ప మరియొక డెవడైన పోవునా ? అతడు నన్ను అట్లు విడిచి పోవుటకు అతనికి నేను బాల్యమునుండి ఏ యపరాధమును చేసి యుంటిని? సాక్షాత్తు దేవతలనుగూడ విడిచి అతనిని చేపట్టితినే, పుత్రవతినే. అతనినే అనుసరించుచున్నదానినే. అట్టి నన్ను ఎట్లు విడిచిపోయెను? అగ్నిసాక్షిగా దేవతల సమక్షములో పాణి గ్రహణము చేసి సత్యమును పలికెనే. ఆ మాటలన్నియు నన్ను విడుచునప్పుడెక్కడికి పోయెను?"

దమయంతి అట్లు పలుకుచుండగా బాహుకుని కన్నుల నుండి నిరంతరము అశ్రుధారలు ప్రవహించుచుండగా దమయంతితో నిట్లు పలికెను:— "కాంతా! నేను రాజ్యమును పోగొట్టు కొనుటకు, నిన్ను విడుచుటకు కలిపురుషుడే కారణము. ఇందులో నేను స్వయముగా చేసిన దోషమేదియులేదు. నీ శాపముచేత కలిపురుషుడు నాలో విషపూరితుడుగా మిగుల బాధపడుచుండెను. అతడు అగ్నిలో బడిన అగ్నివలె కుములుచుండెను. నా ప్రయత్నము చేతను, తపస్సు చేతను అతడు నిర్జింపబడెను. అందువలన ఇప్పుడు మన దుఃఖము అంతమొందెను. కలి నన్ను విడిచి పోయెను గనుక ఇప్పుడు నిన్ను పొందుటకు ఇక్కడికి వచ్చితిని. ఏ స్త్రీ యైనను, తనకు అనురక్తుడు, భక్తుడుగానున్న పతిని విడిచి యితరుని పెండ్లి చేసికొనునా? నీవిప్పుడు ఇతరుని చేపట్ట చూచుచున్నావే! 'దమయంతికి ద్వితీయ స్వయంవరము జరుగు'నని చెప్పుచూ మీ దూతలు దేశమంతట తిరుగు చున్నారే! 'దమయంతి స్వేచ్ఛా చారిణి, తనకు ఇష్టము వచ్చిన అనుకూలుడగు వరుని కోరి రెండవ పెండ్లి చేసికొనును.' అను మీ దూతల వాక్యములను విని ఋతుపర్ణ మహారాజు నిన్ను వరించుటకు త్వరితగతిని ఇక్కడికి వచ్చెను."

దమయంతి నలుని దుఃఖపు మాటలను విని, గడగడ వణకుచు, అత్యంతము భయపడి చేతులు జోడించి యిట్లు బదులు పలికెను:— "రాజా! నీ కొరకు దేవతలను గూడ విడిచితినే. ఇతరుల నెట్లు చేపట్టుదును? నిన్ను కనుగొనుటకు దేశమంతటను బ్రాహ్మణులను పంపితిని. అయోధ్యలో పర్ణాదుడను బ్రాహ్మణుడు నిన్ను గుర్తుపట్టి నీతో మాట్లాడి నీ జాడ కనుగొని నా కడకు వచ్చెను. నేను నిన్ను రప్పించుటకు ఈ యుపాయమును పన్నితిని. నీవుదప్ప ఈ నూరు యోజనముల దూరము ఒకనాటిలో అశ్వములను తోలువాడు మరియెవ్వడును లేడుగదా! రాజా! నే నెప్పుడుగూడ దుష్ట ప్రవర్తకురాలను గాను. నీ పాదములను స్పృశించి శపథము చేసెదను. సర్వజగత్తునందు స్వేచ్ఛగా సంచరించు ఈ వాయుదేవుడు, నేనొకవేళ పాపకృత్యమును చేసి యుండినచో, నా ప్రాణములను హరించుగాక. సమస్త లోకముల పైన సంచరించు సూర్యుడు, సర్వభూతముల యంతరంగమునందు సంచరించు చంద్రుడు నా ప్రాణములను హరింతురుగాక. ఈ ముగ్గురు దేవతలు త్రిలోకములను భరించువారు గదా! నా మాటలో అసత్యమున్నచో వీరు సాక్ష్యము పలుకుదురుగాక."

## దేవతల సాక్ష్యము

అని దమయంతి చెప్పిన తోడనే వాయుదేవుడు అంతరిక్షము నుండి యిట్లు పలికెను:— "నలరాజా! సత్యము పలుకుచున్నాను వినుము. ఈ దమయంతి పాపము చేయలేదు. మేము ముగ్గురు దేవతలము మూడేండ్లవరకు ఈమెను రక్షించితిమి. మేము దీనికి సాక్షులము. ఈమె తన శీలమును సర్వదా కాపాడుకొనుచుండెను. నీవు దప్ప నూరు యోజనముల దూరము ఒక్కనాటిలో అశ్వములను నడిపించగలవాడు మరియొకడు లేడని యీమె యీ యుక్తిని పన్ని నిన్ను ఇక్కడికి రప్పించెను. ఇప్పుడు నీ దమయంతి నీకు లభించెను. ఆమెకు నీవును లభించితివి. శంకించకుండ ఆమెను పరిగ్రహింపుము."

వాయుదేవుడు ఇట్లు చెప్పుచుండగా అంతరిక్షము నుండి పుష్పవృష్టి వారిపై కురిసెను. దేవతలు దుందుభులు మ్రోగించిరి, అనుకూల వాయువువీచెను. అది చూచి నలునకు దమయంతిపై సంశయము పోయెను. కర్కోటకుని స్మరించి నలుడు ఆ సర్పరాజు ఇచ్చిన వస్త్రమును కప్పికొనగనే స్వస్వరూపముతో విరాజమానుడయ్యెను. సుందర రూపముతో పూర్వము వలె నున్న భర్తను దమయంతి చూచి సంతసించి ఆతనితో గాఢాలింగనము చేసికొనెను. నలుడు దమయంతిని, పిల్లలను ఆదరించి చేరదీసెను.

జరిగిన వృత్తాంత మంతయు దమయంతి తల్లి భీమరాజునకు తెలిపెను, 'రేపుదయము వారితో కలసికొనెదను.' అని భీమరాజు చెప్పి పంపెను. ఆ రాత్రి నలదమయంతులు తమకు వనములో గలిగిన కష్టములను పరస్పరము చెప్పికొనుచు సుఖముగా నుండిరి. భీమరాజు ఇంటిలో మూడేండ్ల తరువాత వారిరువురు కలసికొని ఆనంద మనుభవించుచుండిరి. సగము పెరిగిన పైరుగల భూమి జలమును పొంది ఆనందించినట్లుగానే దమయంతి నలుని పొంది యానందించెను. చంద్రునితో గలిసిన రాత్రివలె మిగుల నుల్లాసముతో నుండెను.

## అశ్వహృదయ విద్యాస్వీకరణ

మరునాడు ఉదయము నలదమయంతులు భీమరాజును దర్శించి ఆతనికి నమస్కరించిరి. భీముడు వారిని పుత్రులవలె ఆదరించి ఆశీర్వదించెను. కుండిన నగరవాసులు గొప్ప ఉత్సవములు చేసికొనిరి. పురమును అలంకరించిరి. దేవాలయములలో పూజలు సలిపిరి. ఋతుపర్ణుడు ఆ సంగతి తెలిసి సంతసించి నలుని క్షమింపుమని వేడెను. నలుడుగూడ, తానేమైన అపరాధము చేసి యుండినచో క్షమించుమని యతనిని వేడుకొనెను. 'నేను మీ యింట సగౌరవముగా సర్వసుఖములను అనుభవించితిని. పూర్వము గూడ మనము బంధువులమే.' యని యతనిని నలుడు సమాదరించెను. 'నీకు ఈయవలసిన 'అశ్వహృదయ' విద్య నాకడ నట్లే యున్నది. దానిని స్వీకరింపుము' అని ఆ విద్య నతనికి నేర్పెను. ఋతుపర్ణుడుగూడ 'ద్యూత విద్యను' విధిపూర్వకముగా నలునకిచ్చెను. మరియొక సారథిని తోడ్కొని స్వనగరమున కతడు పోయెను.

ఆ తరువాత నలుడు చాలా కాలము కుండిన నగరమునందు ఉండక ఒకనెల తరువాత దమయంతీ సమేతుడై నిషధ దేశమునకు పోయెను. ఒక రథము, పదియారు ఏనుగులు, ఏబది అశ్వములు, ఆరు వందల సైనికులు గల చిన్న పరివారముతో నలుడు అతి సంరంభముతో పురమును ప్రవేశించెను. పుష్కరుని వద్దకు పోయి యిట్లనెను:—

"పుష్కరా! నేను నీతో మరల జూదమాడుటకు వచ్చితిని. అనేక ధనములను సంపాదించుకొని వచ్చినాను. ఈ సారి దమయంతిని గూడ ఒడ్డుటకు సంసిద్ధుడను. నీవైవునుండి సమస్త రాజ్యమును పణముగా పెట్టవలెను. చివరకు మన ప్రాణములను గూడ పందెము పెట్టవలసియుండును. జూదములో పందెముగా ఒడ్డబడిన యితరుని సంపదను, రాజ్యమును గెలుచుకొనినవాడు తిరిగి అతడు దానికొరకై జూదమాడ దలచినప్పుడు తప్పక ఆతని

కోర్కె తీర్చవలెను. ఇది ద్యూత ధర్మము. ఇదియొక ముఖ్యమైన సంప్రదాయము. అదినీకు ఇష్టము లేకున్నచో యుద్ధ ద్యూతమైన చేయుదము. మనమిరువురమే రథములలో నుండి యుద్ధము చేయుదము. నీవో నేనో దానిలో నశించెదము గాక.

"ఈ రాజ్యము మా వంశపరంపరముగా అనుభవించుచున్నాము. ఇట్టిది పరహస్తగతమైనప్పుడు ఏ యుపాయము చేతనైనను తిరిగి దానిని రాబట్టుకొనవలెను. ఇది ధర్మము అని పెద్దలు చెప్పుదురు. కనుక నీవిప్పుడు జూదమునకు గాని, లేక యుద్ధమునకు గాని సంసిద్ధుడవు కమ్ము." ఆ మాటలువిని పుష్కరుడు జూదములో తనకు 'అవశ్యముగా జయము కలుగును.' అను దుర్భ్రాంతి చేత నలునితో నిట్లనెను:_ "రాజా! నా అదృష్టవశాత్తు తిరిగి నీ ధనము, నీ భార్య నా వశము కానున్నది. దీనితో ఇంతవరకు దమయంతికి పట్టిన దుర్దశ తీరిపోవును. ఆమె ఇప్పుడు ధనముతో పాటు ఇంద్రునివంటి నన్ను చేరి సుఖపడగలదు. ప్రతి దినము నిన్నే స్మరించుచుంటిని. నేటికి నాకోర్కె తీరినది. ఇప్పుడు దమయంతిని గెలుచుకొని కృతకృత్యుడనయ్యెదను. ఆమె యెల్లప్పటికిని నా మనస్సులోనే మెదలుచుండును."

## తిరిగి రాజ్యప్రాప్తి

పుష్కరుని అసంబద్ధ ప్రలాపములువిని నలుడు అతని తల నరకుటకు ఉద్యుక్తుడయ్యెను. కాని, అట్లుచేయక కోపముతో నతనితో 'వ్యర్థ ప్రలాపములు ఏలచేసెదవు? జూదమాడుటకు ఆరంభింతము' అని చెప్పి ఒకసారి మాత్రమే పాచికలు వేసి దాని ఫలము ప్రకారము నడచుకొందము' అని ఒడంబడిక చేసికొని జూదమునకు ప్రారంభించిరి. ఒక్క పాచికలోనే పుష్కరుని ఓడించి నలుడు అతని సర్వ సంపదలను, రాజ్యమును గెలుచుకొనెను నలుడు పుష్కరునితో 'మూర్ఖుడా ! ఇప్పుడు సర్వస్వము నా వశమైనది. దమయంతిని కన్నెత్తి కూడా నీవు చూడజాలవు. ఆమెకు సేవకుడవుగా నుండుటకు సిద్ధముగా నుండుము. పూర్వము నా దోషముచేత రాజ్యమును నేను పోగొట్టుకొనలేదు. అది కలి దోషము. ఆ దోషము నీపై మోపను. మూర్ఖుడవు నీకు అది తెలియదు. నీపై దయతలచి నిన్ను ప్రాణములతో విడుచుచున్నాను నీకు పూర్వము ఉన్న సంపదలు గూడ ఇచ్చితిని. నీయెడల ప్రీతి గూడ పూర్వము వలెనే నిస్సంశయముగా నుండును. నీ యందు మైత్రిని జూపుచుండెదను. పుష్కరా! నీవు నా సహోదరుడవు. నూరేండ్లు హాయిగా బ్రతుకుము."

ఈ విధముగా నలుడు పుష్కరుని ఓదార్చి యతనిని ఆలింగనము చేసికొనెను. పుష్కరుడు ఆ పుణ్యశ్లోకుడగు నలునకు నమస్కరించి, 'రాజా! నీకీర్తి శాశ్వతముగా దశదిశలు వ్యాపించుగాక. నాకు ప్రాణదానము, రాజ్యదానము చేసితివి. నూరేండ్లు హాయిగా బ్రతికియుండుము.' అని చెప్పి నిషధనగరములో ఒక నెల ఉండి స్వపురమునకు సపరివారుడై పోయెను. నలుడు, తన రాకచే సంతోషించిన ప్రజలు గొప్పగా నలంకరించిన తన నగరములో ప్రవేశించి పురజనులకు సంతోషము గలిగించెను. పౌరులు 'రాజా! నేడు మాకోర్కెలు ఫలించినవి. ఆనందించుచు దేవతలు ఇంద్రుని గొలచినట్లు నిన్ను సేవించు భాగ్యము మాకు మరల అబ్బినది." అని తమ సంతసము వెలిబుచ్చిరి.

"నలుడు ప్రజారంజకముగా ధర్మముతో రాజ్యము నేలుచుండెను. గొప్ప కీర్తిని తేజస్సును గాంచెను. జంబూ ద్వీపములోని సమస్త రాజులలో చంద్రునివలె ప్రకాశించుచుండెను. వేద విహితముగా ననేక యజ్ఞములను చేసెను." అని బృహదశ్వ మహాముని నలోపాఖ్యానమును సమగ్రముగా యుధిష్ఠిర మహారాజునకు చెప్పి, రాజా నీవుగూడ రాజ్యమునుపొంది సుఖపడెదవు. చూచితివా! నల మహారాజు జూదము కారణంగా భార్యతోపాటు ఎంతటి దుఃఖమును అనుభవించెనో. అతడు ఒంటరిగానే అరణ్యవాసము చేసి ఘోర దుఃఖమును అనుభవించెను. తిరిగి అభ్యుదయమును పొందెను. ... నీవె నేనో భార్యతో, నలుగురు సహోదరులతో వనవాసము ... వి. నీకొక విధముగా నిచట ఆనందముగానేయున్నది. ధర్మమును మాత్రమే చింతించుచు కూర్చొనియున్నావు. వేద వేదాంగ పారగులైన బ్రహ్మణులు నిత్యము నిన్ను అనుసరించుచున్నారు. నీకు దుఃఖమెక్కడిది. అని చెప్పి నల చరిత్రమహత్వము నిట్లు చెప్పదొడగెను.

'కర్కోటకస్య నాగస్య దమయంత్యాః నలస్యచ ।
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనం ॥ అనిచెప్పెను.

అనగా, నాగరాజగు కర్కోటకుడు దమయంతి, నలుడు, రాజఋషియగు ఋతుపర్ణుడు. ఈ నలుగురిని కీర్తించినచో, నామ స్మరణము చేసినచో కలిదోషము నశించును' అని యర్థము. (ఈశ్లోకమును ప్రతిరాత్రియు నిద్రకు పోవునప్పుడు పఠించి శయనించుట సంప్రదాయమై యున్నది.)

"రాజా ! నీవంటివారు, కలినాశకమగు ఈ కథను విని ఊరటచెందుట అవసరము. పురుషుడు తన పౌరుషము చేత సంపాదించిన వస్తువులన్నియు అస్థిరములని తెలిసికొని, అవి లభించినప్పుడు సంతోషమునుగాని, లేనప్పుడు దుఃఖమును గాని పొందకుండ నుండవలెను. ఈ నలోపాఖ్యానమును వింటివి. ఇక నైన మనశ్శాంతి గలిగియుండుము. దుఃఖించకుము. సత్వగుణ భూషితులైన మానవులు, తమకు దైవము వ్యతిరేకమై, తమ పౌరుషము గూడ పనికిరానప్పుడు అనవసరముగా వ్యసనముల పాలు కారు.

## ఫలశ్రుతి

ఎవరైతే ఈ సచ్చరితము వినెదరో, చెప్పెదరో, వారికి దారిద్ర్యము కలుగదు. అట్టివారు సమస్త మనోరథములను పొంది ధన్యులయ్యెదరు. ప్రాచీనమైన యీ యితిహాసమును విని, పుత్ర పౌత్ర ధనధాన్య పశు సంపదలను పొంది మనుష్యులలో నగ్రగణ్యులయ్యెదరు ఎవరైన తిరిగి నిన్ను జూదమాడుటకు పిలిచి ఓడించెదరను భయమును విడువుము. అట్టి భయమును నేను దూరము చేసెదను. ధర్మజా ! నేను ద్యూత విద్యయొక్క రహస్యములన్నియు పరిపూర్ణముగా నెరిగినవాడను. దానిని నీకు నేర్పెదను " అని బృహదశ్వ మహాముని చెప్పి యతనికి అక్షహృదయ విద్య నేర్పెను. ధర్మరాజు దానిని గొని సంతసించెను. తరువాత బృహదశ్వుడు యుధిష్ఠిరునకు అశ్వహృదయ విద్యనుగూడ నేర్పి స్నానానుష్ఠానములను చేయుటకు వెడలిపోయెను.

( స శే ష ము )

# భారత మహిళలకు గాంధీజీ సందేశం

రావుల శ్రీరామచంద్రమూర్తి

అనాది నుంచి భారత స్త్రీ గృహిణిగా పరిగణింపబడి గృహ కృత్యాలతోనే ఆమె జీవితం పరిసమాప్తమవుతున్నది. కాని, సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో వస్తున్న మార్పులతో ఈనాడు స్త్రీలు సంఘంలో తమ స్థానాన్ని కొంతవరకు పెంపొందించు కొనగలిగారు. మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత రాజ్యాంగంలో స్త్రీకి పురుషునితో పాటు సమాన హక్కులు ప్రసాదించినా సంఘంలో నేటికీ స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఆచరణలో యింకా రాలేదనే చెప్పాలి. మన సాంఘిక వ్యవస్థను పునర్వ్యవస్థీకరించి ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచడానికి, ఆర్థిక స్థితిగతులను మెరుగు పర్చడానికి పంచవర్ష ప్రణాళికల ద్వారా ప్రయత్నాలు జరుగుతున్నాయి. సంఘంలో మహిళల స్థానాన్ని అభివృద్ధి చేయడానికి మహిళా సంక్షేమసంస్థలు నిర్విరామకృషి చేస్తున్నాయి. అయితే అనేక వ్యక్తిగత, సాంఘిక సమస్యలు ఉత్పన్నమై మహిళా సంక్షేమ కార్యక్రమాలకు అవరోధం కలిగిస్తున్నాయి. జాతిపిత మహాత్మాగాంధీ ఏనాడో భారత మహిళల గురించి వెలిబుచ్చిన కొన్ని అమూల్యాభిప్రాయలు ఈ సందర్భంలో గమనించదగినవి.

భారత వనితలకు పరిపూర్ణ స్వాతంత్ర్యం ఉండాలని గాంధీజీ అభిప్రాయం, స్త్రీకి కూడ పురుషునితో పాటు సమాన హక్కులు ఉండాలి స్త్రీగా జన్మించినంత మాత్రాన సంఘంలో ఆమె స్థానం గుర్తించక పోవడం అన్యాయం, పురుషుడు స్త్రీ కంటె బలవంతుడైనప్పటికీ నైతికంగా శక్తివంతుడు కాలేడు, కుటుంబసభ్యుల అవసరాలకు సరిపడు ఆదాయాన్ని సేకరించడం భర్తబాధ్యత. ఆ ఆదాయాన్ని సభ్యులందరి సంక్షేమానికి వినియోగించడం భార్యవిధి. తమ కుటుంబ ఆదాయాన్ని మెరుగు పర్చుకోడానికి మహిళలు పరిశ్రమలలోను, వ్యవసాయంలోను తీరిక సమయాలలో పనిచేయవచ్చును. కాని గృహకృత్య నిర్వహణ వారి ముఖ్యవిధిగా గమనించాలి.

సంఘంలో మహిళలకు ఉన్నతస్థానాన్ని ఏర్పరచడానికి దయార్ద్ర హృదయం, అత్యంతనిగ్రహం కలిగిన సీత, దమయంతి ద్రౌపది వంటి పతివ్రతా శిరోమణులు ఎందరో మన దేశంలో ఉద్భవించాలని మహాత్మాగాంధీ ఆకాంక్ష. తమవిధులను సక్రమంగా నిర్వర్తించు కోవడానికి స్త్రీలకు విద్య అవసరం. వారికి ప్రాంతీయ



భాషా పరిజ్ఞానం సరిపోతుంది. స్త్రీలు విలువైన ఆభరణాలు ధరించడం దేశాభ్యుదయానికి కొంతవరకు నష్టమనే చెప్పాలి. ఆర్థిక సాంఘిక రంగాలలో ఇప్పుడే అభివృద్ధి చెందుతున్న మన భారతావనిలో ప్రజల వద్ద చాల బంగారం నగల రూపంలో ఉండడం మన జాతీయ కార్యక్రమాలకు ఆటంకమని వనితలంతా గుర్తించాలి.

ప్రజాసేవ, రాజకీయ రంగాలలో మహిళలు వహించాల్సిన పాత్ర గురించి గాంధీజీ అభిప్రాయాలను తిలకిద్దాం, ప్రతి బాలిక పుట్టింది వివాహ మాడటానికే కాదు. ఒకే పురుషునికి జీవితాంతం సేవ చేయడానికేకాదు, ప్రజాసేవయే తమ పరమార్థంగా భావించి తమ జీవితాలను ప్రజాసేవకు అర్పించిన మహిళలెందరో ఉన్నారు. కొంతమంది స్త్రీలు రాజకీయాలలో ప్రవేశిస్తారు. కాని, రాజకీయములలో వారికి స్వేచ్ఛ, స్వతంత్ర ఆలోచనాశక్తి ఉండదు. వారి తల్లి దండ్రుల, భర్తల అభిప్రాయాలకు అనుగుణంగా తమ రాజకీయ విధులు నిర్వర్తిస్తారు. ఆ విధంగా వారు రాజకీయాలలో పనిచేసే దానికంటె సాటి మహిళలకు విద్యను బోధించి కుల తత్వాలను రూపుమాపేటట్లు చేసిననాడు పురుషులు వారిని తప్పక గౌరవిస్తారు. భారత దేశం ఇప్పుడు మత ప్రమేయం లేని స్వేచ్ఛా రాజ్యం కాని, కొన్ని ప్రాంతాలలో వర్గ కలహాలు, మత కలోలాలు బయలుదేరుతున్నాయి. అలాంటి పరిస్థితులు కలగకుండా చేసి జాతీయ సమైక్యతకు మన వనితలు పాటుపడవలసి ఉంది.

స్వదేశీ వస్త్రాలను విరివిగా ఉత్పత్తిచేసి మన పరిశ్రమ లను ప్రోత్సహించాలని గాంధీజీ ఆశయం. స్త్రీలు చేనేత వస్త్రాలను ధరించాలి. చేనేత పరిశ్రమ మధ్యరకం కుటుంబీకులకు తమ ఆదాయం కొంత మెరుగు పర్చుకోవడానికి, బీదవారికి కేవలం జీవనోపాధిగాను ఉపకరిస్తుంది. తమ తీరిక వేళలలో మహిళలంతా ఆ పరిశ్రమను అభివృద్ధి చేయడానికి ఇతోధికంగా కృషిచేయాలి.

స్త్రీల వివాహ విషయంలో గాంధీజీ అభిప్రాయాలు ఎన్నటికి మరువలేనివి. వివాహమన్నది జీవితసమస్య కనుక ప్రతి స్త్రీకి తన కళ్యాణం నిశ్చయమయే ముందు కొంత స్వాతంత్ర్యం ఉండాలి. ఆర్థికావకాశముల కొరకు గాని, తదితర విషయాల గురించి గాని తల్లి దండ్రులు తమ కుమార్తె అంగీకారంలేనిదే వివాహం చేయడం మంచిదికాదు. స్త్రీలకు వివాహం చేయడానికి కనీస వయస్సు 20 సంవత్సరాలు ఉండాలని గాంధీజీ ఆశయం. తన పోషణలో ఉన్న బాల వితంతువులకు వివాహం చేయడం తన కర్తవ్యంగా ప్రతివ్యక్తి భావించాలి. నేడుకూడ స్త్రీల వివాహాలు పెద్దల యిష్టాయిష్టాలతోనే జరుగుతున్నాయి వరకట్నం చట్టరీత్యా ప్రభుత్వం నిషేధించినా అది అమల్లోనేఉంది. మత ప్రమేయం లేని స్వేచ్ఛా రాజ్యమైన మన భారతదేశంలో వర్ణాంతర వివాహాలు వివిధమతాల ప్రజలలో అన్యోన్యత ఏర్పరచి జాతీయ సమైక్యతకు తోడ్పడుతాయి. ఒకే కులానికి చెందినవారైనా, భార్యభర్త విభిన్న మనస్తత్వాలు గలవారైతే అనురాగం కొరవడి పిల్లల భవిష్యత్తు నాశనమౌతుంది. కనుక తమ జీవిత భాగస్వామి చేసుకొనేముందు ప్రతి స్త్రీకి తల్లి దండ్రులు కొంత స్వాతంత్ర్యాన్ని కలుగజేయాలి.

గాంధీజీ ఆశయాలకు అనుగుణంగా విధులను నిర్వర్తించుకొని పురుషులతోపాటు దేశాభ్యుదయ కార్యక్రమాలను నిర్వహించడంలో మహిళలు భాగస్వాములు కావలసి ఉంది.

*

## జనవరి 30

(మహాత్ముడు జీవించి వున్న కాలంలో ఏ సంవత్సరంలో నైతేనేమి జనవరి 30 వ తేదీన అన్న కొన్ని మాటలు. ఋషికల్పుడైన ఆ మహాత్ముని వాణి ఎంత అమోఘమో చూడండి. సం)

ఆదర్శం కోసం కృషిచేస్తూ మరణించడం కన్న మహద్భాగ్యం యింకేదీ లేదు

— హరిజన్

ఒక పిచ్చివాడు పేల్చిన తుపాకి దెబ్బకు నేను మరణించవలసి వచ్చినా చిరునవ్వుతో మరణిస్తాను

— "మహాత్మాగాంధీ–ఒక పరిశీలన"

ఏ సమయంలో వచ్చినా మరణం మంచిదే. తనలక్ష్యం కోసం– అంటే సత్యంకోసం అసువులర్పించే వీరుడి దృష్టిలో అది మరీమంచిది.

— యంగ్ ఇండియా

చావు అంటే బ్రతుకులో వచ్చే ఒక పెద్ద మార్పు తప్ప అంతకంటే విశేషం ఏమీ లేదనీ, ఎప్పుడు వచ్చినా దానికి స్వాగతం పలుకవలసిందేననే సూత్రాన్ని చాలకాలం క్రితమే నేను ఆమోదించాను.

— "దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం"

ఒక అమరవీరుని మరణం అతని త్యాగానికి ఆఖరిమాట. అదే విజయానికి బాట.

— ఇండియన్ పార్లమెంటు

# 1971

దాదాపు ఒక శతాబ్దంగా, పదేండ్లకొకసారి జనాభా లెక్కలు సేకరించటమనే సంప్రదాయం మన దేశంలో నెలకొనిఉంది. మొదట కేవలం జనసంఖ్య తేల్చుకునేందుకై ప్రారంభించబడిన ఈ కార్యక్రమం క్రమంగా అభివృద్ధి చెంది, నేడు మన ప్రజలను గురించి, దేశాన్ని గురించి బహుముఖ సమాచారాన్ని అధికార పూర్వకంగా అందించగల సమగ్ర కార్యక్రమంగా పరిణతి చెందింది.

జనాభా లెక్కల సేకరణ అంటే ఏదో గణాంక శాఖాధికారుల వ్యవహారమని కొందరు అనుకోవటం కద్దు. కాని, పరిపాలనా వ్యవహారాలలో అనేక నిర్ణయాలు ఈ లెక్కల ఆధారంగా చేయాల్సి ఉందని చాలా మందికి తెలియదు. ఉదాహరణకు మన లోక్‌సభ, రాష్ట్రశాసనసభల నియోజకవర్గాల విభజన జనసంఖ్యను బట్టి చేయవలసి ఉంది. అంటే ఆయా సభలలో ఎందరు సభ్యులుంటారనేది ఈ లెక్కలపై ఆధారపడిఉంది. అదే విధంగా, ఆర్థికంగా వెనుకబడిన తరగతుల సంక్షేమానికి సంబంధించిన రాజ్యాంగంలో చేర్చబడిన క్లాజుల అమలు విషయంలో ఈ సమాచారం అమూల్యమైనది. ముఖ్యంగా మనం ప్రణాళికా యుగంలో ప్రవేశించిన తరువాత, జనాభా లెక్కల విషయంలో నవశకం ప్రారంభమయిందని చెప్పవచ్చు. ఆర్థికాభివృద్ధి విషయాలతో సన్నిహిత సంబంధం ఉన్న గ్రామీణ ప్రాంతంలో అంగబలం, అక్షరాస్యత గ్రామాలనుండి పట్టణాలకు తరలివెళ్లటం, ఉపాధి సౌకర్యాలు, గృహవసతి, జనసంఖ్య పెరుగుదల, పంపకం మొదలైన అనేక విషయాలపై సమాచార సేకరణకూడా ఈ లెక్కలలో ఒక భాగంగా రూపొందింది. నేడు భారత దేశం అవలంబిస్తున్న 'జనాభా లెక్కల సేకరణ విధానాలు' శాస్త్రీయమైనవనీ, మిక్కిలి ఉపయోగకరమైన సమాచార సేకరణకు తోడ్పడగలవనీ ఐక్య రాజ్యసమితి నిపుణులు ప్రశంసించారు.

1971లో భారత దేశంలో నిర్వహించ బడుతున్న 'జనాభా లెక్కల సేకరణ కార్యక్రమం'లో క్రొత్త అంశాలు అనేకం చేర్చబడినవి ఇందు పేర్కొనదగినవి గ్రామాలనుండి పట్టణాలకు, పట్టణాలనుండి గ్రామాలకు తరలివెళ్ళే జనసంఖ్య వివరాలు, ఆర్థికంగా మెరుగుగా ఉన్న వర్గాలు లేక మందకొడిగా ఉండే వర్గాల గురించి మరింత శాస్త్రీయమైన పద్ధతిలో వివరాల సేకరణ, కాన్పుల లెక్కలు, స్త్రీల విషయంలో సంతానాభివృద్ధికి సంబంధించిన వివరాలు. లెక్కల తయారీ, ప్రచురణ మొదలైన అంశాలపై కూడా జాగు జరగకుండా చూచేందుకు ఈసారి ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ సందర్భాలలో అవసరమైన ఏర్పాట్లను చాలాభాగం పూర్తి చేసింది. 1971 ఫిబ్రవరి 28_మార్చి 1న జనాభా లెక్కల సేకరణ జరుపబడుతుందనే విషయాన్ని గురించి భారత ప్రభుత్వ ప్రకటన రాష్ట్ర గెజెటు ద్వారా జారీ చేయబడింది. రాష్ట్రంలో యిందుకు బాధ్యత వహించ వలసిన అధికారులందరికి తగు సూచనలు యివ్వటం జరిగింది.

జనాభా లెక్కల సేకరణ మన అభివృద్ధి పథకాల నిర్వహణకు, ప్రజాస్వామ్య ప్రగతికి అత్యంత అవసరమైన కార్యక్రమం. ఈ కార్యక్రమం నిర్వాహణ ప్రధానంగా ప్రజల సహకారంపై ఆధారపడి ఉంది.

---

## రచయితలకు విజ్ఞప్తి

ప్రజలకు ఆసక్తికరమైన వర్తమాన పరిస్థితులను గురించి "ఆంధ్రప్రదేశ్" పత్రిక కోసం ప్రత్యేకంగా రాసిన రచనలు కోరబడుచున్నవి.

సాంఘిక, సాంస్కృతిక విషయాలను గురించిన రచనలూ, ప్రజలకు విజ్ఞాన ప్రదములైన రచనలు కూడా పంపవచ్చు. ప్రకటించిన రచనలకూ, ఫొటోలకూ పారితోషికం చెల్లించబడుతుంది.

పి. వామనరావు

"ఆంధ్రప్రదేశ్" పత్రిక ప్రధాన సంపాదకులు, సమాచార పౌరసంబంధశాఖ, హైదరాబాద్.

# ప్రకృతి దర్శనం

—అబ్బూరి గోపాలకృష్ణ

సుదూర తీరాల సాంద్రారణ్యాలు
ముగ్ధమోహనంగా దర్శనమిస్తాయి యెల్లప్పుడూ:
అదే దారినాకు
లేదు చల్లదనానికి కొదువ.
లెక్క లేనన్ని పేరులేని చిన్ని చిన్ని మొక్కలు
నన్ను చూసి అమాయకంగా నవ్వుతాయి:
కారణాల కీకారణ్యం అక్కర్లేదు నాకు:
మహా వృక్షాల మధ్య వొంపులు తిరుగుతూ పోయే
మరకత పసిరిక నా పాలిటి స్వర్గం.
ఈ జీవితం నా పాలిటి శాపం అనుకున్నప్పుడు,
అయ్యోపాపం, అని నా తల మీదుగా
తమ శాఖల హస్తాలను జాపి నన్నాశీర్వదించే
పచ్చని మోహన రూపాలు నా దేవతలు.
ఆర్ద్ర భావాలలా భూదేవి గుండెలను
చీల్చుకుని మొలిచే, ఠీవిగా నిలిచే
మొక్కలు నాకెన్నో రహస్యాలను జ్ఞప్తికి తెస్తాయి.
యుగ యుగాల క్రిందట నా ప్రాణం ధ్వనించిన
తొలి వేదనా గీతాలను ఇప్పటికీ ఆలాపించేవి ఇవే
ఇవే నా మోహన రూపాలు
ఈ మహా వృక్షాల పక్కనుంచే
అవనత శిరస్కుడనై వినయంగా నడుస్తాను
ఇది వొక్కటే నా మార్గం
ఇదే నాకు మార్గం.
నేను దాటి పోయిన తరువాత నా వెనకాల
మొక్కలూ, చెట్లూ నా గురించే గుసగుసలాడుకుంటాయి,
నా గురించిన సహస్రానేక
సుహృద్భావ గీతికలు పాడుకుంటాయి.

# రాయలసీమలో భూసార సంరక్షణ పథకాలు

రాష్ట్రంలో తరచుగా అనావృష్టికి గురి అవుతున్న ప్రాంతాలలో మొదట పేర్కొనవలసినది రాయలసీమ. సగటు వర్షపాతం కోస్తా జిల్లాలలో 39 అంగుళాలు. తెలంగాణాలో 36 అంగుళాలు కాగా, రాయలసీమలో 30 అంగుళాలకు లోపుగానే ఉంది. ఈ ప్రాంతంలో కురిసే కొద్దిపాటి వర్షాలు కూడా అంతటా సమంగా కురవవు, సకాలంలో కురవవు.

రాయలసీమ మొత్తం వైశాల్యం 182.02 లక్షల ఎకరాలు. ఇందులో సాగులో ఉన్న 73.08 లక్షల ఎకరాలలోనూ, నీటి పారుదల వనరుల క్రింద ఉన్న భూమి 10.96 లక్షల ఎకరాలు మాత్రమే. తుంగభద్ర ఎగువ కాలువ, దిగువ కాలువ, కడప, కర్నూలు కాలువలను మినహాయిస్తే ఈ నీటి పారుదల వనరులన్నీ పూర్తిగా వర్షాధారాలు. అంటే, రాయలసీమలో చాలావరకు వ్యవసాయం–మెట్టగాని, మాగాణిగాని నమ్మటానికి వీలులేని, చాలీచాలని వర్షపాతంపై ఆధారపడి ఉన్నదన్నమాట.

## పంటల మార్పిడి

అనావృష్టి పరిస్థితులు సాధారణం కావటంవలన యిచటి రైతులకు మిశ్రమ పైర్లు వేయటం, పంటల మార్పిడి చేయటం ఆచారంగా మారింది. కొర్రలనుగాని, వేరుసెనగను గాని ప్రత్తితో కలిపి వేయటం ఎక్కువగా కనిపిస్తుంది. మొదటిపంట వరివేసి, రెండవ పంటగా వేరుసెనగ వేయటం, ఒక యేడు జొన్న, మరియొక సంవత్సరం వేరుసెనగ వేయటం కూడ జరుగుతూ ఉంటుంది. ఈ పద్ధతుల వలన కొంత ప్రయోజనం సమకూరినా, ఈ ప్రాంతపు వ్యవసాయ సమస్యలు యింతమాత్రంతోనే తీరవు.

అందుచేత తరుచుగా వర్షాభావం కలగటంవలన ఉత్పన్నమయే సమస్యలను గురించి ఆలోచించి, వ్యవసాయదారులకు లాభం చేకూర్చే కొన్ని ప్రత్యేక కార్యక్రమాలను ప్రణాళికా పరంగా చేపట్టటం జరిగింది. వ్యవసాయాభివృద్ధికి భూసార సంరక్షణ ముఖ్యం కనుక సహజంగా ఈ పథకాలలో భూసార సంరక్షణ కార్యక్రమాలకు హెచ్చు ప్రాధాన్యం యివ్వబడింది.

## వర్షపునీరు వృథా కాకుండా....

భూసార రక్షణకు తగిన ఏర్పాట్లు లేనందు వలన, కురిసిన కొద్దిపాటి వర్షపునీరుకూడ వృథాగా వరదకు పోతూవుంది, పోతూ పోతూ తనతోపాటు పొలాలనుండి ఎంతో విలువైన పైపొర మట్టిని కూడా కొట్టుకొని తీసుకుపోతూ వుంది. ఇందువలన, ఎంతో సారవంతమైన నేలలు క్రమంగా బీడబడిపోతున్నవి. ఈ నష్టానికి తోడు ఈ మట్టి వచ్చి చెరువుల లోతట్టున మేట వేయటం వలన అవి క్రమంగా మెరకబడిపోయి వాటిలో నీటినిలువ తగ్గిపోతున్నది. ఫలితంగా ఆయా వనరులక్రింద భూములలో పంట దెబ్బతింటూఉంది.

శాస్త్రీయ పద్ధతుల నవలంబించి భూసారంకొట్టుకొనిపోకుండా కాపాడటం వలన, ఈ ప్రాంతంలో వర్షం వలన లభించే కొద్దిపాటి నీటినయినా సక్రమంగానూ, ఇతోధికంగానూ వినియోగించుకొని, వ్యవసాయోత్పత్తులను పెంపొందించుకొనటానికి వీలు కలుగుతుంది. భూసార సంరక్షణ కార్యక్రమాలను అమలు జరపేటప్పుడు గట్లువోయటం మొదలైన పనులకు స్థానికంగా లభించే అంగబలాన్ని వినియోగించుకోవచ్చు. దీనివలన వ్యవసాయ కూలీలకు మామూలుగా పనులు దొరకని కాలంలో కూడ పొట్టగడిచే వీలు కలుగుతుంది.

## భూసార రక్షణ చర్యల ఆవశ్యకత

రాయలసీమలో మెట్టభూమి దాదాపు 62 లక్షల ఎకరాలలోను సుమారు 32 లక్షల ఎకరాలలో భూసార రక్షణకు చర్యలు తీసికొనవలసిన అవసరం ఉంది. ఇందులో యిప్పటి వరకు యిట్టి కార్యక్రమాలు అమలుపరచబడిన పొలాల విస్తీర్ణం 2 లక్షల ఎకరాలు. మిగిలిన భూమిలో కూడ భూసార రక్షణ కార్యక్రమాలను వచ్చే పది సంవత్సరాలలో పూర్తిగా అమలుచేయటానికి దాదాపు 30 కోట్ల రూపాయలు అవసరం.

1969–70 వార్షిక ప్రణాళికలో రాయలసీమలో భూసార సంరక్షణకై రు. 17.76 లక్షలను కేటాయించారు. దీనితో దాదాపు 50,000 ఎకరాలలో భూసార రక్షణ జరుగుతుంది. రాష్ట్రం అంతటిలోను నాలుగవ ప్రణాళికా కాలంలో భూసార సంరక్షణ క్రింద ఖర్చు చేయడానికి ఉద్దేశించిన మొత్తం రు. 3.07 కోట్లు. ఇందులో మూడవవంతుకు పైగా, అంటే రు. 1.20 కోట్లను రాయలసీమలో ఖర్చుచేస్తారు. దీనితో, ఈ ప్రాంతంలో మరి 1.75 లక్షల ఎకరాలలో భూసార రక్షణకు ఏర్పాట్లు చేయవచ్చు. ఈ కార్యక్రమాలు సక్రమంగా అమలు జరిగి రాయలసీమలో వ్యవసాయం మూడు పువ్వులూ ఆరు కాయలూ కాగలదని ఆశించవచ్చు.





# ఆంధ్రప్రదేశ్‌లో కుటుంబ నియంత్రణ

## ఆర్థిక అభివృద్ధిపై జనాభా పెరుగుదల ప్రభావం

-- మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారి

జాతీయ ప్రణాళికల విజయానికీ, ఆర్థిక, సాంఘిక అభివృద్ధికీ కుటుంబ నియంత్రణ ముఖ్యాంశంగా అంగీకరించడం జరిగింది. ఎందుకంటే జాతీయ ఆదాయం పెరుగుదలకానీ, ఆహారోత్పత్తి, పారిశ్రామిక ప్రగతికానీ, సాంఘిక సంక్షేమానికి సంబంధించి యే అంశంకానీ మదింపువేసేటప్పుడు జనాభా ముఖ్య ప్రాతిపదిక అవుతుంది. అందువల్ల భవిష్యత్తులో తగువిధంగా కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని రూపొందించడానికి మన రాష్ట్రంలో జనాభా సమస్య తీవ్రతను మదింపువేయడం చాలా అవసరం.

జనన మరణాల రేటు తగ్గుదలతో జనాభా పెరుగుదల స్థిరత్వంపై ఆర్థిక అభివృద్ధి ఆధారపడి ఉంది. అయితే ఆధునిక జనాభా పెరుగుదలలోమాత్రం మరణాల రేటులో తగ్గుదల, జననాల రేటులో తగ్గుదలల మధ్య వ్యత్యాసం ఉండడం ప్రధాన అంశమయింది. ఈ వ్యత్యాసం జనాభా పెరుగుదల అధికం కావడానికి కారణమయింది. అందువల్ల అభివృద్ధి విషయకంగా మానవ సమస్యలన్నిటిలో జనాభా పెరుగుదల సమస్య మూల సమస్యగా రూపొందింది. జనాభా పెరుగుదల రేటు అధికం కావడంతో తలసరి సగటు ఆదాయం, ప్రజల జీవన స్థాయిలపై ప్రతికూల ప్రభావం ఉంటుంది. త్వరితగతిని పెరుగుతున్న జనాభాకు ఆహారం సరఫరా చేయడం బృహత్ సమస్యగా తయారవుతుంది. ఆహార ధాన్యాల ఉత్పత్తిలో పెరుగుదల ఉన్నప్పటికీ, తలసరి సగటు ఆహారోత్పత్తిలో తగ్గుదల ఏర్పడుతుంది. జనాభా పెరుగుదల కారణంగా నిరుద్యోగం తక్కువ ఉపాధికల్పనలకు దారితీసి సాంఘిక స్థిరత్వానికీ, ఆర్థిక అభివృద్ధికీ ప్రమాదం ఏర్పడవచ్చు.

పైన పేర్కొన్న పరిస్థితుల దృష్ట్యా రాష్ట్రంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాల సందర్భంగా ప్రణాళికల కాలంలో జనాభా పెరుగుదల, ఆర్థిక అభివృద్ధి స్థితిని పరిశీలించాలి.

భారత దేశంలో ఆంధ్రప్రదేశ్ ఐదవ పెద్ద రాష్ట్రం. దేశ విస్తీర్ణంలో 8.4 శాతం విస్తీర్ణం ఆంధ్రప్రదేశ్‌లో ఉంది. అయితే దేశ జనాభా విషయంలో యీ రాష్ట్రానికి నాలుగవ స్థానం ఉంది. 1961 జనాభా లెక్కలను అనుసరించి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర జనాభా 35.9 మిలియనులు ఉంది. 1981 నాటికి యిది 52.8 మిలియనులకు–అంటే 47 శాతం పెరుగుతుందని భావించబడుతున్నది. ఈ విధంగా ప్రతి సంవత్సరం అదనంగా ఒక పదిలక్షల చొప్పున జనాభా పెరుగుతున్నది. 1961 జనాభా లెక్కలను అనుసరించి ఆంధ్రప్రదేశ్‌లో జననాల రేటు 39.7 కు ఉంది. 1981 నాటికి యిది 27.2 కు తగ్గుతుందని ఆశించబడుతున్నది. అయితే 1961 లో ఉన్న 25.2 మరణాల రేటు 1981 నాటికి 10.7కు తగ్గుతుందని భావించబడుతున్నవి.

ఆంధ్రప్రదేశ్‌లో జన సాంద్రత చదరపు మైలుకు 339 మంది ఉన్నారు. రాష్ట్రంలో ఎక్కువ భాగం జనాభా గ్రామీణ ప్రాంతాలలో ఉంది. 82.56 శాతం ప్రజలు గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నారు.

### ఆంధ్రప్రదేశ్‌లో జనాభా పెరుగుదల

1931 నుండి 1981 సంవత్సరం వరకు ఆంధ్రప్రదేశ్‌లో

జననమరణాల రేట్లు, పెరుగుదల రేటును పరిశీలించినప్పుడు యీ కాలంలో రాష్ట్రంలో జనాభా పెరుగుదల పరిస్థితి తెలుస్తుంది.

| సంవత్సరం | జనాభా (మిలియనులో) | జనన రేటు (1000కి) | మరణ రేటు (1000కి) | పెరుగుదల రేటు (100కు) |
|---|---|---|---|---|
| 1931 | 24.20 | 31.9 | 22.1 | 1.0 |
| 1941 | 27.29 | 34.7 | 22.3 | 1.2 |
| 1951 | 31.11 | 35.7 | 22.8 | 1.4 |
| 1961 | 35.98 | 39.7 | 25.2 | 1.6 |
| 1971 (అంచనా) | 43.92 | 37.3 | 16.6 | 2.07 |
| 1981 (అంచనా) | 52.80 | 27.2 | 10.7 | 1.7 |

రాష్ట్ర జనాభా 1931 నాటి సంఖ్య కన్నా 1981 నాటికి రెండింతలకన్నా ఎక్కువ అవుతుందని (24.20 నుండి 52.80) భావించబడుతున్నది. జనన, మరణాల రేట్ల మధ్య పెద్ద ఎత్తున వ్యత్యాసం కారణంగా జనాభా పెరుగుదల ఏర్పడుతున్నది. వైద్య ఆరోగ్య పరిసితులలో మెరుగుదల, పారిశుద్ధ్యం, అంటు వ్యాధుల నిరోధం ఫలితంగా మరణాలరేటులో తగ్గుదల ప్రారంభంకాగా జననాల రేటు పెరగనారంభించింది. అయితే కుటుంబ నియంత్రణ కార్యక్రమం అమలు ఫలితంగా 1971_1981 మధ్య జననాల రేటులో తగ్గుదల ఏర్పడుతుందని ఆశించబడుతున్నది.

## రాష్ట్ర ప్రణాళికలపై ప్రభావం

ఆర్థిక అభివృద్ధి, సాంఘిక పురోగమనంపై రాష్ట్ర ప్రణాళికల ప్రభావాన్ని రాష్ట్ర జనాభా పెరుగుదలతో కలిపి పరిశీలించాల్సి ఉంటుంది. తద్వారా ప్రజల జీవన స్థాయిలో తలసరి సగటు పెరుగుదల మదింపువేయాలి. పంచవర్ష ప్రణాళికల అమలు ఫలితంగా ఆర్థిక, సాంఘిక రంగాలలో ఆంధ్రప్రదేశ్ గణనీయమైన అభివృద్ధిని సాధించింది.

## వ్యవసాయ ఉత్పత్తి

ఈ కాలంలో భారతదేశంలో వ్యవసాయ ఉత్పత్తులు రెండింతలుకాగా ఆంధ్రప్రదేశ్‌లో రెండింతలకుపైగా ఎక్కువయింది. ఆహార ధాన్యాల విషయంలో ఆంధ్రప్రదేశ్ మిగులు రాష్ట్రం. సంవత్సరానికి సగటున 5 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను యీ రాష్ట్రం ఎగుమతి చేస్తున్నది. అయితే ఆహార ధాన్యాల కొరత ఫలితాలను యీ రాష్ట్రం కూడా ఎదుర్కొంటున్నది. దేశంమొత్తం మీద ఆహార ధాన్యాల కొరత కారణంగా యీ రాష్ట్రంలో, ఆహార ధాన్యాల ధరలను అదుపు చేయలేకపోతున్నారు. దానికి తోడు జనాభా పెరుగుదల ఉంటున్న దృష్ట్యా 1981 నాటికి సంవత్సరానికి 30 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు అదనంగా సరఫరా చేయాల్సి ఉంటుంది. అప్పటివరకు జనాభా పెరుగుదల రేటు యీ విధంగానే ఉంటే తరుగు రాష్ట్రాలకు ఎగుమతి చేయడానికి వీలుగా రాష్ట్రంలో ఆహార ధాన్యాలు లభించడం సందేహాస్పదమైన విషయం. ఆంధ్రప్రదేశ్‌లో ఆహారోత్పత్తిలో పెరుగుదల రేటు సంవత్సరానికి 2.6 శాతం ఉంది. ఇదే అత్యధిక ఉత్పత్తి రేటని భావించబడుతున్నది. అమెరికాలో యిటీవలి సంవత్సరాలలో ఉత్పత్తిలో పెరుగుదల రేటు సంవత్సరానికి 3 శాతం మాత్రమే ఉంది. అందువల్ల వ్యవసాయ ఉత్పత్తుల పెరుగుదల రేటులో పెంపుదల ఉంటుందని ఆశించడానికి ఆస్కారంలేదు.

## పారిశ్రామిక ఉత్పత్తి

రాష్ట్రంలో పంచవర్ష ప్రణాళికల కాలంలో పారిశ్రామిక ఉత్పత్తి గణనీయంగా పెరిగింది. 1956__100 ప్రాతిపదికగా పారిశ్రామిక ఉత్పత్తి సాధారణసూచీసంఖ్య 1967లో 213కు పెరిగింది. వార్షిక సగటు పెరుగుదల 12.6 శాతం ఉంది.

## రాష్ట్ర ఆదాయం : సగటు తలసరి ఆదాయం

1950_51లో రూ. 799/_ కోట్లు ఉన్న రాష్ట్ర ఆదాయం 1960_61లో రూ. 998/_ కోట్లకు, 1966_67లో 1167/_కోట్లకు పెరిగింది, 1950_51లో రూ. 256/_లు ఉన్న తలసరి సగటు ఆదాయం 1966_67 నాటికి రూ. 291/_ లకు పెరిగింది. ఈ సమీక్షాకాలంలో రాష్ట్ర ఆదాయంలో 46.10 శాతం పెరుగుదల ఉండగా తలసరి సగటు ఆదాయంలో 13.6 శాతం పెరుగుదల మాత్రమే ఉంది. ఈ విధంగా జనాభా పెరుగుదలతో సమానంగా అభివృద్ధి పనులు సరితూగడం లేదని స్పష్టమవుతుంది.

## తగువిధంగా ఉపాధి లేకపోవడం

ఆంధ్రప్రదేశ్‌లో జనాభా పెరుగుదల కారణంగా నిరుద్యోగం, తగువిధంగా ఉపాధి లేమి సమస్యలు తీవ్రమవుతున్నవి. మూడవ ప్రణాళిక ప్రారంభంలో (1960_61) 3.75 లక్షల నిరుద్యోగులు ఉండగా 1965_66 నాటికి 7.55 లక్షలకు పెరిగింది. 1961లో 1.40 కోట్లు ఉన్న శ్రామిక శక్తి 1981 నాటికి 2.14 కోట్లకు పెరుగుతుందని భావించబడుతున్నది. పైన తెల్పిన వాస్తవాల దృష్ట్యా అభివృద్ధి ప్రణాళికలు అమలు జరుపుతున్నప్పటికీ జనాభా పెరుగుదల తీవ్రత కారణంగా నిరుద్యోగ సమస్య మరింతగా జటిలమవుతున్నది.

ఈ రాష్ట్రం వ్యవసాయ ప్రధానమైనది కావడంవల్ల (2/3 వంతు జనాభా వ్యవసాయంపై ఆధారపడి ఉన్నది.) గ్రామీణ ప్రాంతాలలో తగువిధంగా ఉపాధి లేకపోవడమనే సమస్యను ఎదుర్కొంటున్నారు. గ్రామీణ ప్రాంతాలలో లాభసాటి అయిన ఉపాధిగల వ్యక్తులలో 11.97 శాతం మందికి తగువిధంగా ఉపాధి లభించడంలేదు.

## సాంఘిక సేవ

జనాభా పెరుగుదల కారణంగా విద్య, వైద్య, ఆరోగ్య సౌకర్యాలవంటి సాంఘిక సేవా కార్యక్రమాలు తీవ్ర సమస్యలుగా పరిణమిస్తున్నాయి. 1961 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్ర ప్రదేశ్ మొత్తం జనాభాలో 21.20 శాతం అక్షరాస్యులు ఉన్నారు. అంటే అఖిల భారత స్థాయికన్నా ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యత తక్కువగా ఉంది. దేశ జనాభా మొత్తంలో అక్షరాస్యుల సంఖ్య 24 శాతం ఉంది. అక్షరాస్యత విషయంలో భారత దేశం లోని 15 పెద్ద రాష్ట్రాలలో, ఆంధ్రప్రదేశ్‌కు 10వ స్థానం లభించింది. ఆంధ్రప్రదేశ్‌లో సంవత్సరానికి పది లక్షల చొప్పున జనాభా పెరుగుతున్న దృష్ట్యా అదనంగా 2000 పాఠశాలలు, 3000 మంది ఉపాధ్యాయులను సమకూర్చాల్సి ఉంటుంది.

మూడవ ప్రణాళిక ఆఖరు నాటికి, స్వాతంత్ర్యానికి పూర్వం కన్నా మూడింతలు ఎక్కువగా విద్యా సౌకర్యాలను కల్పించారు. 1957_58 సంవత్సరంలో విద్యపై చేసిన ఖర్చు రు. 1040 లక్షల కాగా 1968_69 నాటికి యీ ఖర్చు రు. 3410 లక్షలకు పెరిగింది. 1955_56లో 28 లక్షలకు మంది విద్యార్థులు ఉండగా 1967_68 నాటికి యీ సంఖ్య 50.20 లక్షలకు పెరిగింది.

అదే విధంగా 1956_67లో వైద్య ఆరోగ్య సౌకర్యాలపై ఖర్చు రు. 2.6 కోట్లు ఉండగా 1966_67 రు 14.6 కోట్లకు పెరిగింది. అంటే వైద్య, ఆరోగ్య సౌకర్యాలపై సగటున తలసరి ఖర్చు రు 0.78 నుండి రు 3.13 లకు పెరిగింది.

జనాభా పెరుగుదల ఒత్తిడి కేంద్ర, రాష్ట్ర ప్రణాళికా వేత్తలు గుర్తించి జనాభా పెరుగుదలను అరికట్టడానికి వీలుగా ప్రణాళికలలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాలకు ప్రాధాన్యం యిచ్చారు. ఈ రాష్ట్రంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడడానికి ఆరు సంవత్సరాలు ముందుగా 1950లోనే ప్రారంభించినప్పటికీ రాష్ట్ర కుటుంబ నియంత్రణ మండలిని 1957లో మాత్రమే నెలకొల్పారు. 1963వ సంవత్సరం వరకు ఆంధ్రప్రదేశ్‌లో కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని మామూలు స్థాయిలో చికిత్సవరకు మాత్రమే పరిమితం చేశారు. 1963 సంవత్సరం తర్వాత యీ కార్యక్రమాన్ని విస్తరింపజేసి కుటుంబ నియంత్రణ సందేశాన్ని ప్రజా బాహుళ్యంలో ప్రచారం చేయడం ప్రారంభించారు. జిల్లా కుటుంబ నియంత్రణ కేంద్రాలను; ప్రాథమిక ఆరోగ్యం కేంద్రాలలో, ఉప కేంద్రాలలో, గ్రామీణ కుటుంబ నియంత్రణ కేంద్రాలను, పట్టణ కుటుంబ నియంత్రణ కేంద్రాలను నెలకొల్పడం ద్వారా కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్నంతటినీ పునర్వ్యవస్థీకరించారు. రాష్ట్రంలో 21 జిల్లా కుటుంబ నియంత్రణ కేంద్రాలు, (ఒక పట్టణ కేంద్రంతో సహా). 260 గ్రామీణ కుటుంబ నియంత్రణ, సంక్షేమ కేంద్రాలు, 168 పట్టణ కుటుంబనియంత్రణ కేంద్రాలు పనిచేస్తున్నాయి. ఇవి రాష్ట్రంలోని గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో కుటుంబనియంత్రణ కార్యక్రమాలను అమలు జరుపుతున్నాయి. వాటికితోడు రాష్ట్రంలో 11 స్వచ్ఛందసంస్థలు, 31 కుటుంబనియంత్రణ క్లినిక్కులను నిర్వహిస్తున్నాయి. 1966_67 నుండి కుటుంబనియంత్రణ కార్యక్రమాలలో సాధించాల్సిన లక్ష్యాలను నిర్దేశించడం ప్రారంభించారు. ఈ రాష్ట్రంలో సంతానం గలిగే వయస్సు గలవారు 70 లక్షల దంపతులు ఉన్నారని వారిలో 28 లక్షల దంపతులు శాశ్వత ప్రాతిపదికపై కుటుంబనియంత్రణకు (శస్త్రచికిత్సలకు) అర్హులని అంచనా వేయబడింది. ఇట్టివారికి ముగ్గురు, లేక అంతకు ఎక్కువమంది పిల్లలు ఉన్నారు. మిగతా 42 లక్షల దంపతులకు ఐ. యు. సి. డి. గానీ, మాత్రలు, సాధనాలుగానీ, సాంప్రదాయక కుటుంబనియంత్రణ సాధనాలుగానీ అవసరం కావచ్చు.

ఈ కార్యక్రమ అమలు ప్రారంభించినప్పటినుండి రాష్ట్రంలో 4,80,423 శస్త్రచికిత్సలను నిర్వహించారు. జనాభాలో 1000కి 11.5 మంది, అంటే అర్హతగల దంపతులలో 10.5 శాతంమంది శాశ్వత ప్రాతిపదికపై కుటుంబనియంత్రణను అనుసరించారు

### ఐ.యు.సి.డి.

రాష్ట్రంలో యింతవరకు 1,09,169 మంది ఐ. యు. సి. డి. అనుసరిస్తున్నారు. సాంప్రదాయక సాధనాలలో కండోములు బహుళ ప్రచారంలో ఉన్నాయి. ప్రస్తుత సంవత్సరంలో యింతవరకు 7 లక్షల కండోములను పంపిణీచేశారు. రెండు ప్రయోగాత్మక పథకాలద్వారా కుటుంబనియంత్రణకు చెందిన మాత్రల పంపిణీ కార్యక్రమాన్ని చేపట్టారు. త్వరలోనే మరో నాలుగు కేంద్రాలను ప్రారంభిస్తారు.

# పరిమిత కుటుంబం — అపరిమిత ఆనందం

# భారత భారీ విద్యుత్ పరికరాల క

అన్ని రంగాలలో స్వయంసమృద్ధి సాధించడమే మన లక్ష్యం. దేశ పురోగమనానికి విద్యుచ్ఛక్తి చాలా ముఖ్యం. ఈ దృష్టితో హైద్రాబాదు సమీపంలో రూ 36 కోట్ల పెట్టుబడి ఖర్చుతో భారత్ హెవీ ఎలెక్ట్రికల్స్ లిమిటెడ్ ఫ్యాక్టరీ స్థాపించడం జరిగింది. దీనికి కీ. శే. లాల్‌బహదూర్ శాస్త్రి 1965 డిశెంబరులో ప్రారంభోత్సవం చేశారు. భోపాల్‌లో కూడా విద్యుత్ పరికరాల ఫ్యాక్టరీ వుంది. అక్కడ విద్యుదుత్పాదక యంత్రాలు తయారవుతాయి. హైదరాబాదులో భారీ విద్యుత్ పరికరాల యంత్రం, స్విచ్ గేర్ యూనిటు నెలకొల్పబడినాయి.

ఇక్కడ ఈ ఫ్యాక్టరీని స్థాపించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 6445 ఎకరాల భూమిని కేటాయించింది. 300 ఎకరాల





ఈ కర్మాగారంలోని టెస్ట్‌బెడ్‌లో తయారుచేయబడిన 60 మె. వాట్ల ఎల్. పి. కాలింగ్ రోటార్ యంత్రం

భూమిలో ఫ్యాక్టరీని నిర్మించడం జరిగింది. 490 ఎకరాలలో ఉద్యోగ సిబ్బంది వసతి గృహాలు నిర్మించబడ్డాయి. ఫ్యాక్టరీ అవసరాలకంటే ఎక్కువగా వున్న 3780 ఎకరాల భూమిని తిరిగి ప్రభుత్వానికి అప్పగించడం జరుగుతున్నది.

1959 లో జరిగిన భారత_జకోస్లవేకియా ఆర్థిక ఒప్పందం ప్రకారం జకోస్లవేకియా ప్రభుత్వ సహకారంతో ఈ ఫ్యాక్టరీ నిర్మించబడింది. 1965లో ఇది పాక్షికంగా ఉత్పత్తి ఆరంభించింది. ఇందులో స్టీమ్‌టర్బైనులు, టర్బో_ఆల్టర్నేటర్లు, కంప్రెస్సర్లు, పంపులు, ఇండస్ట్రియల్ టర్బైనులు, 9 లక్షల కిలోవాట్ల శక్తిగల విద్యుచ్ఛక్తి యంత్ర పరికరాలు కూడా తయారవుతాయి. తిరుచునాపల్లిలో నీటిని ఆవిరిగా మార్చే బాయిలర్లు తయారవుతున్నాయి. హైద్రాబాదు ఫ్యాక్టరీలో, ఈ యంత్రాల పాటవాన్ని పరీక్షచేసే సౌకర్యంవుంది. దీన్ని టెస్ట్‌బెడ్ అంటారు. ఇలాంటిది భారత దేశంలో మరెక్కడాలేదు. దీన్ని భారతీయ ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు నిర్మించారు. ఇక్కడ 1968 జూన్‌లో 60000 కి.వా. స్టీంటర్బైన్ విజయవంతంగా పరీక్ష చేయబడింది. రోటర్లు, స్టీంటర్బైనులను సరిగా పరీక్ష చేయడానికి సెంట్రిఫ్యూగల్ టన్నెల్ స్థాపించబడింది. భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ తయారు చేసిన 60000 కి. వా. టర్బో_ఆల్టర్నేటర్ తొలిసారిగా 1968 నవంబరులో విజయవంతంగా పరీక్ష చేయబడింది.

## ఫౌండ్రీ విభాగం

ఇది మూడు భవనాలలో నెలకొనివుంది. గ్రే ఐరన్ ఫౌండ్రీ, నాన్ ఫెర్రస్ ఫౌండ్రీ, పేటర్న్ షాప్ అని ఇది మూడు భాగాలుగా వుంది. గ్రే ఐరన్ ఫౌండ్రీలో ఇప్పుడు 3000 టన్నులు ఉత్పత్తి అవుతున్నాయి. మొదటి దశలో ఉత్పత్తి అయ్యే ఒక్కొక్క వస్తువు బరువు 5 టన్నులు వుంటుంది. రెండవ దశలో దీని బరువు 8 నుంచి 10 టన్నుల వరకు వుంటుంది.

1971_72 లో ఎలెక్ట్రోప్లేటింగ్ యంత్రం పరికరాలను ఉత్పత్తి చేయడం ఆరంభిస్తుంది. చతుర్థ ప్రణాళికలో థర్మల్ పవర్ స్టేషనుల అవసరాలను ఇది ఆదుకోగలదు. దీనివల్ల దేశానికి సాలీనా రూ. 20 కోట్ల విదేశ మారక ద్రవ్యం ఆదా అవుతుంది. 110 మి. వా. శక్తిగల ఒక్కొక్క టర్బొసెట్టు హైదరాబాదు వంటి నాలుగు మహానగరాలకు సరిపడే విద్యుచ్ఛక్తిని సరఫరా చేయగలదు.

# ...గారం

"రాజా"



భారత భారీ విద్యుత్ పరికరాల కర్మాగారంలో తయారయిన 60,000 కి. వాట్ల హైడ్రోజన్ కూల్ టర్బో ఆల్టర్



ఈ కర్మాగారంలో తయారయిన మినిమమ్ ఆయిల్ సర్క్యూట్ బ్రేకర్



**



* టర్బో ఆల్టర్నేటర్ విభాగంలో శుద్ధిపరుస్తున్న గొట్టాలు

** 110 మె. వాట్ల, ఎల్. పి. రోటర్

విద్యుదుత్పాదక యంత్రాలను తయారు చేయడం అంత సులభమైన పనికాదు. ఇందులో ఎన్నో సూక్ష్మవిషయాలు ఇమిడి వున్నాయి. సాధారణంగా ఈ యంత్రం 25 ఏండ్లు పని చేస్తుంది. అంతకాలం వరకు పనిచేయగలిగే విధంగా దీన్ని తయరుచేయాలి అంటే ఎంతో జాగ్రత్తతో కూడిన పని. ఇంతవరకూ 60 మి.వా. శక్తిగల యంత్రాలు 6; 110 మి. వా. శక్తిగల యంత్రాలు 6 సరఫరా చేయడానికి ఈ ఫ్యాక్టరీకి ఆర్డర్లు వచ్చాయి. దేశంలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పంపిణీ వ్యవహారాలు ప్రభుత్వ యజమాన్యం క్రింద ఉన్నాయి. కనుక విద్యుచ్ఛక్తి అభివృద్ధి కార్యక్రమం దేశ అవసరాలను బట్టి జరుగుతుంది. దీని ఆధారంపైనే ఇక్కడ యంత్రాల ఉత్పత్తి జరుగుతుంది. రాష్ట్ర ప్రభుత్వాల క్రింద వున్న విద్యుచ్ఛక్తి సంఘాలే ఈ యంత్రాలను కొనుగోలు చేస్తాయి. భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ ఫ్యాక్టరీ తయారుచేసిన టర్బో సెట్లులు, స్విచ్ గేర్ పరికరాలను మద్రాసులోని ఎన్నూర్ పవర్ హౌస్, ఉత్తర్ ప్రదేశ్ లోని హర్దువాగంజి, ఆంధ్రప్రదేశ్ లోని కొత్తగూడెం, బీహారులోని పత్రాటు, ఢిల్లీలో ఇంద్రప్రస్థ పవర్ హౌసులు ఉపయోగిస్తున్నాయి.

వివిధ పారిశ్రామిక సంస్థలకు కూడా ఉపయోగపడే విధంగా టర్బో సెట్లులను ఉత్పత్తి చేసేందుకు జకోస్లవేకియా ప్రభుత్వంతో ఇప్పుడు సంప్రదింపులు జరుగుతున్నాయి. ఉక్కు ఫ్యాక్టరీలు, చక్కెర మిల్లులకు కూడా అవసరమయ్యే యంత్ర పరికరాలు ఇక్కడ ఉత్పత్తి అవుతున్నాయి. రసాయనిక పరిశ్రమలకు అవసరమయ్యే సెంట్రీ_ఫ్యూగల్ కంప్రెస్సర్లను తయారుచేసే విషయం పరిశీలనలో వుంది. దీనివల్ల ఇప్పటి యంత్రాలవిషయంలో పెద్దమార్పులుచేయవలసినఅవసరంవుండదు.

1968_69 సంవత్సరంలో రూ, 1,142_29 లక్షల విలువ గల యంత్రపరికరాలు ఉత్పత్తి అయినాయి. అంతకుముందు సంవత్సరంలో రూ, 641.35 లక్షల విలువగల పరికరాలు ఉత్పత్తి అయినాయి. అంటే ఉత్పత్తి సుమారు రెట్టింపు అయిందన్నమాట.

ఈ ఫ్యాక్టరీలో 5000 మంది ఉద్యోగులున్నారు. వీరిలో 80 శాతం మంది ఆంధ్రప్రదేశ్‌కు చెందినవారు పని చేస్తున్నారు. ప్రస్తుతానికి 50 మంది జెకోస్లవేకియా నిపుణులు ఈ ఫ్యాక్టరీలో పనిచేస్తున్నారు.

## స్విచ్ గేర్ యూనిట్

ఇందులో ఏర్ బ్లాస్‌లు సర్క్యూట్ బ్రేకర్లు, మినిమం ఆయిల్ సర్క్యూట్ బ్రేకర్లు ఉత్పత్తి అవుతున్నాయి. విద్యుచ్ఛక్తి సంఘాలు, రైల్వేలు, బొకారో ఉక్కు ఫ్యాక్టరీ, భాక్రామేనేజిమెంటు మున్నగునవి వీటిని ఉపయోగిస్తున్నాయి.

విదేశాలపైన ఆధారపడకుండా స్థానికంగా లభించే వనరులను ఉపయోగించే విధానం ప్రోత్సాహకరంగా వుంది. ఏర్_బ్లాస్‌లు సర్క్యూట్ బ్రేకర్ల ఉత్పత్తికి దేశవాళీ వస్తువులే ఉపయోగించడం జరుగుతున్నది.

హైద్రాబాదులో కొద్దికాలం క్రిందట స్థాపించబడిన భారీ విద్యుత్పరికరాల ఫ్యాక్టరీ స్వల్పకాలంలో గణనీయమైన ప్రగతి సాధించింది. దీని భవిష్యత్తు ఆశాజనకంగా వుంది.

## తెలుగు వార్తా పత్రికల పరిస్థితి

భారత ప్రభుత్వపు వార్తా పత్రికల రిజిష్ట్రార్ ఈమధ్య ప్రకటించిన పదమూడవ నివేదికలో వెల్లడి అయిన వివరాలనుబట్టి అన్ని రకాల తెలుగు పత్రికల సంఖ్య 1968 సంవత్సరంలో పెరిగింది. 1967 సంవత్సరంలో 314 పత్రికలుంటే 1968 సం॥లో 328 పత్రికలున్నాయి. 1963 లో వెలువడుతున్న తెలుగు పత్రికల సంఖ్యతో పోలిస్తే 1968 సంవత్సరంలో ఈ సంఖ్య 17.6 శాతం పెరిగింది.

తెలుగు దిన పత్రికల సంఖ్య మాత్రం (వారానికి రెండు, మూడు సార్లు వెలువడే పత్రికలతోసహా) 1967లో 15 నుండి 1968లో 12 వరకు తగ్గింది.

1963 నుండి 1967 వరకు తెలుగు పత్రికల సర్క్యులేషన్ ఏటేటా హెచ్చుతూ, తగ్గుతూవున్నా మొత్తం మీద 1967 సం॥లో (19.67 లక్షలు) 1963లో (19.25 లక్షలు)కన్న ఎక్కువయింది. 1967 సం॥లో ఈ సర్క్యులేషన్ క్రితం సంవత్సరం కన్న 8.7 శాతం తగ్గింది. (1966లో 10.59 లక్షలుంటే 1967లో 9.67 లక్షలుంది.) 1967, 1968 రెండు సంవత్సరాల్లో వెలువడిన పత్రికల సర్క్యులేషన్ 4.5శాతం తగ్గింది. 1967 సంవత్సరంలో వీటి సర్క్యులేషన్ 8.80 లక్షలుంటే 1968 సంవత్సరానికి 8.40 లక్షలకు తగ్గింది. ఈ తగ్గుదలలో అన్ని పత్రికలు భాగం పంచుకున్నాయి.

దేశం మొత్తంలో వెలువడిన 328 తెలుగు పత్రికల్లో ఆంధ్రప్రదేశ్‌నుంచి 279, తమిళనాడు నుంచి 41, మైసూరునుంచి 4, మహారాష్ట్ర నుంచి 2, పశ్చిమ బెంగాల్ ఢిల్లీల నుంచి ఒక్కొక్కటి వెలువడినాయి. మొత్తం తెలుగు పత్రికల సర్క్యులేషన్ 9.51 లక్షల్లో, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వెలువడే పత్రికల సర్క్యులేషన్ 5.22 లక్షలుంది.

మొత్తం తెలుగు పత్రికలు 217 వుంటే వాటిలో 201 చిన్న తరహాకు సంబంధించినవి (వీటిలో ఒక్కొక్కదానికి 5000 వరకు సర్క్యులేషన్ వుండేవి. 184. తెలుగు దిన పత్రికల్లో దేనికీకూడా లక్షకుపైగా సర్క్యులేషన్ లేదు. (ఇందులో ఒకదానికి 50,000___1,00,000 సర్క్యులేషన్ వుంది.) దినపత్రికల్లో 3 మధ్యతరహా 8 చిన్నతరహా పత్రికలున్నాయి. తెలుగు దిన పత్రికల సర్క్యులేషన్ మొత్తంలో ఒక పెద్ద దినపత్రికకే 3.58 శాతం వుండేది. మధ్యతరహా పత్రికల సర్క్యులేషన్ శాతం 35.4. దేశం మొత్తంమీద వెలువడే పత్రికలన్నింటిలో హైదరాబాదు నుంచి ప్రచురించబడే పత్రికల శాతం 14.6 శాతం. మద్రాసు నుండి ప్రచురించబడినవి 13.3 శాతం చొప్పున ఉన్నాయి.

# తెలంగాణా ప్రజల పండుగ

# బోనాలు

— పోకూరి శ్రీరాములు

శ్రావణమాసంలో ఆకాశం అంతా మొయిళ్ళతో నిండి నేల నలుచెరగులూ ఆకుపచ్చని వస్త్రాన్ని ధరించి, వర్షపు చినుకులు మనస్సుకు ఆహ్లాదాన్ని పంచిపెట్టే సమయంలో, తెలంగాణా ప్రాంతంలోని గ్రామాలు, నగరాలు చంగు, సన్నాయి ధ్వనులతో ఆ ఋతువుకు స్వాగత గీతాన్ని పాడు తూంటే, నొసట రూపాయిళబిళ్ళ మందాన కుంకుమ బొట్టు దిద్ది జట్లుజట్లుగా, గుంపులు గుంపులుగా బారులు తీర్చి నెత్తి మీద కలశాన్ని పెట్టుకుని——

"ముత్తైద కుంకుమ నొష్టకుంటే జాలు
చేతెడుగాజులు చేతులకుంటే జాలు
ముత్తైద మట్టెలు కాళ్లకుంటె జాలు
నాకు బెట్టిన పసుపు చెంపల కుంటె జాలు
నా యొక్క మంగళస్రూతం గట్టిగుంటె జాలు
నా యొక్క నల్ల పూసలు గట్టిగుంటె జాలు"

అని పాడుతూ ముత్తైదువలు పోచమ్మ గుడికి వెళూన్న దృశ్యాలు ఎంతో కనుల పండువుగా వుంటాయి. కలశాల్ని తీసుకుని పోచమ్మ గుడికి వెళుతూన్న ఈ వేడుకనే "బోనాలు తియ్యడం" అంటారు.

ఒక విధంగా చూస్తే "బోనాలు" పండుగకన్న జాతర ఏమో అనిపిస్తుంది. ఈ విధంగా అనుకోవడానికి కారణం ఆంధ్ర పాంతంలో కూడా సంవత్సరానికో పర్యాయం గ్రామదేవతల్ని సంతుష్టిపరచడానికి ఇటువంటి జాతర్లు, వేడుకలు చేస్తూవుండడమే. ఉదాహరణకు గంగమ్మ తిరణాల, పోలేరమ్మ పొంగళ్లు, అమ్మవారి జాతర ఇటువంటివే. ప్రతి జిల్లాలోనూ అక్కడ కొలిచే గ్రామ దేవతలపేర్లను బట్టి జాతర్లూ, కూతిరణా వున్నాయి. సంఘంలోని అన్ని వర్గాలవారూ ఎంతో ఉత్సాహంతో ఈ జాతర్లలో పాల్గొవడం మనం చూస్తూనే వుంటాము. జాతర, తిరణాల అనగానే ప్రజలు, ఎడ్ల పందాలు, కోడి పందాలు, మిఠాయి దుకాణాలు, రంగుల రాట్నాలు, మట్టిబొమ్మలు ఇంకా ఎన్నో సంరంభాలు జ్ఞప్తికి వస్తాయి. ఇన్ని హంగులూ కలిగి ఉన్నా ఇవి పండుగులకున్న స్థాయి అందుకోలేవేమో అనిపిస్తుంది. కాని "బోనాలు" జాతరయినా తెలంగాణా ప్రాంతంలో పండుగ స్థాయిలోనే జరుపబడుతూ, పండుగకున్న సాంస్కృతిక ప్రాధాన్యం సంతరించుకుని ఉండటం దాని ప్రత్యేకతను చాటుతూంది. తెలంగాణాలోని మహిళలు సామూహికంగా జరుపుకొనే పండుగల్లో బోనాలు ముఖ్యమైందనే చెప్పాలి. ఇది వారి ధర్మ విశ్వాసాల్ని చాటడమే కాక తెలంగాణా ప్రాంతపు జానపద కళాభిరుచికి దర్పణం లాంటిది.



బోనాలు సమయంలో పోతరాజు నృత్యం

మారెమ్మ, గంగమ్మ, పోలేరమ్మ లాగానే పోచమ్మ స్ఫోటకానికి అధిదేవత. ఈ దేవతను సంతృప్తి పరుస్తే మశూచికం, ఆటలమ్మ, దద్దులాంటి అంటువ్యాధులు ప్రకోపించవనే ప్రజల నమ్మకమే బోనాలు తియ్యడానికి ప్రబల కారణంగా పేర్కొనవచ్చు. గ్రామదెతల్ని సంతుష్టి పరచే ఇటువంటి జాతర్లు దేశంలోని అన్ని ప్రాంతాల్లోను రకరకాల పేర్లతో జరపబడుతున్నాయి. ఉదాహరణకు ఉత్తరదేశంలో స్ఫోటకాన్ని "శీతలాదేవి" అనీ శీతలామా అని బెంగాలులో "బంగాలిన్ దేవి" అనీ పిలుస్తారు. శీతలాదేవిని సంతుష్టి పరచడానికి వారు జాతరలు చేస్తారు. ఈ జాతర్లను వారు బాసోడా అంటారు. బాసీ అంటే రాత్రి వండినది, లేదా నిన్నటి రోజున మిగిలినది అని అర్థం జాతర ఒకరోజు వున్నదనగా అమ్మ వారికి భోగం పెట్టే పొంగలి వండుతారు. ఒక రోజు ముందు వండిన ఆ పొంగలినే ప్రతి కుటుంబం తింటారు. వారు దీన్ని ఖచడీ అంటారు. అందుకనే కాబోలు ఉత్తరదేశంలో ఈ జాతరకు బాసోడా అని పేరు వచ్చింది. తెలంగాణా ప్రాంతంలోని బోనాలు కూడ ఇంచుమించు ఇలాంటి జాతరే. సర్వసాధారణంగా బోనాలు పండుగ శ్రావణ మాసంలో చేస్తారు. కొన్ని కొన్నిస్థలాల్లో ఆషాఢమాసంలో చేయడం కూడా కద్దు. తిథి నక్షత్రమూ అంటూ లేదు బోనాలు తీయడానికి. స్ఫోటకం ప్రబలినపుడల్లా బోనాలు తియ్యడం సర్వసాధారణ విషయం. బోనం అంటే అర్థం- ఒక రకమైన పులగం, లేక పొంగలిఅన్ని. ఓపెద్ద ఇత్తడిపాత్రలో పెసరపప్పు బియ్యం వేసి ఉడికిస్తారు. రంగు తేవడం కోసం కొంచెం పసుపు



బోనాలు తీసుకువెళ్తున్న దృశ్యం

కూడా కలుపుతారు. పొంగలి ఉడకగానే దాన్ని పొయ్యి మీదనుండి దించి దానికి అంటుకుని వున్న మసిని, బూడిదను గుడ్డతో తుడిచి శుభ్రపరుస్తారు. తరువాత పసుపు, కుంకుమ, పసుపూ సున్నమూ కలిపి తయారుచేసిన తిరుచూర్ణంతో, చుక్కలతో కలశాన్ని అందంగా అలంకరిస్తారు. వేపాకులతో ఒక మాలకట్టి దానిని కలశం మెడకు చుట్టూకడతారు. కలశంపై మరొక పాత్ర ఉంచుతారు. ఈపాత్రను వారు కడుముంత అంటారు. ఈ కడుముంతలో బెల్లం పానకం పోస్తారు. పొంగలిలో ఉప్పుకు బదులు పానకం పోస్తారు. బెల్లం పానకం వున్న పాత్రపై కంచుడు వుంచి దానిలో మానెపోసి వత్తి వెలిగిస్తారు. దీపం సన్నసన్నని కాంతి కంచుడు పైగల రంధ్రాలద్వారా బయటకు కనబడుతూంటుంది. దీపాన్ని వారు గాలికి ఆరిపోని విధంగా సవరిస్తారు.

సాధారణంగా పోచమ్మ గుడి ఊరికివెలుపలే ఉంటుంది. అక్కడికి డప్పులతో బోనంతీసుకుని బయలుదేరుతారు. దారిలో ప్రతి ఇంటి వద్దఆగి "బోనాలు తీస్తారా?" అని అడగడం ఆచారం. బోనాలు తీసేవాళ్ళయితే వారు గూడా ఊరేగింపులో కలుస్తారు. నెత్తిపై చుట్ట, దానిపై పొంగలి వండిన పాత్ర, ఆపై పానకం పాత్ర, వాటిపై కంచుడు–ఈ విధంగా అమర్చుకుని బోనాలు కదులుతాయి అమ్మవారిగుడివైపు. డప్పువాయించే వ్యక్తిని తెలంగాణా ప్రాంతంలో బైండ్లోడు, బవనీలు అని పిలుస్తారు. డప్పువాయించుకుంటూ బైండ్లోడు వూరేగింపుకు ముందుగా సాగుతుంటాడు. అతని వెనుకనే బోనాలు నెత్తిపై ధరించి బోనభామినులు కదులుతారు.

దేవీసప్తశతికి మల్లే పోచమ్మను గురించి ఈప్రాంతంలో చాలాకథలు, నమ్మకాలు ప్రచారంలో ఉన్నాయి. మహిషాసురమర్దని, కాళికా దేవికి మాదిరిగా పోచమ్మను గురించి ఇందులో వర్ణనలు చేయబడ్డాయి. బోనాలు సాగిపోతూంటే కొంతమందికి–ముఖ్యంగా వయసుమళ్ళిన స్త్రీలకు పూనకం వస్తుంది. దీనినే వీరు శివం ఎత్తిందంటారు. శివం ఎత్తిన స్త్రీ డప్పుకు అనుగుణంగా ఎగురుతూ కదం తొక్కుతుంది. పొడుగాటి శిరోజాలు విరబోసుకుని ఆమె గెంతుతుంది. అతివేగంగా ఆమె వేసే అడుగులకు శరీరమంతా చెమటతో తడిసి ముఖంపై వున్నకుంకుమ చెంపలపై జారి ముఖాన్ని అంతటినీ రక్తవర్ణం చేస్తుంది. పసుపు రాసుకున్న ముఖమేమో అది కూడా తడిసి కుంకుమతో కలిసిపోతుంది. కల్లు సేవించడంవల్ల ఈ శివం వస్తుందని అభ్యుదయభావాలు కలవారు కొంతమంది అంటారు. కాని శివం ఎత్తినపుడు ఎంతో వైభవోపేతంగాను, లయబద్ధంగాను పెద్ద పెద్ద అంగలు వేస్తూ ఎగిరెగిరి కదం తొక్కడం చూసినవారు ఏదో అజ్ఞాతశక్తి ఈమెను ఆవేశించినదని చెప్పకమానరు. ఆమె చేతిలోవున్న వేపాకు మండల్ని నములుతూ, చుట్టు కొన్ని ఆకుల్ని విసరివేస్తూ వుంటుంది. ఆమె విరబోసుకున్న శిరోజాలకు పిల్లల్ని తాకింపచేస్తే ఆపదలు రావని ప్రజల నమ్మకం. ప్రార్థన చెయ్యగా కోరినకోర్కె తీరుస్తామని మాట ఇచ్చిన పిదపగాని శివం దిగదు.

పోచమ్మను ఆరాధించే వారిలో మాంసాహారులూ, శాకాహారులూ ఇరువర్గాల వారూ వున్నారు. మొక్కులు మొక్కి కార్యసిద్ధికాగానే మొక్కుబడి చెల్లించటం కోసం ఈ రెండు వర్గాలవారూ బోనాలు తీస్తుంటారు. బలిగా ఏ కోడి పెట్టనో, మేకనో, దున్నపోతునో ఇస్తారు. అయితే బలి ఇచ్చే ఆచారం మారుమూల గ్రామాల్లో తప్ప ఇతరత్రా కనిపించదు. వాడలన్నీ తిరిగి బోనాలు గుడికి చేరగానే పూజారి అవి తెచ్చిన వారిపై నీరు చల్లి శుద్ధి చేస్తాడు. కడుముంత, పొంగలిపాత్ర, కంచుడు వేరు చేస్తాడు. కడుముంతలోని పానకంతో గుడిగడప కడుగుతారు పోచమ్మ భక్తులు. మిగిలిన పానకాన్ని వారు తమ తమ ఇళ్ళకు తీసుకపోతారు. ఆకులు పరిచి వాటిపై దేవికి నైవేద్యం పెడతారు. పోచమ్మ గుడిలో పూజారిగా ఎక్కడో తప్ప బ్రాహ్మణులు ఉండరు. తరుచుగా రజకులే వుండడం జరుగుతుంది. అమ్మవారి వాహనం గాడిద, పూజారి రజకుడు. ఉత్తరదేశంలోనూ ఈ సంప్రదాయమే వున్నట్లు కనబడుతుంది. అయితే అక్కడి పూజారి రజకుడు కాక కుమ్మరి ఉంటాడు. అతడు రెండు కుండల్లో కల్లు నింపి అమ్మవారి వద్దకు తెస్తాడు. ఒక కుండలోని కల్లుతో పోచమ్మ విగ్రహాన్ని పరిశుభ్రంగా కడిగి రెండవ కుండ "వారు" పోస్తాడు, ఇలా వారు పోసేటప్పుడు రజకుడు, యజమాని కుటుంబంలోని ప్రతి ఒక్కరిపేరు ఉచ్చరిస్తాడు. వారిని చల్లగాచూడాలని దేవిని కోరతాడు. నైవేద్యం, కలశంలో మిగిలిపోయిన పొంగలి అతడు తీసుకుంటాడు విశేషమేమంటే బోనాన్ని ఎవరూ భుజించరు. అంతా రజకునికే ఇచ్చివేస్తారు.

పూర్వం పల్లెలలో వృత్తిపని చేసే వారు వారుచేసే సేవలకు ప్రతిఫలం ఎప్పటికప్పుడు ఇచ్చుకునే వారుకాదు. ఏడాదికో తూరి శుభకార్యం సమయాల్లో వడ్లు, జొన్నలు ఇతర బహుమానాలు ఇచ్చే ఆచారం ఉండేది. కాని ఇప్పుడు రోజులు మారాయి. గింజలు ఇచ్చేవారులేరు. ఇచ్చినా పుచ్చుకునేవారూలేరు.

కరీంనగరు జిల్లాలోని సుప్రసిద్ధ శైవక్షేత్రం వేములవాడకు శివరాత్రి సందర్భంలో ఇరవైముప్పై గ్రామాల నుండి ఎక్కువగా

పల్లెప్రజలు బోనాలు తీసుకుని వస్తారు. ఆ దృశ్యం ఎంతో చూడ ముచ్చటగా వుంటుంది. తప్పక చూచి ఆవందించవలసిన పర్వదినం. మత విశ్వాసాలు లేనివారు కూడా ఈ ఉత్సవంలో పాల్గొంటారు. చాలామంది మద్యంసేవించి తందనాలాడుతూ ఉంటారు. సాముగరిడీలు మొదలైన ప్రదర్శనలు జరుగుతాయి.

హైదరాబాదు (లాల్‌దర్వాజా) సికింద్రాబాదు జంట నగరాల్లో మహంకాళి జాతర భారీఎత్తున ఏటేటా జరుగుతుంది. బోనాలు తీసిన మర్నాడు అమ్మవారిని సాగనంపుతారు. రంగం ఎక్కడం, పోతరాజు వేషం, ఘటం మొదలైన కార్యక్రమాలు ఉదయం నుండి సాయంతం వరకు ఉంటాయి. పోతరాజు అమ్మవారి తమ్ముడు. అతడు ఆవహించిన వ్యక్తి మేకను బలిగా తీసుకునే వాడట పూర్వం. "దీనినే గావు పట్టడం" అంటారు. పోతరాజు వేషం కాళికావేషం లాగ చూడడానికి భయంకరంగా ఉంటుంది గావు పట్టడం జరగగానే పోతరాజు పళ్ళతోనే మేకను కొరికి వేసేవాడట!

రానురాను బలిఇచ్చే ఆచారం పోయి ఇప్పుడు గుమ్మడికాయను కొరికి శాంతి పొందే పద్ధతి అమలులో వుంది. గావు పటే ముందు రంగం ఎక్కడం జరుగుతుంది. రంగం ఎక్కడం అంటే ఆవంలో కాలవి వచ్చి కుండ మీద పూనకం పూనిన స్త్రీ, గంటల తరబడి నిలబడి గ్రామప్రజల నుద్దేశించి రానున్న కష్టసుఖాల్ని కూర్చి చెప్పడం అన్నమాట. ఆమె చుటూచేరిన గ్రామప్రజల్లోని పెద్ద మనుషులు గ్రామప్రజల శ్రేయస్సుకోరి ప్రార్థనలు సలుపుతారు. దేవివి శాంతింప చేస్తారు. తరవాత అమ్మవారి విగ్రహాన్ని వేపాకులతోను, మొగలి పువ్వులతోను, నిమ్మకాయలతోను అలంకరించి ఒక కలశంలాగ తయారుచేస్తారు. ఈ కలశాన్నే వారు ఘటం అంటారు. ఈ ఘటాన్ని ఊరంతా ఊరేగించిన తరువాత గుడికి చేరుతారు. ఒక పెద్ద తొట్టెలో కూర్చి అమ్మవారిని సాగనంపుతారు.

తెలంగాణా ప్రాంతంలోని కొన్ని స్థలాల్లో బోనాలపై వామ మార్గీయుల ప్రభావం కనబడుతుంది. ఉదాహరణకు పూజారి, దేవికి నైవేద్యం ఎవరూచూస్తుండగా పెట్టడు. పూజారి అతని అనుచరులు కల్లుతాగి తందనాలాడుతూ, కీర్తనలు పాడుతూ జాగారం చెయ్యడానికి పంచ మకారాల్ని (మద్యము, మాంసము, మత్స్యము, ముద్ర, మైథునము) పూజించే వామ సంప్రదాయానికి సంబంధము కనబడుతుంది. బోనంలో బలిరక్తాన్ని కలుపుతారు. రక్తం కలిపిన ఈ పొంగలిని వీధుల్లో ఇళ్ళముందు చల్లుతారుకూడాను. దేవీ ప్రసాదం రాలిన పరిసరాల్లో అంటువ్యాధులు సోకవని వారి నమ్మకం. ఇలా చల్లిన బోనాన్ని కొంతమంది ఏరుకుని ఇళ్ళల్లో భద్రపరిచే ఆచారం కూడా వుంది. బోనం ఇంట్లో ఉండగా స్ఫోటకం రాదని వారి దృఢవిశ్వాసం. *

# మకర సంక్రాంతి

**-కల్యాణసింగ్**

ఆకాశంలో సూర్యుడు నక్షత్ర మండలంద్వారా పయనించేమార్గానికి క్రాంతివృత్తం అంటారు. ఆ చక్రాన్ని పన్నెండు రాసులుగా భాగించారు జ్యోతి శాస్త్రవేత్తలు. అవే మేషాది ద్వాదశ రాశులు

సూర్యుడు ఒక రాశినుంచి ఆ తరువాతి రాశిలో ప్రవేశించే సమయానికి సంక్రాంతి లేక సంక్రమణం అంటారు. సూర్యుడు మేషరాశిలో ప్రవేశించే సమయం మేష సంక్రాంతి. ఇదేవిధంగా తక్కిన సంక్రాంతులూనూ. మకర సంక్రాంతి నుంచి ఆరు నెలలు ఉత్తరాయణం. కర్కాటక సంక్రాంతి నుంచి ఆరు నెలలు దక్షిణాయణం. ఈ రెండు సంక్రాంతులూ అయన సంక్రాంతులు.

ఉత్తరాయణం ప్రారంభమయ్యే మకర సంక్రాంతికి మరీ ప్రాముఖ్యం ఉంది. అది పెద్ద పండుగగా ప్రసిద్ధి పొందింది. ఆనాడు పల్లెలూ, పట్టణాలూ-ముఖ్యంగా పల్లెలు-కన్నులపండుగగా కలకలలాడుతూ ఉంటాయి.

వెలల గోడ లన్నిటను వీథుల మంట
నెగళ్లు లిండ్లవా
కిళ్లను ముగ్గుల ల్లరుగుగ్రేవల సున్నపు బొట్లు
జేగురు
త్పుల్లపు బూసరుల్ పసుపు బూతలు ద్వారములందు
కుంకుముల్
పల్లెలు పట్టణాలు కనుబండువు సంక్రమణంపు
బండుగన్

-వసురాయకవి.

గోడలకు వెల్లలు, వీథులలో చలి మంటలు, వాకిళ్లలో ముగ్గులు, అరుగుల ప్రక్కన జేగురు, సున్నపుబొట్లు, ద్వారాలలో పూచిన పువ్వులు, పసుపు కుంకుమ పూతలు - వేడుకలు పండే పండుగ సంక్రాంతి,

మకర సంక్రాంతి ప్రధానంగా పంటల పండుగ. జీవనాధారమైన ఆహారోత్పత్తి ప్రయత్న సాఫల్యానికి సంబరపడే పండుగ. పరిశ్రమ ప్రతీక్షలతో కూడుకొన్న మహా ప్రయత్నం సేద్యం. భూమి కాఠిన్యాన్నీ, వాతావరణ చాపల్యాన్నీ, మేఘాల కార్పణ్యాన్నీ సహించుకోవలసి ఉంటుంది. కర్షకుడు ఎండ అనక వాన అనక కష్టించాలి. ప్రకృతి ముఖం చిట్లించుకుంటే రైతునకు కన్నీరు. ప్రకృతి ప్రకాశిస్తే అతనికి ఉల్లాసం. ఇంత శ్రమ, ఇంత శోధన ఫలితంగా పైరు మొక్కలకు బంగారు వన్నె వచ్చి గింజపండినప్పుడు కర్షకునికే కాదు ఆ అన్నదాతపై ఆధారపడి ఉన్న ఇతరులందరికీ కూడా జయోత్సాహమే. బంగారు పంట ఇంట పదిలమయ్యే సౌభాగ్య సమయం సంక్రాంతి సమయం.

సంక్రాంతి పండుగ ఉత్సాహం వాస్తవానికి ఒకనెల ముందు నుంచే ప్రారంభంఅవుతుంది. సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించినది మొదలు ధనుర్మాసం. అది మకర సంక్రాంతికి ముందటి నెల. ఆ నెల పొడవునా పండుగే.

ధనుర్మాసమంతా విష్ణ్వాలయాలలో విశేషమే. ఆ మాసంలో మధుసూదన దేవునికి పొంగలి నైవేద్యం పెట్టే ఆచారం ఉంది. పొంగలికి బియ్యం ఎన్ని పోస్తే పెసరపప్పు అంత పరిమితిలో వెయ్యాలి. బియ్యమూ, పెసర పప్పు సమంగా వేసి వండినది పులగం. దీనిలో మిరియాలూ, ఇంగువ చేరుస్తారు. నెయ్యి బాగా పొయ్యాలి. పంచదార, ద్రాక్షపళ్లు, పచ్చ కర్పూరం, కుంకుమ పువ్వు మొదలైన సుగంధ మధుర ద్రవ్యాలు కలిపి నేతితో వండితే అది చక్కెర పొంగలి అవుతుంది. మొదటి రెండు వారాలపాటు పొంగలి నైవేద్యం పెట్టాలి. ఆ తరువాత రెండు వారాలపాటు దధ్యోదనం నైవేద్యం పెట్టాలి. మంచి రుచిగల గట్టి పెరుగు తెచ్చి దానిలో మిరియాలు, ఇంగువ, శొంఠి మొదలైనవీ ఇంకా రుచిగల ఇతర పదార్థాలూ కలిపి దానిలో అన్నం కలిపితే అది దధ్యోదనం అవుతుంది.

వైద్యశాస్త్రరీత్యా చలికాలంలో ఉదయం పెసరపప్పు అన్నం (పులగం) తినడం మంచిది. అది అందరికీ సాధ్యపడదు కనక మన పూర్వులు పెరుమాళ్ల కోవెలలో పులగం వండి పంచిపెట్టే పద్ధతి ఏర్పాటు చేశారు.

గాదెలు నిండినకాలం, లేదనకుండా చెయ్యి విదిపే సమయం కనక పేదలకు కరువుతీరే సమయం. ఉత్తరాయణం వచ్చింది ఉరి పెట్టుకోమనే సామెత ఉంది. ఈ పుణ్యకాలంలో శరీరం విడిస్తే స్వర్గప్రాప్తి కలుగుతుందనే విశ్వాసం ఉంది.

పొలాల పండుగ, పంటల పండుగ, పొంగలి పండుగ, చలి మంటల పండుగ సంక్రాంతి. బంతి చేమంతి పువ్వుల దరహాసాలతో, కొత్త గృహిణుల వికాసాలతో, కొత్త అల్లుళ్ల అట్టహాసాలతో, వావివరసల పరిహాసాలతో ఇళ్లు ఆనంద నిలయాలుగా ఉండే మహాపర్వం మకర సంక్రాంతి. తెలుగు మాగాణిలో పండిన రాజనాల కమ్మదనాన్ని పౌషలక్ష్మి మనకు అందించే పర్వసమయం మకర సంక్రాంతి. **

# సంక్రాంతి మనోగతాలు

— రావూరు

వచ్చుచున్నది సంక్రాంతి, వచ్చునన్న
క్రొత్త అల్లుడు వచ్చునో, కోపగించి
రానురానంచు కబురంపి రానెరాడొ!
పిల్లనిచ్చిన రోజునే పిల్లికూన
బ్రతుకులై పోయె. పైనున్న ప్రభువు కాన
అల్లుడను పేర భగవంతు డవతరించె.
ఎవరి నెంతగ మ్రొక్కుటో ఎరుగలేక
ఇంటి యజమాని నట్టింట కుంటుచుండె.

అంచు పంచెలు కట్టెడు అందగాడు
క్రొత్త టెరిలిన్ లాగులు కోరెనంట
సరిగ తలపాగ చుట్టెడు సరసగాడు
దొరల టోపీలకోసమై మురిసెనంట
కిర్రు చెప్పులు ధరియించు కులుకుగాడు
సన్న ముక్కుల బూటుకై సణిగెనంట
పిదప కాలమ్ము వచ్చెను— అదుపులేదు
ఎంత గొప్పగ బ్రతికిన నేమి ఫలము
అల్లుడయ్యకు గజ గజ లాడవలెను

ఆడబడుచుకు సర్వమ్ము ఓడవలయు
పిల్ల నిచ్చిన వారన్న చెల్లబోవి
కాని డబ్బులకన్నను హీన మౌదు—
రేమి సేతుము పెంచిన ప్రేమకొరకు
మనసు అప్పడ మట్లుగా మాడిపోవు—
అల్లుడయ్యల పెదవుల ఉల్లిపూవు
పూచినను చాలు మనసులు పొంగి పొరలు
క్రొత్త అల్లుడు వచ్చునో, కోపగించి
రానురానంచు కబురంపి రానెరాడొ!

*    *    *    *

మిరప లీయేడు ఏమాత్ర మురుములేవు
మనసు మురిపించురీతిగా శనగపూచె
మినుములొక్కటి ఈ యేడు మించి పండె
తరుగకే పండె పసుపు ఏతాము చలవ
చెప్పకేవచ్చె మొన్న రాచిల్క దండు

మొక్కజొన్న పొత్తుల నెర్రి ముక్కుకోడ
చీల్చి పాలగింజల నేల జిమ్మిపోయె
పిట్టజాతులు పొట్టలు పట్టినంత
తినుట పుణ్యమ్ము, రైతుల మనసులందు
పచ్చరెక్కలు విసిరిన పగిదినుండు—
జీవు లెల్లరి పోషించు దైవమెరుగు
పంట లెవరికి ఎంతెంత పంచవలెనొ
పెండలమ్మది ప్రాకెను, కొండజాతి
తుమ్మ మొదలందు పండును ఇమ్ముగాను
కంద పెరిగిన దవ్వల కథలలోన
కన్న తల్లిని వర్ణించు కొండవోలె
ధరణి నమ్మినవారికి కరువులేదు

*    *    *    *

భోగి పండుగ నాటికే పుల్ల ఆవు
వెళ్ల బడుమాట సత్యము— చిళ్లగింజ
నునువు వచ్చెను వేవిళ్ల వెనుకబడగ—
కోడె దూడైన కోటప్ప కొండ గుడికి
ప్రభను లాగింతుమను మొక్కు బడులుగలవు
పెయ్య దూడను వేసెనా! వెయ్యిగోవు
లవతరించును అందాల అమ్మలవుచు
కాపు భాగ్యమ్ము గోవుల కన్నులందు
తాండవించుటలోన సత్యమ్ముసుమ్ము
జోడు గిత్తల బండి నీయేడు కట్టి
బంధు లందరి ఇండ్లకు పంపవలెను
పళుగణంబులె రైతు సంపదలు నిజము.

*    *    *    *

ఎగిరి సంక్రాంతి శోభ లేచేటవచ్చు
ఎరుగజాలని సంతోష మెరిగినపుడె
రైతు మనసుల వెన్నెల జ్యోతి వెలుగు
కరుణ దాగిన మనసుల కరగివచ్చు
కమ్మనౌమాట నిత్య సంక్రాంతి మనకు.

సీరియల్

# గృహిణి

## పిలకా గణపతి శాస్త్రి

### జరిగిన కథ

పార్థసారథి నాటకాలు వేస్తుంటాడు. ఏలూరులో ఒకసారి శ్రీకృష్ణ తులాభారం వేద్దామని బ్రహ్మాండంగా ఏర్పాటు చేసుకున్నాడు. ఆ నాటకంలో హీరోయిన్ వేషంవేసే సరోజకు సినిమాలో ఛాన్సు దొరకడంవల్ల ఆమెరావడం పడలేదు. నాటకం అభాసైంది. ఆమెను వెంట బెట్టుకుని వద్దామని పార్థసారథి మద్రాసు వెళ్ళాడు. అక్కడ సరోజ మేనమామతో ఘర్షణపడ్డాడు మనసంతా వికలమైంది. జ్వరంతో కదలలేకుండావున్న అతన్ని అతని బంధువు కృష్ణమూర్తి, యింటికి చేరవేశాడు. జ్వరతీవ్రత ఏమాత్రం తగ్గలేదు.

కృష్ణమూర్తి ఇంటికి తిరిగి వచ్చిన అరగంటలోగానే డాక్టర్లు ఇద్దరు లోపలికి వచ్చి పార్థసారథిని పరీక్షించారు. ఎంత సేపటికి వారిద్దరికి ఆ రోగం పుట్టు పూర్వోత్తరాల సంగతి గాని, ప్రస్తుత పరిస్థితి గాని అంతుచిక్కలేదు. ఆ జ్వరం మందులు వేసిన పిమ్మట కొంత తగ్గి మొదటికి వస్తున్నది. తామిద్దరు ఆలోచించుకుని ఇస్తున్న మందులు, ఇంజక్షనులు మొత్తంమీద పని చేస్తునట్టా? లేనట్టా? అవి సరిఅయినవేనా? అసలు తమ రోగనిదానం తిన్నని దారిలో పడిందా?, ఆవిధంగా మరి కొంత సేపు మథన పడిన తరువాత డాక్టరు శర్మ ఇంకా కొంత సేపాలోచించి, మొత్తంమీద తామిచ్చిన ఇంజక్షనులే ఔషధాలే పార్థసారథి ప్రాణం ఆ క్షణంవరకు నిలబెట్టినట్టు తీర్మానించాడు. ఎలాగయినా ఇంగ్లాండు నించి దిగివచ్చిన దేవత కనక మధుసూధనరావు అతని నిర్ణయంతో ఏకీభవించక తప్పలేదు!

తిరిగి ఇద్దరు సంప్రదించుకుని ఇంకొక కొత్త ఇంజక్షను ఇచ్చి దాని ఫలితంకోసం ఇంకొక అరగంట సేపటి వరకు నిరీక్షించారు. అప్పటికి పార్థసారథికి తిరిగి రవంత తెలివి వచ్చింది. డాక్టరు శర్మ అతనికింకా వేరే మందులు కొన్ని కొని వెయ్యవలసి ఉన్నదని చెప్పి వాటి పేర్లు ఒక కాగితంమీద వ్రాసిఇచ్చి మధుసూధనరావుతో కలిసి ఇంటికి ప్రయాణమయినాడు. విజయలక్ష్మి వర్ధనమ్మ ఇనుమడిస్తున్న ఆందోళనతో అదే గదిలో ఒక మూల నిల్చున్నారు. డాక్టర్లు ఇద్దరు తమ గుర్రపు బళ్లు ఎక్కబోతూంటే కృష్ణమూర్తి వెంట వెళ్ళాడు. భయపడుతూ భయపడుతూ మధుసూధనరావు దగ్గరికి వెళ్ళి పరిస్థితి ఎలాగున్నదని అడిగాడు. ఆ డాక్టరు అతనివైపు చూసి వినబడీ వినబడనట్టుగా నీళ్లు నమిలాడు.

'మాటిమాటికి ఎలాగుంది? ఎలాగుంది? అని అడిగితే ఏమి చెప్పగలం కృష్ణమూర్తీ! నేనసలు తెల్లవారుతుందని కూడా అనుకోలేదు. మొట్టమొదటినుండి రోగం చాలా అస్తవ్యస్తంగా ఎగుడుదిగుడుగా తయారయింది! ఇట్టే తగ్గి ఇట్టే హెచ్చిపోతూంది! ఇప్పటికి కూడా పరిస్థితి ఇంచుమించు అలాగే ఉంది. కావలసిన వాళ్ళెవరయినా ఉంటే వెంటనే టెలిగ్రాములివ్వడమే మంచిది. వ్యవహారమంతా చెరుపు మరుపుగా ఉంది! ఇదిగో! ఈ నాలుగుపొట్లాలు రెండేసి గంటలకొకటి చొప్పున వాడుతూండు! ఇది నేను ప్రత్యేకంగా ఇస్తున్న మందు తెలుసునా? ఆ పైన పిల్లల అదృష్టం! అంతే!

డాక్టర్లు ఇద్దరు కలిసి వేరొక చోటికి వెళ్ళిపోయారు కృష్ణమూర్తి తిరిగి వచ్చిన పిమ్మట విజయలక్ష్మి, వర్ధనమ్మ డాక్టర్లిద్దరు ఏమన్నారని ఎంతో ఆత్రంగా అడిగారు. అతడు వారి కేమని సమాధానం చెప్పగలడు? డాక్టరు మధుసూధనరావు అన్న మాటలే తిరిగి వారికి చెప్పాడు. పార్థసారథికి కొంచెం తెలివి వచ్చిందని విజయలక్ష్మి సంతోషించింది. కాని కృష్ణమూర్తి సమాధానం విన్న పిమ్మట 'ఆ తెలివికి, రోగానికి సంబంధం లేదులాఉంది!' అని నిర్ణయించుకుని పార్థసారథి దగ్గర కుర్చీలో కూర్చుని ఏకాగ్ర చిత్తంతో పరిచర్య ప్రారంభించింది. మధుసూధనరావు అతి రహస్యంగా తన చేతికిచ్చిన పొట్లాలలో ఒకటి విప్పి చూశాడు కృష్ణమూర్తి. అవి కొంచెం పెద్ద తరహా హోమోపతీ మాత్రలు! డాక్టరు శర్మ మరికొన్ని మందులులేమో కొనవలసినదాని కాగితం మీద రాసిఇచ్చాడు. అవి ఇవి ఒకేనాడు వాడవచ్చునా? వాడకూడదా? కృష్ణమూర్తి కెటూతెగలేదు. సరే, డాక్టరు చెప్పాడుకదా! ఆయనకు ఆమాత్రం తెలియదా? అనుకుని, అవి విజయలక్ష్మి చేతికిచ్చి రెండేసి గంటల కొక్కొకటి చొప్పున వాడవలసినదని చెప్పి, డాక్టరు శర్మ వ్రాసిఇచ్చిన మందులు కొనడంకోసం బజారువైపు వెళ్ళాడు.

ఆవేళ సాయంకాలం దాకా పార్థసారథికి మళ్ళీ మగత రాలేదు. మరికొంత సేపటికి అతని అత్తమామలు రుక్మిణి, వెంకటేశ్వరరావు గుర్రపు బండిదిగి ఎంతో కంగారుపడుతూ ఇంట్లో అడుగుపెట్టారు. వెంకటేశ్వరరావు టెలిగ్రాం అందగానే రెండోపిల్ల కమలతోబాటు పిల్లలనందరిని ఇంట్లోనే ఉంచివేసి వెంటనే భార్యతోకలిసి బయలుదేరాడు. టెలిగ్రాం ధోరణిని బట్టి అప్పటికి అంతా అయిపోయి ఉండవచ్చునని భయపడ్డాడు. అటువంటి విడ్డూర మేది జరగలేదు. కాని మంచాని కంటుకుపోయిన పార్థసారథిని చూసినపిమ్మట అతనికెంతో ఆందోళన కలిగింది. బ్రతికి బయటపడడం కష్టమని నిశ్చయించుకున్నాడు. జీవితంలో జీర్ణించుకుపోయిన ఎడతెగని ఇబ్బందులవల్ల, చికాకులవల్ల, కష్టాలవల్ల కానున్నదేదో కాక మానదని గుండె రాయి చేసుకున్నాడు.

రుక్మిణీ కుమారైనెంతో ఆప్యాయంగా దగ్గరగా కూర్చోబెట్టుకుని కొన్నాళ్ళనించి తైలసంస్కారాలు లేక చిందరవందరగా ఉన్న తల దువ్వి జడవేసి సిగచుట్టింది. విజయలక్ష్మి మీద విరుచుకుపడ నున్న అమంగళం తలుచుకుని గుడ్లనీరు కుక్కుకున్నది.

ఆ వేళ రాత్రి ఇంచుమించుగా పది గంటలదాకా పార్థసారథి కొంచెం తెలివిగానే ఉన్నాడు. అత్తమామల నిద్దరిని బాగానే గుర్తించాడు. సంజ్ఞలతో వారడిగిన ప్రశ్నల కతికష్టంమీద మూలు గుతూ సంగ్రహంగా సమాధానాలు చెప్పాడు. కాని రాత్రి పది గంటలు దాటిన తరువాత అతనికి పూర్తిగా స్మారకం తప్పింది. రవంత ఆయాసము క్రమక్రమంగా ఎగఊపిరి కూడా ప్రారంభ మయ్యాయి. ఆ సంగతి విజయలక్ష్మి చెప్పినదాకా కృష్ణమూర్తి కనిపెట్టలేదు. విపరీతమయిన నీరసం మూలాన శ్వాస కొంచెం బరువుగా వెలువడుతున్న దేమోనని భ్రమించాడు.

ఆ పైన ఒక క్షణమయినా ఆలస్యంచెయ్యక వెంటనే ఒక గుర్రపు బండిమీద డాక్టరుశర్మ ఇంటికివెళ్ళాడు. సమయానికి ఆయన ఇంటిదగ్గర లేడు. తిరిగిరావడానికి ఒక అరగంట పట్టింది. కృష్ణమూర్తి తొట్రుపడుతున్నమాటలతో పార్థసారథి ప్రమాద పరిస్థితి తెలియజేసి వెంటనే బయలుదేరి రావలసిందని బ్రతిమాలు కున్నాడు. డాక్టరుశర్మ అంతకుమునుపే రెండుమూడు కేసులు చూసి బాగా అలసిపోయాడు. అయినా కృష్ణమూర్తి మాట కెదురు చెప్పలేక తానెక్కిన వచ్చిన గుర్రపుబండిమీద అతనివెంట బయిలు దేరాడు.

డాక్టరు శర్మ పార్థసారథిని పరిశీలించాడు. నిజానికి అది ఎగ ఊపిరికాదు. పార్థసారథి కొంచెం బరువుగా శ్వాస విడుస్తు న్నాడు. అంతే. డాక్టరు వెంటనే ఒక బలమయిన ఇంజక్షన్ ఇచ్చాడు. రాత్రి పన్నెండు గంటలవరకు కొత్తమందు లేవో గొంతులో పోశాడు. అప్పటికి అతనిశ్వాస బరువు చాలావరకు తగ్గింది. కొంచెం తెలివివచ్చింది. నాడి బాగా అందుకుంది. గుండెలోకూడా అంతగా దోషం కనబడలేదు.

డాక్టరుశర్మ తిరిగి వెళ్ళిపోతుంటే కృష్ణమూర్తి తన ప్రగాఢ కృతజ్ఞత తెలియజేసి ఎంతో ఆత్రంగా 'ఇక గండం గడిచిపోయినట్టేనా ?' అని అడిగాడు. "తెల్లవారిన దాకా ఏ మాటా చెప్పలేను" అని నిష్కర్షగా ఉన్నదిఉన్నట్టు చెప్పి డాక్టరు శర్మ వెంటనే వెళ్ళిపోయాడు.

* * * *

కృష్ణమూర్తి ముఖతః డాక్టరుచెప్పిన మాటలన్ని విన్న విజయలక్ష్మి గుండెలో రాయిపడింది. గతరాత్రి ఎలాగో అలాగ గడిచింది. కాని ఇక ఆ రాత్రి గడవటం కష్టమని భయపడింది. పార్థసారథికి తిరిగి అంతగా మగతగాని, బరువయిన శ్వాసగాని ప్రారంభంకాలేదు. కాని బాగా నీరసించిపోయాడు. అతనికి ఊపిరి విడవడానికి కూడా శక్తిలేనట్టు కనిపించింది. ఆ పరిస్థితి పరిశీలించిన కొద్ది ఆమె గుండెలో విపరీతమయిన ఎడతెగని ఆందోళన బయలుదేరింది. ఇక ఒక క్షణమయినా అక్కడ కూర్చోలేక పోయింది. కృష్ణమూర్తితోను, భర్త కనతిదూరంలో కూర్చున్న తల్లిదండ్రులతోను ఇప్పుడే వస్తానని చెప్పి కాళ్ళ ముఖము శుభ్రంగా కడుక్కుని నెమ్మదిగా అమ్మవారి పూజగదిలో ప్రవే శించింది. చేతులుజోడించి నమస్కరించి, నేలమీద మోకరిల్లి కళ్ళుమూసుకుని ప్రార్థించింది. ఆమె చెక్కిళ్ళమీద కవోష్ణబాష్పాలు ఒకే ధారగా ప్రవహించాయి.

భర్తగతించిన తరువాత తానిక ఒక్కక్షణమయినా జీవించ లేనని మొరపెట్టుకొన్నది. మరి పాడుపడిపోయిన తన మనుగడ వల్ల మరి ప్రయోజనమేమని వాపోయింది. పసిపిల్లలమీద కని కరించి ఎలాగో అలాగ తన ఆయుర్దాయం అంతా భర్తకిచ్చి మరికొంత కాలమయినా బ్రతికించవలసినదని ఇనుమడిస్తున్న గుతికతో వేడుకొన్నది. ఆయన పాపఫలితాలేవయినా ఉంటే తన కీయవలసినవని ప్రాధేయపడింది. దిక్కులేని వారకింకెవ్వరు దిక్కున్నారని క్షీణస్వరంతో కుమిలికుమిలి విలపించింది.

అలాగ ఎంతసేపు గడిచిందో ఆమె కేమాత్రము తెలియ లేదు. భర్త దగ్గరికి తిరిగి వచ్చిన తరవాత టేబిల్‌మీద అలారం గడియారంలో రెండున్నర దాటినదని గ్రహించింది. కృష్ణమూర్తి నిద్రబరువుతో జోగుతున్నాడు. అప్పుడప్పుడు ఉలిక్కిపడి మేలుకుంటున్నాడు. అతనిమీద ఆమెకెంతో జాలికలిగింది.

'లోపలికి వెళ్ళి కొంచెంసేపు పడుకో బావా! మళ్ళీ నాలుగున్నరకి లేపుతానులే!'

తిరిగి తిరిగి బ్రతిమాలుకుంది. కృష్ణమూర్తి కాదనలేక పోయాడు. తిరిగి మూడున్నరకే మేలుకొలప వలిసినదని చెప్పి లోపలికివెళ్ళి పడుకున్నాడు. విజయలక్ష్మి మరికొన్ని నిమిషాలవరకు భర్తవెపే చూస్తూ కూర్చున్నది. లోలోపలి నుండి ఉప్పొంగుతున్న ఆత్మీయతతో నుదుటిమీద మృదువుగా ముద్దు పెట్టుకుని, తొణికిస లాడుతున్న ఆర్ద్రస్వరంతో నెమ్మదిగా పిలిచింది. పార్థసారథి వినబడీ వినబడనట్టు 'ఊ'! అని పలికి కళ్ళు రెండు రవంత తెరిచి తిరిగి మూసుకున్నాడు. అంతవరకు భర్తకింకా స్మారకం తప్పిపోలేదని గ్రహించుకుని ఆమె ఎంతో సంతోషించింది. ఆ రాత్రి తెల్లవారేదాకా రెప్పపాటయినా లేకుండా అతని వైపలాగే చూస్తూ కనిపెట్టుకుని ఉండి పరిచర్య చేసింది. రెండు మూడు రోజుల నుంచి బొత్తిగా నిద్ర లేకుండా మేలుకుని ఉన్నారని కృష్ణమూర్తిని మరిలేపలేదు.

బళ్ళుమని తెల్లవారగానే డాక్టర్లు ఇద్దరూ వచ్చి అతనిని జాగ్రత్తగా పరీక్షించి రవ్వంత ఆశ్చర్యపడ్డారు. ఆ నాడు తెల్లవార గలదని వారనుకోలేదు! అందుచేత ఇనుమడించిన ఆశతో గంట కొక్కొక్కటి చొప్పున రెండు మోచేతులమీద రెండు ఇంజక్షన్లు ఇచ్చారు. ఉదయం తొమ్మిది గంటలయిన తరవాత వారిద్దరికి అతడు జీవించగలడేమో అని ఆశ కలిగింది. అయితే ఆ నాటి సాయంకాలం వరకు పార్థసారథి జీవన మరణాల మధ్య ఊగిస లాడుతూనే ఉన్నాడు. డాక్టర్లు ఇద్దరు ఒకరిని విడిచి ఒకరు అతని సరసనే కూర్చుని అవసరమయిన ఔషధాలు, ఇంజక్షనులు గుప్పించారు. అపూర్వ చాకచక్యంతో, జాగరూకతతో ఆ రోగంతో

ఎడతెగని పోరాటం కొనసాగించారు. చీకటి పడిన తరవాత ఇక భయంలేదని కొంత ధైర్యం కలిగింది. అయితే డాక్టరిద్దరు మాత్రం ఆ మాట పైకి చెప్పలేదు. ఆ రాత్రి ఎనిమిది గంటలకి అతని పరిస్థితి బాగా మెరుగయింది ఇద్దరు డాక్టర్లు మరి భయంలేదని నిశ్చయించుకుని ఆదే శుభవార్త విజయలక్ష్మికి, కృష్ణమూర్తికి వెల్లడించారు. క్రమ క్రమంగా ఆ మరునాటి సాయంత్రానికి అతని అవగుణాలన్నీ పూర్తిగా తగ్గిపోయాయి. అయితే విపరీతమయిన విస్త్రాంతిలో మాత్రం మార్పేమి కనబడ లేదు.

ఇటీవల డాక్టరు మధుసూదనరావు, శర్మ, పార్థసారథి జీవించడం కష్టమని నిరాశ చేసుకున్నారు. అందుచేత అతడలాగ బ్రతికి బయటపడడం వారి కెంతయినా ఆశ్చర్యం కలిగించింది. అదీగాక ఆ రోగం మాటిమాటికి తగ్గుతూ హెచ్చుతూ వారి శక్తి సామర్థ్యాలనేక విధాల పరీక్షించింది. అందుచేత అది మొత్తంమీద వైద్య శాస్త్రంలోనే ఎన్నతగిన చాలా గొప్ప కేసని, అంతటి విచిత్రమయిన రోగం తాము ఆదివరకెన్నడు కనివిని ఎరుగమని పరిచితులందరి దగ్గిర దానిని గూర్చి చర్చించారు. అంతటి రుగ్మత కుదిర్చిన ఘనులమని పరోక్షంగా తమ శక్తి సామర్థ్యాలు తామే పొగడుకొని మెచ్చుకున్నారు.

అయితే పార్థసారథిని బ్రతికించిన కీర్తి మాత్రం ఎక్కువగా డాక్టరు శర్మకే దక్కింది. అంతటి జటిలమయిన టైఫాయిడ్ కేసు తాను అంతకు మునుపెన్నడు కనివిని ఎరగనని అతడు కొందరు ప్రత్యేక నిపుణులతో కలిసి దాని విచిత్ర లక్షణాలు కొన్ని చర్చించాడు. కాని అంతమాత్రంచేత మధుసూదనరావు నిరుత్సాహపడలేదు: ఆఖరి రోజున తానిచ్చిన హోమోపతి మాత్రలే పార్థసారథిని బ్రతికించాయని స్నేహితులయిన కొందరు వైద్యుల దగ్గిర నొక్కివక్కాణించాడు. అంతేకాదు. నిజానికది మలేరియా జ్వరమేకాని టైఫాయడ్ కానేకాదని తన దృఢ నిర్ణయం వెల్లడించాడు. దానికి అజ్ఞాతంగా లోలోపల అణగిమణిగి ఉన్న మానసికవ్యధ ఏదోగట్టి కారణంగా పరిణమించినదని కూడా వాదించాడు. ఆ పైన పరిసరాల పరిశుభ్రత విషయమై తీసుకున్న జాగ్రత్తవల్ల, సాధ్యమయినంత వరకు రోగి నెల్లప్పుడు ఉల్లాసంగా ఉంచడంవల్ల కూడా ఆ గడు జ్వరం తేలికగా దారికి వచ్చిందని నిర్ణయించి తన ప్రత్యేక రోగ సిద్ధాంతం సమర్థించుకున్నాడు. కాని డాక్టర్లు ఎవరూ ఆ ధోరణి అంతగా పట్టించుకోలేదు. విసీ విననట్టు మాట్లాడ కూరుకుని లోలోపల నవ్వుకున్నారు!

పార్థసారథికి రెండు మూడు పథ్యాలు ఒంటపట్టిన తరువాత అత్త మామలిద్దరు తిరిగి ఇంటికి వెళ్ళిపోతూ, ఇంకా కొన్నాళ్ళదాకా ఆరోగ్య విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలని అతనిని హెచ్చరించారు. ఆనాటి మధ్యాహ్నం వెంకటనారాయణ, చిట్టెమ్మ, వెంకయ్య, పూర్ణ అతనిని చూడడానికివచ్చి అంత జబ్బుచేసి విమ్మళించడం గొప్ప అదృష్టమని అతనిని అభినందించారు. వారందరికి అంతకుమునుపే సరోజ, రాఘవ మద్రాసులో సినిమాలో చేరి పోయిన సంగతి తెలిసింది. ఆపైన ఇటీవల రంగనాయకి, తన మేడ అంతా అద్దెకిచ్చివేసి చిన్న కుమార్తె సరస్వతితో కలిసి సరోజ దగ్గరికి వెళ్ళిపోయిన విషయంకూడా విన్నారు. ఆదే వార్త, మాటల సందర్భంలో పార్థసారథికి తెలియజేశారు. అతడది వినీవిననట్టు మాట్లాడ కూరుకున్నాడు.

ఆ నటీనటు లెవరికీ మద్రాసులో జరిగిన సంఘటనవలన వివరాలేవీ తెలియలేదు. అందుచేత సరోజ రాఘవలెక్కడ ఉన్నా తమ మండలి నాటకాలలో తప్పక పాల్గొనగలరని ఆశించారు. అదే అభిప్రాయంతో ఏలూరులో కృష్ణ తులాభారానికి రెండు సార్లు పెద్ద అడంకులు వచ్చినా నిరుత్సాహపడక తిరిగి ఆ నాటకం ప్రదర్శించవలసినదని పార్థసారథిని ప్రోత్సహించారు. ఈ సారి ఏలూరులోనాటకం నిర్విఘ్నంగా నెరవేరడమేకాక తప్పక గొప్పగా రక్తి కట్టగలదని ధైర్యం చెప్పారు. అయితే ఈలోగా ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవలసినదని హెచ్చరించారు. నాటక ప్రదర్శనం మాట తలపెట్టగానే పార్థసారథి హృదయం తిరిగి కొంగ్రొత్త ఉత్సాహంతో గుబగుబలాడింది. అయితే వారికతడు ఔననికాని కాదని కాని సమాధానం చెప్పలేదు. రవంత సేపాలోచించాడు. "నాకు బాగా ఆరోగ్యం కలిగిన తరవాత ఆలోచిద్దాం". అని కొంత ముభావంతో సమాధానం చెప్పాడు. ఆ పైన వెంకటనారాయణ మేష్టారు ఏదో లోకాభిరామాయణం మొదలు పెట్టి రెండు మూడు ఛలోక్తులు విసిరి కలకల నవ్వించి సెలవు తీసుకుని ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవలసినదని తిరిగి హెచ్చరించి తన ఇంటికి బయలుదేరాడు. మిగిలిన నటీనటులందరు ఆదే విధంగా అతని దగ్గర సెలవు తీసుకుని తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. కృష్ణమూర్తి పార్థసారథి పక్కన కూర్చుని ఆ సంభాషణ అంతా ఆమూలాగ్రంగా విన్నాడు అంత గొడవ జరిగినా అతనికింకా నాటకాలమీద మమకారం లొంగిపోలేదని పసికట్టాడు. అయితే ఆ భావం రవంతయినా పైకి వ్యక్తం కానీయలేదు.

"అన్నట్టు నీతో చెబుదామనుకుని పనుల తొందరలో పడి పరాకుపడ్డాను. రాఘవ నా పేరున ఉత్తరం వ్రాశాడు తెలుసునా! ఇదిగో! ఆ ఉత్తరం చదువుకో!"

ఆ కార్డు అతని చేతికిచ్చాడు.

దానిలో రాఘవ వెంటనే సమాధానం వ్రాయలేకపోయి నందుకు ఏమి అనుకోవద్దని, పార్థసారథికంతటి పెద్ద జబ్బు చేసి సందులకెంతో నొచ్చుకున్నాడు. ఎంతగా బయలుదేరివద్దామనుకున్నా "బంగారు నౌక" ప్రారంభించడం మూలాన బొత్తిగా కాలు కదప డానికి వీలుపడలేదనీ, మన్నించవలసినదనీ వేడుకున్నాడు. వెను వెంటనే తిరుగు టపాలో పార్థసారథి పరిస్థితి తెలియజేయ వలసినదని ప్రార్థించాడు. పాపం సరోజకూడా సినిమా ప్రారంభించడంవల్లనే రాలేకపోయినదని ఆమె అశక్తత సమర్థించాడు. అందుచేత ఆమె ఏమీ అనుకోవద్దనీ, విజయలక్ష్మితో మరీ మరీ చెప్పవలసినదనీ వేడుకొన్నదనీ వ్రాసి, ఆ తర్వాత వేరొక విషయం ఎత్తుకోకుండా చాలా ముక్తసరిగా ముగించివేశాడు.

కొన్నాళ్ళ క్రితం భార్య ఎలాగయినా ఒక్క సారి రావలసినదని సరోజ పేర ఒక ఉత్తరం వ్రాసినదని కృష్ణమూర్తి చెప్పినట్టు పార్థసారథికి తటాలున జ్ఞప్తికి వచ్చింది. దానితోబాటు ఆమెనెలాగయినా ఒక్కసారి పంపించవలసినదని అతడు రాఘవ పేర ఉత్తరం వ్రాసినట్టు చెప్పినసంగతికూడా పార్థసారథికి ఆదేక్షణంలో గుర్తుకు వచ్చింది. ఆ రెండు లేఖలకు సమాధానంగా ఇన్నాళ్ళు గడిచిన తరువాత అతి కష్టంమీద అంటీ అంటనట్టు ఒక కార్డు ముక్క ఊడిపడినదన్నమాట! విజయలక్ష్మి ఎంతో కంగారు పడుతూ వ్రాసిన ఉత్తరం చూసుకున్న వెంటనే సరోజ బయలు దేరలేదు సరికదా, త్వరగా ప్రతి సమాధానం రాయాలనికూడా అనుకోలేదు. ఆమెకే ఆ విధంగ ఉపేక్ష కలిగినప్పుడు ఇక రాఘవ మొక్కుబడి తీర్చుకోవడంకోసం ముక్తసరిగా నాలుగు ముక్కలు గీసి పారవెయ్యడంలో ఆశ్చర్యం ఏమి ఉంది?

సరోజా రాఘవల దగ్గరనించి పార్థసారథి అంతగా ఆశించ లేదు. కాని తనకలాగ ప్రాణం మీదికి వచ్చినప్పుడు చిరకాల స్నేహాన్నిబట్టి, వారిద్దరు ఒక్కసారివచ్చి చూసి వెళ్ళడం న్యాయ మని ఎవరికయినా అనిపించి తీరుతుందని అతనికి తోచింది. సరోజ వెంటనే బయలుదేరి రాలేదు సరికదా, పోనీ మర్యాద కోసం భార్య పేర తిరుగు టపాలోచిన్న ఉత్తరంకూడా రాయలేదు! ఆ సంగతి రాఘవ. సరోజ కూడ బలుకుకున్నారు! అతడు ఒక కార్డుమీద నాలుగు పంక్తులుగీకి పారవేశాడు! పోనీ అనుకుంటే అది కూడా బాగా ఆలస్యంగారాశాడు! దానినిబట్టి అతనికి తనయెడల వారిద్దరి పైఖరి విస్పష్టంగా బోధపడిపోయింది. ఇక తానేమయి పోయినా వారిద్దరికి ఏమాత్రము పట్టదన్నమాట! అందులోను సరోజకిక తనగోడు అసలే అక్కరలేదన్నమాట! వారిద్దరు కలిసి తనతో సంబంధం పూర్తిగా తుదముట్టించి వేసుకోవాలని అనుకుంటున్నా రన్నమాట! ఎంతలో ఎలాంటి మనుష్యు లెలాగ మారిపోయారు!

అయితే ఇటీవల రుగ్మత వల్ల కలిగిన ఆకస్మిక మానసిక పరిణామంతో అతనికి సరోజ రాఘవ యెడలగాని, వెంకట కృష్ణయ్య యెడలగాని, అసూయాద్వేషా లేమాత్రము కలగలేదు! పోనీ ఆ నూతన జీవితంలో నయినా వారందరు పేరుప్రతిష్ఠలతో, భోగభాగ్యాలతో సుఖంగా ఉంటే తన కంతకన్న కావలిసినదేమి లేదని అనుకున్నాడు. అయితే సరోజ, ఇక మేనమామకయినా కొంతకాలం పాటయినా మాట దక్కించగలదా? అని అతని మనస్సులో ఒక అనుమానం మొలకెత్తకపోలేదు! కాని అంతలోనే ఏది ఏమయితేనేం? ఆ గొడవలన్ని నాకెందుకు? వాళ్ళ కష్టసుఖా లేమో వాళ్ళనుభవిస్తారు? నేనెందుకు మరోలా అనుకోవాలి? అని సమాధానపడి ఆ వ్యవహారం అంతటితో పూర్తిగా తుంచి వేసుకోవాలని అనుకొన్నాడు. ఏదో మర్యాదకోసమని తాను బాగా ఆరోగ్యంగా ఉన్నట్టు ఒక ఉత్తరం రాసి వెంటనే పోస్టులో వెయ్యవలసినదని కృష్ణమూర్తితో చెప్పాడు, అంతే అటుపిమ్మట వారెవ్వరిమాట అతడెన్నడూ తలపెట్టదలుచుకోలేదు!

ఆ మరునాడు పొద్దున్న పార్థసారథి కాఫీ పుచ్చుకుని కృష్ణమూర్తితో పిచ్చాపాటీ మాట్లాడుతూ అలవాటు ప్రకారం దిన పత్రిక తిరగవేస్తూంటే పోస్టుమన్ పార్థసారథి కొక కవరు ఇచ్చి వెళ్ళిపోయాడు. అతడది చించి చదవడం మొదలుపెట్టాడు. అది గుప్త రాసిన ఉత్తరం.

'మహారాజశ్రీ పార్థసారథిగారికి: గుప్త అనేకనమస్కారాలు ఉభయకుశలోపరి మీ కిటీవల చాలాజబ్బుచేసినట్లు విని చాలా బాధ పడ్డాను. మీ అభిమానులందరు ఎంతో కంగారుపడ్డారు అయితే దైవకృపవల్ల మీకిప్పుడు కొంచెం నింపాదిగా ఉన్న సంగతి నిన్ననే నాకు తెలిసింది. మేమందరము చాలా ఆనందించాము.

'మ.రా.రా. శ్రీ రాఘవగారు మద్రాసునుంచి పంపించిన టెలిగ్రాం నాకు సరీగా సమయానికే అందింది. అందుచేత పెద్దగా ఇబ్బందులేవి పడలేదు నాటకం టిక్కెట్లు తీసుకున్నచాలా మందికి సొమ్ము తిరిగి వాపసు ఇవ్వవలసివచ్చింది! మిగిలిన ఖర్చులతో కలిపి మొత్తంమీద నాకు పదిహేను వందలకన్న ఎక్కువ చేతికి తగలలేదు.

'అయితే దీని విషయం మరిప్పుడు ఏ మాత్రము తలపెట్ట నక్కరలేదు. ఇంకొకసారి మీరెప్పుడయినా ఇక్కడ కృష్ణతులా భారంవేస్తే దాని కంట్రాక్టుఖర్చులతో ఈమొత్తం ఎలాగో అలాగ సరిపెట్టుకోవచ్చును! పోనీ ఆ విధంగా నయినా తిరిగి మీ నాటకం చూసే అదృష్టం కలగగలదన్న ఆశతో నేనిలాగ రాస్తున్నాను. వరసగా రెండుసార్లు ఆశాభంగంకలిగిందే అని ఇక్కడ మీ అభి మానులందరు ఎంతోబాధపడ్డారు. ఇక నా సంగతి వేరుగా వ్రాయ వలసిన అవసరంలేదని అనుకొంటున్నాను. ఇక ముమ్ముందయినా మా కందరికి మీ కృష్ణ తులాభారం కళ్ళారచూసి ఆనందించే అదృష్టం కలగగలదని ఎంతో ఉవ్విళ్ళూరిపోతున్నాము.

'ఒకవేళ ప్రస్తుతానికి మీ ఆరోగ్యం అంతగా తిన్నబడక పోతే మీకువీలు కలిగినప్పుడు ఎప్పుడయినా నాటకంవెయ్యవచ్చును, తొందరలేదు. సావకాశంగా ఆలోచించి సమాధానం వ్రాయించ ప్రార్థన. నాటకం టిక్కెట్ల సొమ్ముావాపసు తొందరలోపడి వెంటనే మీకు ఉత్తరం రాయలేక పోయినందుకు మన్నించ గోరుతున్నాను. మీ ఆరోగ్యం బాగా కుదుట బడిన సంగతి తిరుగుటపాలో తెలియజేయించ ప్రార్థన.

భవదీయుడు

"గుప్త"

(సశేషం)

# గ్రంథ సమీక్ష

## పసిడి బొమ్మ

రచయిత : శ్రీ నెల్లూరి కేశవస్వామి.
వెల : రెండు రూపాయలు. సాధనసమితి 57/4 ఆర్. టి. బర్కత్‌పూర, హైదరాబాదు. 27కు కానీ, పోతుకూచి ఏజెన్సీస్, 208 న్యూ బోయిగూడ, సికింద్రాబాదుకు కానీ వ్రాసి ప్రతులు పొందవచ్చు.

ఈ సంకలనంలో ఏడు కథలూ, ఏడు కల్పిక (చిన్నకథ) లూ వున్నాయి. ఇవన్నీ యిదివరలో వివిధ పత్రికలలో ప్రచురితమైనవే. శ్రీ కేశవస్వామిగారు నాటక రచనలోవలెనే కథా రచనలో కూడా ఆరితేరిన వారన్న విషయాన్ని సంకలనం నిరూపిస్తుంది.

పుస్తకం శీర్షిక నలంకరించిన కథానికకు నిజంగానే ఆ అర్హతవుంది. "పసిడి బొమ్మ"రాధ సమాజంలోని ఒక తరహా స్త్రీలకు ప్రాతినిథ్యం వహిస్తుంది.

తాను టూరుకు వెళ్లిన గ్రామంలో తనకు కావలసిన "పదార్థం" దొరక్క తన అవసరాన్ని గురించి అధికారికి చెప్పి "తపన" తీర్చుకునే ధైర్యం చాలక నానా ఇబ్బందులు పడ్డ "పానకాల రాయుడై"న ఒక గుమాస్తా ఉపాఖ్యానాన్ని రచయిత "పరీక్ష"లో చమత్కారంగా చిత్రించారు.

"అక్కయ్య పెళ్లి"లో ఉత్కంఠ చక్కగా పోషించబడింది. పాఠకుడు ఊహించడానికైనా వీలులేని విధంగా కథ ముగిసి అక్కయ్య ప్రవర్తనకు జాలి కలుగుతుంది.

తిట్టేనోరు, తినేనోరు, తిరిగేకాలు ఊరుకోనట్లే "లిటిగెంట్" అయిన ప్రజానాయకుడు కూడా "లిటిగేషన్ల"ను సృష్టించకుండా ఊరుకోలేడన్న వాస్తవాన్ని "అలవాటు"లో నిరూపించారు.

ఆతిథ్యం యివ్వడాన్ని భారంగా ఎంచిన నగర గృహస్థు డొకాయన తన యింటికి వచ్చిన అతిథికి ఉద్వాసన చెప్పడం కొరకు పడినపాట్లు "అతిథి"లో హాస్యపూరితంగా చిత్రించబడినవి.

అవకాశాల కొరకు అర్రులు చాస్తున్న స్థితినుండి దిగజారే ప్రబుద్ధులపై సెటైర్–"ఛోటాలీడర్". "నిట్టూర్పు", "అభిమానం" "ప్రజ, ఉద్యోగి, మంత్రి" "పాఃపొంగు", ప్ర"తిష్ఠా పరుడు", "రాజర్షి!", "రాజును గురించిన కథ" ఇందులోని యితర కథలు, కల్పికలు.

"పసిడి బొమ్మ"కు తిలకందిద్దారు శ్రీపోతుకూచిసాంబశివరావు.

## జానకీపతి శతకము

రచయిత : విద్వాన్‌ధూళిపాళ సీతారామశాస్త్రి, బి.ఓ.ఎల్., ప్రధానాంధ్రోపాధ్యాయులు, వివేక వర్ధినీ బహుళార్థ సాధకోన్నత పాఠశాల, హైదరాబాదు. వెల 75 పైసలు.

తెలుగు సారస్వతంలో శతక వాఙ్మయానికి ప్రత్యేకి స్థానం వుంది. జానకీపతి శతకంలో సంప్రదాయికమైన లౌ నీతులు, విమర్శలు, దశావతార సంస్తుతులతోపాటు గ్రంథకర్తగారి అనుభవాలు ఆదర్శాలు కనిపిస్తాయి.

ఇందులోని పద్యాలు మృదుమధుర శైలినీ, ధారాశుద్ధినీ కలిగివున్నాయి.

ఆచార్య దివాకర్ల వేంకటావధాని, కేశవపంతుల నరసింహశాస్త్రి, అనుపూరు నాగభూషణరావు మొదలైన పండితులు తమ అభిప్రాయాలనిచ్చారు.

## గ్రామ వెలుగు నాట్యమండలి ప్రత్యేక సంచిక

రేపాలగ్రామ వెలుగు నాట్యమండలివారు పుష్కరోత్సవ సందర్భంగా ఆకర్షణీయమైన ప్రత్యేక సంచిక వెలువరించారు.

నల్గొండ జిల్లా, హుజూర్‌నగర్ తాలూకా, రేపాలగ్రామంలో సుమారు రెండు పుష్కరాల క్రితం యువకులచే యీసంస్థ స్థాపించబడింది. అయితే ఈ సంస్థ గత పన్నెండు సంవత్సరాల నుంచి మాత్రం ఒక క్రమపద్ధతిలో నాటక, వైజ్ఞానిక కార్యక్రమాలనునిర్వహిస్తున్నది. క్రమబద్ధమైన కృషివి, "స్వయంశక్తి"తో పన్నెండు సంవత్సరాలు సాగించిన పిమ్మట తమను గురించి తెలుసుకొనగోరే వారి సమాచారార్థం, ఈ సంస్థవారు ఈ ప్రత్యేక సంచికను వెలువరించారు. ఆకర్షణీయమైన ముఖచిత్రంతో 102 పేజీలతో కూడిన ఈ సంచికలో కోదాటి నారాయణరావుగారు వ్రాసిన "రేపాల: స్వామివారి ఉత్సవాలు", "రేపాలలో నాటకోద్యమము" అనే వ్యాసాలు, శ్రీ కె. ఎల్. నరసింహారావుగారు రచించిన "గ్రామ వెలుగు నాట్యమండలి" అనే వ్యాసం ప్రత్యేక ఆకర్షణలుగా వున్నాయి.

—"జనా"

## ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతులు

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ 1969 సంవత్సరానికి వివిధ సాహిత్య ప్రక్రియలకు బహుమతులను ప్రకటించింది.
ఉత్తమ సృజనాత్మక రచనలకు ఏటా యీ బహుమతులను యిస్తారు.

కవిత : స్వర్గీయ దేవరకొండ బాలగంగాధర తిలక్ ("అమృతం కురిసిన రాత్రి")

నవల : శ్రీ శీలా వీర్రాజు ("మైనా")

కథలు : శ్రీ అవసరాల రామకృష్ణారావు ("అర్థమున్న కథలు")

సాహిత్య విమర్శ : శ్రీపింగళి లక్ష్మీకాంతం ("సాహిత్యశిల్ప సమీక్ష")



# తిరస్కృతి

—వాసిరెడ్డి సీతాదేవి

## జరిగిన కథ

మేనమామ కూతురు సరళ తనను పెళ్ళి చేసుకోనన్నదని సత్యం ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు చిన్ననాటి గురువుగారయిన కేశవరా. గారి ప్రోత్సాహంతో శాంతినికేతనంలో చిత్రకళ అభ్యసించాడు. ఒకరోజున సత్యం చిత్రకళా ప్రదర్శనకు కేశవరావు గారూ, వాళ్ళమ్మాయి విమలా వచ్చారు. ఆ చిత్రకారుడు తమ సత్యమే అని తెలుసుకుని అతన్ని కలుసుకున్నారు శాంతినికేతన్ విషయాలు, స్వవిషయాలు తెలియజేశాడు సత్యం. సత్యం మిత్రుడు మాధవరావుతో విమలకు పరిచయం ఏర్పడింది. ఒకరోజు కారులో వాళ్ళిద్దరూ షికారుకు బయలుదేరారు

మాధవరావు మౌనం ఏ నిమిషంలోనైనా ఆటంబాంబులా పేలిపో వచ్చు!

ఆకాశంలో వాతావరణం పురిపెట్టిన సులకతాడులా వుంది.

విమల భయంభయంగానే మాధవరావు వైపు చూసింది. అతని నొసలు ముడతలు పడింది. రెండు కనుబొమలు వంకర్లు తిరిగి విల్లంబుల్లా వున్నాయి. కింద పెదవిని మునిపళ్ళ నొక్కుతూ వుండే సూదిలా వుండే ఆ గడ్డం మరీ పొడవనిపిస్తూ వుంది. అతను కారు నడుపుతున్నాడు. కాని అతని ధ్యాసంతా మరేదో విషయం మీద వుందన్ని తెలుస్తూనేవుంది.

"ఏమిటి అంతగా ఆలోచిస్తున్నారు?" నాలుకవరకు వచ్చిన మాటల్ని మింగేసింది.

దానికి రాబోయే సమాధానం ఏమయివుంటుందోననే భయంతో ఆమె కంఠంలోనుంచి మాటలు పెగలటం లేదు.

ఏం జరిగిందో తెలుసుకొనే లోపల విమల మాధవరావు మీదకు పడిపోయి గబుక్కున సర్దుకొని కూర్చుంది.

కారు తమాషాగా అరిచి, ముందుకూ వెనక్కూ ఊపేసింది. సడన్ బ్రేక్ పడిందన్ని తెలుసుకొని రోడ్డుమీదకు చూసింది విమల.

కారుకు అడ్డంవచ్చినవాడు మాధవరావుకేసి కొరకొరాచూస్తూ సణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

అదే మరోసారయితే మాధవరావు ఆ సన్నివేశాన్ని అంత తేలిగ్గా పోనిచ్చేవాడుకాదు. అలాంటి పరిస్థితుల్లో రెండుమూడు సార్లు మాధవరావు అనడం విన్నది.

"ఏం బాబూ ఇంటిదగ్గర చెప్పేవచ్చావా?"

"జీవిత భీమా చేయించేవస్తున్నావా ఏమిటి?"

"నాకు లైసెన్స్ ఇచ్చినవాడి విజాయితీని పరీక్షిస్తున్నావా?"

మొదలైన మాటలతో కారులో వున్నవాళ్లను కడుపుబ్బ నవ్వించేవాడు.

కాని ఇవ్వాళ మాధవరావు ముఖానికి పట్టిన చెమటను రుమాలుతో తుడుచుకొని మళ్లీ కారు స్టార్టు చేశాడు.

"ఏమయింది?" వాతావరణాన్ని తేలికపర్చే ఉద్దేశంతోవచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోకుండా ప్రశ్నించింది విమల.

"ఏంకాలేదు. అడం వచ్చింది మనిషి కనుక! అదే ఏచెట్టో, గుట్టో అయితే తప్పక ఏదో అయివుండేది." అన్నాడు మాధవరావు' అతని కంఠం చాలా బరువుగా, గంభీరంగా వుంది.

విమల ఆశ్చర్యంగా మాధవరావు ముఖంలోకి చూసింది' అతని మాటలు ఆమెకు అర్థం అయీ కాకుండా అర్థం అయాయి'

మళ్లీ అతనే అన్నాడు కారు వేగాన్ని హెచ్చిస్తూ "ఏ చెట్టో అడ్డంవస్తే బ్రేక్‌వేసే వాణ్ణికాదు. యాక్సిడెంట్ అయేది.

విమల అతని ముఖంలోకి తెల్లబోయి చూసింది.

"నాలాంటి వాడికి అలాంటి అదృష్టంకూడానా?

మాధవరావు మాటలకు విమల ఉలిక్కిపడింది.

మాధవరావు అంతగా బాధ పడుతున్నాడా? ఎప్పుడూ తను నవ్వుతూ నలుగుర్నీ నవ్వించే ఇతని గుండెల్లో ఇంత ఆవేదన వుందా? అతనికి తక్కువేమిటి?

అయినా యాక్సిడెంట్‌లో చచ్చిపోవటం అదృష్టమా! అతనికి జీవితం మీద ఇంత విరక్తి కలగటానికి కారణం?

'ఏమిటా అదృష్టం?' అని అడగాలనిపించింది?

'ఎందుకింత విరక్తి!' అంటూ ఆదరించాలనిపించింది. కాని

"తను ప్రేమిస్తున్న యువతి పక్కన వుండగా యాక్సిడెం టయి ఇద్దరూ చచ్చిపోవటం అదృష్టంకాదూ?"

"తను ప్రేమిస్తున్న యువతి తనను ప్రేమించడంలేదని తెలుసుకొన్న దౌర్భాగ్యుడు యాక్సిడెంటులో ఇరుక్కుని తాను చచ్చిపోయి ఆమె బ్రతికితే? ఆమె అతని తలను తన ఒడిలో పెట్టుకొని బాధపడితే? అంతవరకూ వజ్రసమానంగా వున్న ఆమె గుండెలు కరిగి తనమీద ప్రేమవర్షం కురిపిస్తే! అంతకంటే మంచి చావు మరొకటి ఏముంటుంది?

"నా విరక్తికి కారణం నువ్వే.. నువ్వే"

ఇలాంటి సమాధానాలువస్తే మాధవరావు నుంచి? తను ఏం జవాబివ్వగలదు? ఎక్కడకు పారిపోగలదు? ఎలా అతని గాయాన్ని నిమిరి బాధను ఉపశమింపచేయగలదు?

అందుకే ఆమె ఏమీ ప్రశ్నించలేదు. మౌనంగా తనలోకి తనే ముంచింపుకుపోతూ కూర్చుంది.

కారు అనుకోకుండా జనసంచారం తక్కువగావున్న రోడ్డు పక్కగా ఆగింది. విమల బహుశా కారుకేదయినా ట్రబుల్ వచ్చిందేమో అనుకుంది. ఆమె ఊహించినట్లు మాధవరావు కారు దిగలేదు. పాంటుజేబులో చెయ్యిపెట్టి సిగరెట్‌పాకెట్ తీసి, అందులోనుంచి సిగరెట్ తీసుకొని మళ్లీ పాకెట్ జేబులో పెట్టుకున్నాడు. అగ్గిపెట్టెతీసి సిగరెట్ వెలిగించాడు. మళ్లీ అగ్గిపెట్టెను జేబులో పెట్టుకున్నాడు.

అతను ఈ పనులన్నీ యాంత్రికంగా చేస్తున్నాడు. అతను ఏదో మాట్లాడాలనే ప్రయత్నంలో వున్నట్లు తోచింది విమలకు. కాని ఆమె అనుకున్నట్లు అతను ఏమీ మాట్లాడలేదు.

రెండు నిముషాలు సిగరెట్టుదమ్ము గట్టిగా పీల్చి వదులుతూ విమల ముఖంలోకి దీక్షగా చూశాడు. విమల ఇబ్బందిగా కదిలి, కారు అద్దంలోనుంచి బయట దేన్నో పరిశీలించి చూస్తున్నట్లు నటిస్తూ కూర్చుంది.

మాధవరావు ఆమె భయపడినట్లు ఏమీ మాట్లాడలేదు.

విమల తేలిగ్గా గుండెలనిండా గాలి పీల్చుకుంది.

"ఇదెప్పటినుంచి?" అంది విమల తనవైపుకువస్తున్న పొగను చేత్తో వాదించటానికి ప్రయత్నిస్తూ.

"ఏది?" పరధ్యానంగా అడిగాడు మాధవరావు.

"సిగరెట్ తాగటం?"

"నిన్ను చూసినప్పటి నుంచి?"

విమల తెల్లమొహం వేసింది.

"నిజం విమలా! నిన్నుచూసిన రాత్రే నేను మొదటి సిగరెట్ తాగాను. ఆ తర్వాత నుంచి తాగుతూనేవున్నాను. అయితే అమ్మముందు మాత్రం తాగను." అన్నాడు మాధవరావు.

విమల ఎలాంటి విషయం నుంచి తప్పించుకోవాలని ప్రయత్నిస్తూ వచ్చిందో అదే విషయంలోకి ఆమె ప్రశ్నలాక్కువెళ్ళింది. విమల వివిపించుకోనట్లు ఊరుకుంది.

ఇవ్వాళ ఈ మాధవరావుకు ఏమయింది? ఎందుకిలా మాట్లాడుతున్నాడు?

"మనం ఎక్కడకు వెళుతున్నాం?" దాదాపు అరిచిన అంది, కారు ఇంటివైపుకు కాకుండా ఏదో కొత్తమార్గంలో వెళ్తున్నట్లు గమనించిన విమల.

అంతవరకూ మౌనంగా వున్న మాధవరావు పక్కున నవ్వాడు.

"మొత్తానికి అదరి అనిపించావు? ఎక్కడకైనా రావణాసురుడిలా నిన్ను ఎత్తుకుపోతానని భయంవేస్తుందా?" అన్నాడు మాధవరావు అదోలా నవ్వుతూ.

ఆ నవ్వులో "నామీద నీకున్న నమ్మకం ఇదేనా?" అన్న భావం స్పష్టంగా గోచరించి విమల సిగ్గుపడిపోయింది.

"అబ్బే అదికాదు. కొత్తదారిలో పోతున్నట్టుంటేను?" సర్దుకుంది విమల.

"నిన్ను అవమానించేపాటి పొరపాటు పనులు నేనేమి చెయ్యను, భయపడకు. మనం సికిందరాబాద్ తాజ్‌కు వెళుతున్నాం. తలనొప్పిగా వుంది. కాస్త కాఫీతాగి వెళదాం!" అన్నాడు మాధవరావు. ఈసారి మాధవరావు కంఠంలో గాంభీర్యంకంటే వేదన ఎక్కువగా ధ్వనించింది.

తను అతన్ని అనుమానించినందుకు బాధపడుతున్నాడని గ్రహించింది విమల. తను చాలా నీచంగా ప్రవర్తించావని బాధపడసాగింది

తాజ్‌లో ఫామిలీరూంలో జనం అంతగాలేరు.

మాధవరావు ఓ మూలగా వున్న టిల్లకేసి నడిచాడు. విమల మౌనంగా అనుసరించింది.

విమల ఏమీ తిననంది. రెండు కాఫీలకు ఆర్డరు ఇచ్చాడు మాధవరావు.

మాధవరావు విమల ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు.

ఇది గమనించిన విమలకు ఇబ్బందిగావుంది.

గోడలకు తగిలించిన ఫొటోలకేసి చూడసాగింది.

"విమలా!"

మాధవరావు కంఠం వింతగా పలికింది. అది మామూలు పిలుపుకాదు. యుగయుగాలుగా పురుషుడు స్త్రీని పిలుస్తున్న పిలుపు.

విమలలో ఆ పిలుపును తిరస్కరించే శక్తి లేదు. విమలే కాదు ఏ స్త్రీ కూడా ఆ పిలుపుకు ఉదాసీనంగా వుండిపోలేదేమో!

విమల కళ్లెత్తి మాధవరావు కళ్లలోకి చూసింది.

ఆ కళ్లలో ఎంత ఆరాధన! ఆ కంఠంలో ఎంత ఆత్మీయత? ఆ ముఖంలో ఎంత అమాయకత్వం!

సందేహంలేదు! తను ఇంతకాలంగా ఏది నిజం కాకూడదనుకుంటూ వచ్చిందో అదే నిజం అయింది!

మాధవరావు తనను ప్రేమిస్తున్నాడు! అమితంగా ఆరాధిస్తున్నాడు!

తనకు మాధవ రావంటే ఇష్టమే: ఆ ఇష్టంలో ఆత్మీయత వుంది. కాని ఆరాధనలేదు.

సత్యం అంటే తనకు ఇష్టం! ఆ ఇష్టంలో ఆరాధన వుంది.

సత్యం ఉదాసీనత తనను అమితంగా బాధిస్తుంది.

మాధవరావు ఆరాధన తనను భయపెడుతుంది. ఏమిటి ఈ విచిత్రం? మానవ స్వభావమే అంతా?

"కాఫీ తీసుకో విమలా!" మాధవరావు స్వరం విని విమల ఆలోచనలనుంచి బయటపడింది. కాఫీకప్పు చేతిలోకి తీసుకొన్నది.

"ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" ఆత్రంగా ప్రశ్నించాడు మాధవరావు.

"మీ గురించే!" అనుకోకుండా అనేసి నాలుక కరచుకొంది. విమల.

"నా గురించా? అదృష్టవంతుణ్ణి!" అన్నాడు మాధవరావు మాధవరావు కళ్లలో కాంతి రేఖలు కదిలాయి. అది గమనించిన విమల మనస్సు చిరాకు పడింది. తను అనవసరంగా అతనికి ఆశలు కల్పించడం లేదుకదా?

"విమలా! ఇవ్వాళ నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలని వచ్చాను అందుకే ఇక్కడకు తీసుకొచ్చాను. ఆ విషయం ఎలా ప్రారంభించాలో తెలియక తికమక పడుతున్నాను. దానికి నీ సమాధానం ఎలా వస్తుందోననిమరో వైపు భయపడుతున్నాను"

విమల బెదిరిపోయినట్లు చూసింది. ఆక్షణం గురిపెట్టిన తుపాకిలా పేలటానికి సిద్ధంగా వున్నట్లు చెదిరిపోయింది విమల.

మధవరావు నిజంగా ఈ క్షణంలోనే తన ప్రేమను వెల్లడిస్తే?

విమలకు నాలుగు సంవత్సరాల క్రితం జరిగిన సంఘటన జ్ఞాపకం వచ్చి నిలువెల్లా వణికిపోయింది.

విమల కొత్తగా కాలేజి ఉద్యోగంలో చేరిన రోజులు అవి. రామారావనే లెక్చెరర్ ఆమె అంటే అమితమైన అభిమానం చూపించేవాడు.

రామారావు చాలా మంచివాడని పేరు వుండేది. ఆ కాలేజీలో. విద్యార్థుల దగ్గర అతనికి వున్న పలుకుబడి మరెవరికీ ఉండేది కాదు. చాలా తెలివైన వాడు.

విమలకు అతను చూపించే అభిమానంలో ప్రత్యేకత ఏమీ కనిపించేది కాదు. అసలు ఆమె పెద్దగా ఆవిషయం గురించి ఆలోచించేది కూడా కాదు.

ఆరు నెలల పరిచయంలోనే ఒక రోజు రామారావు విమలను కాఫీకి ఆహ్వానించాడు. కాలేజీ అయాక ఇద్దరూ హోటల్‌కు వెళ్ళారు. రానంటే అతను బాధపడుతాడని ఇష్టంలేకపోయినా విమల అతనితో వెళ్ళింది.

హోటల్‌కు వెళ్ళి ఒక మూలగా వున్న బల్ల దగ్గర కూర్చున్నారు. రామారావు ఏదో మాట్లాట్టానికి సంకోచిస్తు నట్లు విమల గ్రహించింది.

"విమలా!"

రామారావు కంఠంలో కొత్తదనానికీ, మార్దవానికీ విమల విస్తుపోయి చూసింది. అతను ఆమెను ఏకవచనంతో పిలవటం కూడా అదే మొదలు.

"ఒక విషయం చెప్పాలను కుంటున్నాను. ఏమీ అనుకోవు కదూ?"

విమలకు అర్థంకాలేదు. ఏదో మామూలు విషయం అయివుంటుందనుకుంది.

"అడగండి"

"నీనుంచి సూటి జవాబు కావాలి?"

"అలాగే చెబుతాను"

"నువ్వు అంటున్నందుకు క్షమించు. నాకంటే చాలా చిన్నదానివి. నిన్ను మీరు అనడంవల్ల నాకు నువ్వు చాలా దూరంలో వున్నట్లుఅనిపిస్తుంది. నేను చెప్పదలచుకొన్నది. చెప్పలేక పోవచ్చును. అందుకే ముందు నిన్ను నువ్వు అంటున్నాను." అన్నాడు రామారావు.

"పర్వాలేదు నువ్వు అనే అనండి! మీ కంటే నేను చాలా చిన్నదాన్ని అయినా మిమ్మల్ని మా సన్నిహితుడిగానే భావించుకుంటున్నాం నేనూ, నాన్న గారూనూ" అంది విమల.

"విమలా!" రామారావు కంఠం కొంచెంగా వణికింది. విమల ఆశ్చర్యంగా అతని ముఖంలోకి చూసింది.

"విమలా నువ్వంటే నాకు ఇష్టం: నిన్ను వివాహం చేసుకోవాలను కుంటున్నాను. నీకు ఇష్టమేనా?"

సూటిగా వచ్చిన మాటలు విమలకు గట్టిగానే తగిలాయి. బిత్తరపోయింది. ఎలాగో అనిపించింది. అక్కడనుంచి పరుగెత్తు కెళ్ళాలనిపించింది.

అప్రయత్నంగానే "లేదు. నాకు ఇష్టంలేదు" అంది.

ఆమె కంఠం ఆమెకే చాలా కటువుగా అన్పించింది.

రామారావు కొయ్యబారిపోయాడు విమల లేచి నిల్చుంది. చరచరా బయటకు నడిచి వెళ్ళిపోయింది. వెనుక అతను లేచి వచ్చాడో లేదో కూడా చూడలేదు.

ఆ రాత్రంతా జరిగిన దాన్ని మననం చేసుకొంది.

రామారావంటే జాలి వేసింది. తను కఠోరంగా ప్రవర్తించాలింది కాదను కొన్నది. రామరావు తనను అవమానించ లేదు, అభిమానించాడు. మంచివాడు, తెలివైనవాడు చాలా మర్యాదగా, సూటిగా తన మనస్సు విప్పి తన ముందువుంచాడు. దాన్ని తను తిరస్కారంతో నెట్టేసింది తన అయిష్టాన్ని మరో విధంగా చెప్పి వుండవచ్చును. ఆలోచించుకోవటానికి సమయం ఇవ్వమని చిన్నగా అతనికి తన అయిష్టాన్ని తెలిపి వుండాల్సింది!

ఆ రాత్రంతా పరిపరి విధాల మధన పడింది విమల. తెల్లవారి కాలేజీకి వెళ్ళాలనిపించ లేదు. రామారావు బాధపడే ముఖాన్ని చూట్టానికి ధైర్యం చాల లేదు. రెండోరోజు కాలేజీకి వెళ్ళింది.

రామారావు రాజీనామా ఇచ్చి వెళ్ళిపోయాడని తెలిసి తను భూమిలోకి కృంగి పోయింది. చాలా కాలం అతన్ని గురించిన బాధ ఆమెను వదల్లేదు.

"ఏమిటి విమలా అలా వున్నావు? వంట్లో బాగాలేదా?" అన్న మాధవరావు మాటలకు విమల గతంలోంచి జారి వర్తమానంలో పడింది. రామారావును తిరస్కరించినంత తేలిగ్గా మాధవరావును తిరస్కరించగలదా? మాధవరావు లాంటి వ్యక్తులు కొన్ని విషయాలను చాలా లోతుగా తీసుకుంటారు.

"నీకు ఇష్టం లేదా విమలా?"

"ఏమిటి?"

"అదే, నేను చెప్పాలనుకుంటున్న విషయం వినటం"

"నాకు చాలా తలనొప్పిగా వుంది? మరోసారి వింటాను." అంటూనే విమల లేచి నిల్చుంది.

మాధవరావు కూడా లేచి బిల్లుచెల్లించి వచ్చి స్టీరింగ్ దగ్గిర కూర్చున్నాడు.

ఈ సారి మధవరావు ముఖం గంభీరంగా లేదు. అలిగిన పసివాడి ముఖంలావుంది.

"అలా ముఖం పెట్టుకోకు మరోసారి వింటానుగా" అంటూ గోముగా లాలించాలని పించింది.

పురుషులు కొన్ని సందర్భాల్లో నిజంగానే పసిపిల్లలా అయి పోతారు అనుకుంది విమల.

కారు పోర్టికోలోకి వచ్చిందోలేదో సత్యం, రాజమణిదేవి, కేశవరావు వరండాలోకి వచ్చి నిల్చున్నారు.

"ఏరా ఇంత ఆలస్యం అయింది." దిగి డోర్ వేస్తున్న మాధవరావును ప్రశ్నించాడు సత్యం.

"సారీ! ఆలస్యం అయింది. ఇవాళ డ్రామా ప్రోగ్రాం గురించి మర్చిపోయాను." అన్నాడు మాధవరావు మామూలుగా వుండటానికి ప్రయత్నిస్తూ.

"మరి లోపలకు ఎందుకు? ఇప్పటికే ఆలస్యం అయింది!" అంది రాజమణిదేవి లోపలకు వెళుతున్న కొడుకును ఉద్దేశించి.

"నేను రాను! మీరు వెళ్ళండి. నాకు తలనొప్పిగా ఉంది!" అంటూ మాధవరావు లోపలకు రెండడుగులు వేసి అంతలోనే ఆగిపోయాడు.

రాజమణిదేవి కొడుకు ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది.

సత్యం, విమల ముఖంలోకి చూశాడు. విమల తల దించుకొంది

"మరచిపోయాను డ్రైవర్ లేడుగా? పదండి వస్తాను" అన్నాడు మాధవరావు.

"నీకు తల నొప్పిగా వుంటే వద్దులేవోయ్! ఇప్పుడు ఆ డ్రామా చూడకపోతేనేంపోయింది!" అన్నాడు కేశవరావు.

"మరోసారి వెళ్దాంలే! నువ్వు విశ్రాంతి తీసుకో అన్నాడు సత్యం.

ఎవరి మాటలూ వినిపించుకోనట్లే వెళ్ళి స్టీరింగ్ దగ్గర కూర్చున్నాడు మాధవరావు.

"ఎదండి! మరీ ఆలస్యం అయితే సీట్లుదొరకవు" అన్నాడు కొంచెం చిరాగ్గా.

అందరూ కారు ఎక్కారు. కారు పోతోంది అందరూ మౌనంగా కూర్చున్నారు మాధవరావు గురించేను ఆలోచిస్తున్నారు.

సత్యం మాధవరావు అలా వుండటానికి కారణం లీలగా ఊహించుకున్నాడు. అప్రయత్నంగానే అతను వెనుక్కు తిరిగి విమల ముఖంలోకి చూశాడు.

ఆ విషయం గ్రహించిన విమల ఏమీ గ్రహించనట్లే కూర్చుంది.

(సశేషం)

---

# రాయవరం పంచాయతీ సమితి

-- వై. సర్వేశ్వరరావు

"ఒక్కగింజ పండేచోట రెండుగింజలు పండించు"

"పరిమిత కుటుంబం పరమానందం"

ఈ రెండూ యీనాడు ప్రధానంగా వాడుకలోవున్న జాతీయ నినాదాలు ఈ నినాదాలను ఆచరణలోపెట్టి, దేశాభ్యుదయానికి యథోచితంగా తోడ్పడాలని రాయవరం పంచాయతీ సమితి పూనుకున్నది. బంజరు భూములను సాగు క్రిందకు తేవాలనీ, భూమ్ముకు పుష్కలంగా నీటి పారుదల సౌకర్యాలు కలుగజేయాలనీ ఆధునిక వ్యవసాయ పద్ధతులను చేపట్టాలనీ యీ సమితి నిశ్చయించింది. ఈ ప్రయత్నాలన్నీ జరిగినపుడు యీ సమితి ఆహారోత్పత్తిలో స్వయంసమృద్ధికాగలదు.

రాయవరం పంచాయతీ సమితిలో యించుమించు భూమి అంతా గోదావరి డెల్టాక్రింద సాగవుతున్నది. ఇక్కడ బంజరు భూమి అంతగాలేదు. కనుక వున్నభూమినే ఉపయోగించి అధిక వ్యవసాయోత్పత్తిని సాధించాలి. అంటే సాంద్ర వ్యవసాయ పద్ధతు్లను అనుసరించాలి.

ఇక్కడిభూమిఅంతా గోదావరి డెల్టాక్రింద సాగయ్యేభూమి మొదటిపంటకు యీ నీరే లభిస్తుంది. పోతే రెండోపంటకు నీటిని సమకూర్చుకోవాలి. అందుకని రైతులకు సి. డి. ఇరిగేషన్ రిక్లమేషన్ క్రింద ప్రభుత్వం మంజూరుచేసిన నిధులనుండి అప్పులు యిస్తూ భూమితనఖా బ్యాంకులద్వారా తక్కావీ ఋణాలకుగాను విద్యుచ్ఛక్తి శాఖను వత్తిడిచేసి సాగుభూముల్లో ఎక్కువగా గొట్టపు బావులను దింపాలని యీ సమితి నిశ్చయించింది. అప్పుడే చాలా వ్యవసాయ భూముల్లో యిటువంటి బావులను నిర్మించడం కూడా జరిగింది. దీనివల్ల ఈ మధ్య మొదటిపంట నారుమళ్ళకు కలిగిన నీటి ఎద్దడి నివారణ కావడమేగాక రబీ పంటకుకూడా నీటి పారుదల సౌకర్యాలు చేకూరాయి.

1959లో యీ సమితిలో ఫిల్టర్ పాయింట్లు, గొట్టపుబావులు 308 వుండేవి. ఈ నాడు వీటిసంఖ్య 645కు పెరిగింది. అదే విధంగా ఆయిలు యింజన్లు, పంపుసెట్లు 1959లో 150 వుండేవి ఎలక్ట్రిక్ మోటార్లు, పంపుసెట్లు 116 వుండేవి. వీటిసంఖ్య యీనాడు వరుసగా 266, 327 వరకు వున్నాయి.

రెండోపంటకు నీటి పారుదల సౌకర్యాన్ని కలిగించడానికై సహకార సంఘాలద్వారా కూడా యిక్కడ కృషి జరిగింది. తుల్యభాగ లిఫ్ట్ ఇరిగేషన్ సొసైటీ అనే ఒక సహకారసంఘం స్థాపించబడింది. తుల్యభాగ అనే మురుగు కాల్వలోని నీటిని 60 అశ్వశక్తిగల 6 ఎలక్ట్రిక్ మోటారు పంపుసెట్ల సహాయంతో తోడి యీ సమితిలోని రాయవరం, లొల్ల, వెదురుపాక గ్రామాలలోని సంఘ సభ్యులకు సంబంధించిన సుమారు 1500 ఎకరాలకు సాగునీటిని అందించడం జరిగింది. ఈ సహకార సంఘంవలన ప్రతి సంవత్సరం సుమారు 2000 ఎకరాలకు రబీపంటకు నీటిపారుదల సౌకర్యం కల్పించబడుతున్నది. ఇదికాక సహకార పద్ధతిపై రూ 11,70,600 అంచనా ఖర్చుతో 54 గొట్టపు బావులు నిర్మించి తద్వారా 3142 ఎకరాలను సాగులోకి తేవడానికి మరో సహకార సంఘంకూడా రిజిస్టరు చేయబడింది. ఈ సంఘ సభ్యులకు వారి భూముల హామీపై భూమితనఖా బ్యాంకునుండి అప్పులు సేకరించి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ పరిశ్రమల కార్పొరేషన్ వారి రిగుతో గొట్టపుబావుల నిర్మాణ కార్యక్రమం చురుగ్గాసాగుతున్నది. ఇప్పటికి ఈ పథకం క్రింద 8 అంగుళముల కయివారం 350 అడుగుల లోతుగల 3 గొట్టపుబావులు నిర్మించబడాయి. ఒకొక్క బావి కింద 60 ఎకరాలకు ఖరీఫ్ పంటకు సేద్యపునీరు లభిస్తుంది.

ఈసమితిలో గత పదేళ్ళలో రసాయనిక ఎరువుల వాడకం బాగా పెరిగింది. 1959లో యిక్కడ 4150 మణుగుల రసాయనిక ఎరువులు వాడగా 1969లో 83,555 మణుగులను వాడారు. క్రిమి సంహారక మందుల వాడకంకూడా చాలా పెరిగింది. పదేళ్ళక్రితం అంటే 1959లో 2,08,875 రూపాయల విలువగల క్రిమిసంహారక మందులు వాడగా యీ ఏడాది 7,13,500 రూపాయల మందుల్ని వాడారు. అప్పుడు ట్రాక్టర్లు 18 మాత్రమేవుండేవి యీనాడు 91 వున్నాయి

## హెచ్చు దిగుబడి

తూర్పుగోదావరి జిల్లాలో ప్రప్రథమంగా రాయవరం పంచాయతీ సమితిలోనే 1966 లో హెచ్చుదిగుబడి యిచ్చే టి. ఎన్-1. ఐ. ఆర్-8 వరివంగడాలు ప్రవేశపెట్టబడాయి. ఈ రకాలు వాడకముందు రైతుకు ఎకరాకు 31 బస్తాల ధాన్యం దిగుబడికాగా యీ మేలురకం విత్తనాలను వాడిన తర్వాత ఎకరాదిగుబడి 60 బస్తాల వరకు పెరిగింది.

1968 లో యీ సమితిలోని పంటభూముల భూసారాన్ని పరీక్షించే కార్యక్రమం చేపటడం జరిగింది. దీనివల్ల రైతులు తమ భూములలో ఎటువంటి పంటలను పండించడం లాభదాయకమో ఏ ఏ రకం ఎరువులను వేయవలసి వుంటుందో తెలిసే అవకాశం ఏర్పడింది. ఆ ఏడాది ఈ సమితిలోని వివిధ ప్రాంతాలకుచెందిన 2650 రకాల శాంపిల్సు సేకరించి తాడేపల్లి గూడెం లోని భూసార పరిశోధనా కేంద్రానికి పంపగా ఆ కేంద్రం వాటిని పరిశోధించి వాటి ఫలితాలను రైతులకు తెలియజేసింది. ఈ సిఫారసులమేరకు రైతులు వివిధ రసాయనిక ఎరువులను తమ భూములలో ఉపయోగించారు.

కుటుంబ నియంత్రణ పథకాలు కూడా యీ సమితిలో 1965-66 నుండి విస్తృతంగా అమలు పరచబడుతున్నాయి 1967-68లో తూర్పుగోదావరిజిల్లా కంతటికి ఈసమితి ప్రథమస్థానం సంపాదించి ప్రభుత్వం నుండి రూ 250 లు నగదు బహుమతిని అందుకుంది. ఈ ఏడాదికూడా యీ జిల్లాలో రాయవరం పంచాయతీ సమితి అగ్రశ్రేణిగా నిలిచి రజిత కప్పును కేంద్ర ఆరోగ్య శాఖ మంత్రిగారి వద్దనుండి పొందగలిగింది.





సోవియట్ కళాకారులు డిసెంబరు 13న హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని టాగూర్ ఆడిటోరియంలో ప్రదర్శనలు యిచ్చారు. ఈ సందర్భంగా ఏర్పాటైన సమావేశానికి శాసనమండలి అధ్యక్షులు శ్రీ పి. రంగారెడ్డి ప్రారంభోత్సవం చేశారు.

# సోవియట్ నృత్య ప్రదర్శన

మాలి ఒపేరా హౌస్ 1918 లో లెనిన్ గ్రాడ్‌లో స్థాపించబడి, క్రమేణా వృద్ధిపొంది 1930 నాటికి మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొంది. ఇది సోవియట్ సంగీత శాస్త్రజ్ఞులు రచించిన అనేక ఒపేరాలను అతి నైపుణ్యంతో ప్రదర్శించి సోవియట్ ఒపేరా లేబొరేటరీ అనే పేరు పొందింది. యువ పద కర్తల సహాయంతో, విస్మరించబడిన అనేక ఒపేరాలను, ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సంగీత నృత్య నాటికలను ప్రదర్శించింది. సంగీత స్వరకల్పనలో ప్రముఖుడైన ఫ్యోడాల్ లొపుఖోవ్ అధ్వర్యంలో 1932 లో ఈ ఒపేరా హౌస్ సొంత బ్యాలే బృందాన్ని ఒకదానిని స్థాపించింది. ఫ్యోడాల్ లోపు ఖోవ్ స్వరకల్పనలో అనేక నూతన రీతులను ప్రవేశ పెట్టాడు. ఈ నూతన ఒపేరా బృందాన్ని చక్కని మార్గంలో నడిపించాడు.

తొలిసారిగా 'హర్లెక్వినేడ్' అనే సుఖాంతమైన బ్యాలే ప్రదర్శన జరిగింది. దీనికి డ్రిగో సంగీతం రూపొందించారు.

లొపుఖోవ్ ఆశయాలకు, ఆదర్శాలకు లియోనాడ్ యం. లావ్రొవెస్కీ అను స్వరకల్పకారుడు ఇంకా మెరుగులు దిద్దాడు. నృత్య ప్రదర్శనలో హావ భావ విలాసాలు ప్రేక్షకులకు అవగాహన అయ్యే విధంగా వుండాలనీ, పాత్రల వ్యక్తిత్వాన్ని చిత్రీకరించాలని లియొనాడ్ కోరేవారు. 1936 లో ప్రదర్శించబడిన 'ఫాడెట్టా' ఇందుకు నిదర్శనం.

మాలీలో తయారయ్యే బ్యాలే ప్రదర్శనలన్నీ భావస్ఫూరితమైన నృత్యానికి, ఇతివృత్తానికి తగిన నాట్య భంగిమలకూ పేరు పొందాయి. ఎన్నో బ్యాలేలు తయారయినా ఏ ఒక్కదానిలో కూడా భావలోపంకానీ, రస భంగం కానీ లేదు.

బోరిస్ ఫెన్‌స్టల్ నాయకత్వాన మాలీ బ్యాలే కంపెనీ కీర్తి ప్రతిష్ఠలు తారస్థాయి నందుకొన్నాయి. ఈ స్వర కల్పకుడు ఈ థియేటరులోనే పెరిగాడు దీని సత్సాంప్రదాయాలను ఆకళింపు చేసుకొన్నాడు. తన నైపుణ్యంతో థియేటరు సత్సాంప్రదాయాలకు వన్నెతెచ్చాడు.



సోవియట్ కళాకారుల బృందానికి హైదరాబాదు బేగం
పేట విమానాశ్రయంలోగంసా

విఖేల్‌చూలాకి అనే పదకర్త సహాయంతో బోరిస్ ఫెన్‌స్టల్ 1946 లో "ది అలెగ్జ్‌సూటర్" 1949 లో "యూత్" అనే ప్రదర్శనలను తయారుచేశారు. వీటి విజయానికి కళాకారుడైన తర్యానబాలాగ్రని, యూగిన్ కోల్నిబిట్ అనువారలు కూడా తోడ్పడ్డారు. ఈ రెండు ప్రదర్శనలు సోవియట్ ప్రభుత్వ బహుమతులు పొందాయి.

1950 నాటికి మాలీ బ్యాలే ప్రదర్శనలు ప్రపంచ ఖ్యాతి గాంచాయి. ఇది శాస్త్రీయమైన బ్యాలే సంప్రదాయాలను పాటించినప్పటికీ, వినూత్న నృత్య పద్ధతులను కూడా ప్రవేశపెట్టింది.

స్వర కల్పకుడు ఐగోల్ బెల్‌స్కీ ఆధ్వర్యాన ఇటీవలి సంవత్సరాలలో అగ్రశ్రేణికి చెందిన అనేక బ్యాలేలు తయారైనాయి., "దియంగ్ లేడీ అండ్ ది హూలిగన్" అను నృత్య సంగీత నాటికకు షోస్టాకొవిచ్, "హంబ్ బ్యాక్డ్ హోర్స్" అను దానికి షెడ్రిన్ సంగీతం కూర్చారు. నికొలాయ్ బొయార్చికోవ్ అను స్వరకల్పకుడు "ది త్రిమస్కిటీర్స్" అను బ్యాలేను తయారుచేశాడు. ఈయన మాలీ బృందంలో సభ్యుడు.



ముఖ్యమంత్రి బ్రహ్మానంద రెడ్డి సనత్‌నగర్‌లో బేక్‌లైట్ హైలమ్ లిమిటెడ్‌కు ప్రారంభోత్సవం చేశారు

మాలే బ్యాలే 1964 లో తన 30 వ వార్షికోత్సవం జరుపుకొనింది. ఈ సందర్భంలో ఒపేరా, బ్యాలే కంపెనీ పేరు ప్రఖ్యాతులను పరిగణిస్తూ రష్యా ప్రభుత్వం ఒపేరా హౌస్‌ను అకాడమిక్ థియేటర్ హోదాకు పెంచింది.

ఈ బ్యాలే బృందం ఫిన్లాండు, న్యూజ్‌లాండు, ఆస్ట్రేలియా, ఫ్రాన్సు మున్నగు విదేశాలలో అనేక పర్యాయాలు ప్రదర్శనలిచ్చింది. ప్రజలు పత్రికలు ఈ ప్రదర్శనలను వేనోళ్ళ కొనియాడారు.

ఇప్పుడు హైద్రాబాదును దర్శించిన మాలీ ఒపేరా బృందంలో థియేటరు డైరెక్టరు సొలొవివ్ వ్సెవొలాడ్ గ్రిగొర్యెవిచ్, చీఫ్ బ్యాలె-మాస్టర్ బెల్‌స్కీ యొగొల్ డిమిట్రివిచ్ వున్నారు.



ఆంధ్రప్రదేశ్ యాత్రా విషయాల అభివృద్ధి సంఘం తొలి సమావేశం నవంబరు 29న జరిగింది. ఆ సందర్భంలో మాట్లాడుతున్న స్త్రీ సంక్షేమ, యాత్రావిషయాల మంత్రిణి శ్రీమతి రోడామిస్త్రి

## ఆంధ్ర మహిళాసభ

గాంధీ కస్తూర్బా శతజయంతి ఉత్సవాల నిర్వహణకోసం ఏర్పడిన స్త్రీల-పిల్లల సంఘంవారి ఆధ్వర్యాన డిసెంబరు 3వ తేదీన ఆంధ్రమహిళా సభలో శతజయంతి అనంతర కార్యక్రమం బాపతు నాలవ జాతీయ మహాసభ - శిబిరం నిర్వహించబడినవి. ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయి దేశాయ్ యీ మహాసభకు ప్రారంభోత్సవం చేశారు. మహిళా సంఘాల కార్యక్రమాలను అభివృద్ధి చేయడానికి తగిన నిధులు కేటాయించడానికి ప్రభుత్వం సిద్ధంగా వుంటుందని గవర్నరు అన్నారు.

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్, కమలాదేవి ఛటోపాధ్యాయ మహాసభలో ప్రసంగించారు. ఈ సంఘం ఆధ్వర్యాన జిల్లాలలో గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలు ప్రచారం చేయడానికీ, అమలు పరచడానికీ కృషి జరుగుతున్నది.

## పరిపాలనా సిబ్బంది కళాశాల వార్షికోత్సవం

డిసెంబరు 6వ తేదీన హైదరాబాదులో పరిపాలనా సిబ్బంది కళాశాల 12వ వార్షికోత్సవం జరిగింది. డా. సి. డి. దేశ్‌ముఖ్



త్రిపురనుంచి వచ్చిన గిరిజన ప్రతినిధులు సమాచార పౌరసంబంధశాఖా మంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావును కలుసుకున్నప్పటి చిత్రం



నగరానికివచ్చిన రుమేనియన్ ప్రతినిధివర్గం, నవంబరు 26వ తేదీన సాలార్ జంగ్ మ్యూజియంను సందర్శించినప్పటి దృశ్యం



గురునానక్ పంచ శతజయంత్యుత్సవం సందర్భంగా నవంబరు 29న ఏర్పాటుచేసిన ఊరేగింపు దృశ్యం

అధ్యక్షత వహించారు. ప్రధాన అతిథిగా ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి సమావేశంలో ప్రాల్గొన్నారు.

## లగ్జరీ మినీబస్సు

సమాచార, పౌర సంబంధశాఖ వారికోసం తయారు చేయబడిన లగ్జరీ మినీబస్సుకు డిసెంబర్ 6వ తేదీన స్త్రీ సంక్షేమ, యాత్రికశాఖ మంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీ ప్రారంభోత్సవం చేశారు.

యాత్రికులకు దర్శనీయ స్థలాలు చూపడంకోసం, హైదరాబాదు, విశాఖపట్టణం, నాగార్జునసాగర్‌లలో మూడుబస్సులు ఏర్పాటు చేస్తున్నారు. వాటిలో యిది మొదటిది. సమాచార, పౌర సంబంధశాఖ డైరెక్టరు శ్రీ పి. వామన్‌రావు ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు. డ్రైవరు, గైడుకాక, యిందులో 15 మంది ప్రయాణం చేయవచ్చు.

## లఘు పరిశ్రమలకు ఆర్థిక సహాయం

లఘు పరిశ్రమలకు ఆర్థిక సహాయంచేసే విషయం గురించి కెనరా బ్యాంకువారు ఏర్పాటుచేసిన గోష్ఠికి ప్రభుత్వ పరిశ్రమలశాఖ కార్యదర్శి శ్రీ సయ్యద్ అలీ హుసేన్ అధ్యక్షత వహించారు. డిసెంబరు 3వ తేదీన హైదరాబాదులోని సరోజనీదేవి హాల్లో జరిగిన యీ గోష్ఠిలో ప్రసంగిస్తూ శ్రీ హుసేన్ పరిశ్రమలకు యిక ముందుజరిగే ఆర్థికసహాయం ఉత్పత్తి ప్రాధాన్యంపై ఆధారపడి వుండాలని అన్నారు.

పరిశ్రమలశాఖ డైరెక్టరు శ్రీ టి. ఎల్. శంకర్ చిన్నతరహా పరిశ్రమ దారులకు అన్ని సౌకర్యాలు కల్పించబడగలవని హామీ యిచ్చారు. *

## గుంటూరుజిల్లాలో రెండవ పంటకు నీరు

గుంటూరుజిల్లాలో రెండవ పంటకుగాను 85,734 ఎకరాల వరి 1,561 ఎకరాల ప్రత్తి, 5,750 ఎకరాల వేరుసెనగ పొలాలకు నీరుసరఫరా అవుతుందని డిశంబరు 4వ తేదీన ఆ జిల్లా ఇన్‌ఛార్జి కలెక్టరు శ్రీ కే. ఆర్. వేణుగోపాల్ తెలిపారు.

బాపట్లలో డ్రైనేజ్ మరమ్మతు పనులు జనవరి నుంచి ఆరంభమవుతాయనీ. త్వరలో కొమ్మూమూరు కాలవకు మరమ్మతులు జరుగుతున్నాయనీ, కనుక దీనికి రెండవపంటకు నీరు విడుదల కాదనీ ఆయన తెలిపారు.

గత మే నెలలో తుఫాను దెబ్బకు గురైన 2.66 లక్షల ఇండ్లకు రూ. 7 కోట్లు పంచిపెట్టబడ్డాయి 28,850 చేనేత పనివారలకు రూ. 10.5 లక్షలు విలువచేసే 1,240 మగ్గాలు, నూలు పంచిపెట్టబడ్డాయి. ఇతర కళాకారులకు, వృత్తి పనివారలకు కూడా పనిముట్లు, వస్తువులు సరఫరా చేయడం జరుగుతున్నది. ఈ జిల్లాలో ఇంతవరకు ఏదో ఒక రూపంలో సుమారు 15 లక్షల మందికి సహాయం చేయడం జరిగింది. 6,000 మంది బెస్తలు నష్టపడ్డారు. వీరికి 73 పడవలు సరఫరా అయినాయి. ఇందు కొరకు రూ. 6 లక్షలు ఖర్చు అయినాయి. భూములు అభివృద్ధి చేసుకోవడానికి 48,367 మంది రైతులకు రూ. 110 లక్షలు పంచిపెట్టబడుతాయి.

నీటిపారుదల కాలవలు, డ్రైనేజికాలవలు, రోడ్డులు, చెరువుల మరమ్మతుకుగాను రూ. 290 లక్షలు ప్రత్యేకించబడ్డాయి ఈ పనులు త్వరలోనే పూర్తి అవుతాయని కలెక్టరు తెలిపారు.

# జిల్లాలనుండి

## కార్మికులకు మంచి వేతనాలు

రెండవ వేతన సంఘం సిఫారసులను అమలు పరచేందుకు ప్రభుత్వం నిర్ణయించిందని కార్మిక శాఖ మంత్రి శ్రీ డి. సంజీవరెడ్డి తెలిపారు. వేతన సంఘం సిఫారసుల ప్రకారం కార్మికులకు జీతాలివ్వడం జరుగుతుందని ఆయన తెలిపారు. కార్మికుల సమంజసమైన కోర్కెలన్నింటినీ ప్రభుత్వం సానుభూతితో పరిశీలిస్తుందనీ, కార్మిక చట్టాలను అమలు పరచడంలోగల అవరోధాల్ని తొలగించడానికి ప్రభుత్వం తగిన చర్యలు తీసుకుంటుందనీ ఇంజనీరింగు పరిశ్రమలలో పనిచేసే కార్మికులకు రూ 195 కనీస వేతనంగా నిర్ణయించబడుతుందని కూడా ఆయన హామీ ఇచ్చారు.

శ్రీ సంజీవరెడ్డి మహబూబ్‌నగర్‌లో ఐ. ఎన్. టి. యు. సి. కార్మికులను ఉద్దేశించి మాట్లాడుతూ పై విషయాలు తెలిపారు. కార్మికుల కోర్కెలు సమంజసంగా వున్నట్లయితే కార్మిక చట్టం ప్రకారం వారు సమ్మె చేయవచ్చును. ఈ సందర్భంలో వారి కోర్కెలకు ప్రభుత్వం అడ్డురాదు. కార్మికుల కోర్కెలు సమంజసమైనవని కార్మిక శాఖాధికారికి తోచినట్లయితే వారు చేసే సమ్మె న్యాయసమ్మతమైనదిగా భావించబడుతుందని కూడా ఆయన అన్నారు. కార్మికులలో ఐకమత్యాన్ని పెంపొందించాలనీ కార్మికుల సమస్యలను వారి నాయకులు పారిశ్రామిక యజమానులకు వివరించి చెప్పాలనీ ఆయన హితవు చేశారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ కె. కె. రెడ్డి మాట్లాడుతూ పేదరికం,నిరుద్యోగ సమస్యల్ని పరిష్కరించాలని,ప్రభుత్వశాఖలు, ఇతర పరిశ్రమలలో పనిచేస్తున్న వారికంటె కూడా, గీత శ్రామికులు, వ్యవసాయ కార్మికులు వెనుకబడి వున్నారని అన్నారు.

కార్మికుల న్యాయమైన కోర్కెల విషయంలో సాధ్యమైన సహాయం చేయడం జరుగుతున్నదని జిల్లా కలెక్టరు శ్రీ వి.కె. థార్ హామీ ఇచ్చారు.

మంత్రిగారు ఆసుపత్రి పనివారల యూనియన్‌ను ఉద్దేశించి మాట్లాడుతూ వారికోర్కెలను ప్రభుత్వం సానుభూతితో పరిశీలిస్తుందని హామీ ఇచ్చారు.

## కొత్త గ్రామానికి శంకుస్థాపన

రెవిన్యూ శాఖామంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి, ఖమ్మం జిల్లా, మధిర తాలూకాలోని బ్రాహ్మణపల్లి గ్రామ ప్రజల పునరావాసానికి ఉద్దేశించిన కొత్త గ్రామానికి శంకుస్థాపన చేశారు. గత మేలో సంభవించిన తుఫాను ఫలితంగా యీ గ్రామానికి నష్టం వాటిల్లింది.



జహీరాబాద్‌లో డిసెంబరు 8 వ తేదీన వైద్యశాఖ డైరెక్టరు డా. బి. భువనరావు కస్తూర్బా గాంధీ ప్రసూతి వార్డుకు శంఖు స్థాపన చేశారు.

ఈ సందర్భంగా జరిగిన బహిరంగ సభలో మంత్రి ప్రసంగిస్తూ వరద బాధితులకు ప్రభుత్వం నుండి సాధ్యమైన సహాయం లభిస్తుందని హామీ యిచ్చారు. రైతులు రాజకీయాలతో సంబంధం లేని కిసాన్ సంస్థలను నెలకొల్పుకోవాలని ఆయన ఉద్బోధించారు. ప్రతి కుటుంబానికి 6 సెంట్ల చొప్పున యిండ్ల స్థలాలు మంజూరు చేయడమే గాక సరసమైన ధరలకు ఎక్కువ విస్తీర్ణం గల స్థలాలను కూడా లభింప జేస్తారని ఆయన అన్నారు.

నీటి పారుదల శాఖామంత్రి, శ్రీ శీలం సిద్దారెడ్డి ప్రసంగిస్తూ జిల్లాలో యిటువంటి తుఫాను కారణంగా జరిగిన నష్టాన్ని గూర్చి రెవిన్యూ మంత్రికి వివరించారు.

## శివారెడ్డి పల్లిలో విద్యుదీకరణకు ప్రారంభోత్సవం

విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు, యిటీవల హైదరాబాదు జిల్లా పరిగి తాలూకాలోని శివారెడ్డి పల్లి గ్రామంలో విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా జరిగిన సభలో మంత్రి ప్రసంగిస్తూ భవిష్యత్తు నేటి యువకులపై ఆధారపడిఉందనీ, తల్లిదండ్రులు తమ పిల్లలను సక్రమ మార్గంలో పెంచాలనీ అన్నారు. దేశపరిస్థితులు మార్పు చెందుతున్న యీ కాలంలో ప్రతి వారు త్యాగానికి సిద్ధపడాలని ఆయన అన్నారు.



ఆరోగ్య వైద్యశాఖా మంత్రి శ్రీ మహమ్మద్ ఇబ్రహిం అలీ అన్సారీ, మార్కెటింగ్ శాఖా మంత్రి శ్రీ రామచంద్ర రావు కళ్యాణి నవంబరు 30 న మహబూబ్ నగర్‌లో జరిగిన టుబెక్టమీ శిబిరం సందర్శించారు.

ఈ సంవత్సరం యీ జిల్లాలో గ్రామీణ విద్యుదీకరణ కార్యక్రమానికి రూ. 70 లక్షలు ఖర్చుచేయాలని ప్రతిపాదించారనీ ఈ తాలూకాలో రు 15 లక్షల అంచనా ఖర్చుతో 17 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయాలని ఉద్దేశించారనీ. పర్గి తాలూకా వెనుకబడిన ప్రాంతం అయినందువలన అభివృద్ధి కార్యక్రమాలకు ఎక్కువ నిధులను కేటాయిస్తారనీ కలక్టరు వెల్లడించారు.

జిలా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ భోజిరెడ్డి తమ అధ్యక్షోపన్యాసంలో గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తున్నందుకు తన సంతోషాన్ని వ్యక్తంచేశారు

## పశువైద్యశాలకు స్పీకర్ ప్రారంభోత్సవం

ఆంధ్రప్రదేశ్ శాసన సభాధ్యక్షులు, శ్రీ బి. వి. సుబ్బారెడ్డి గత సోమవారంనాడు కర్నూలు జిల్లా కోయలకుంట్ల పంచాయతీ సమితిలోని దేవమారు గ్రామంలో గ్రామీణ పశువైద్యశాలకు ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ గ్రామీణ ఆర్థిక వ్యవస్థలకు పశుసంపద వెన్నెముకవంటిదని అన్నారు. పశుగణాభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధవహించాలని ఆయన రైతులను ఉద్బోధించారు.

పశు వైద్యశాల సేవలను తగువిధముగా ఉపయోగించుకోవాలని స్పీకరు హితవు చెప్పారు. పశువైద్యశాల సిబ్బంది ఆ ప్రాంతపు పశువులకు సంబంధించి తగు శ్రద్ధ వహిస్తారని తన ఆశాభావాన్ని వ్యక్తంచేశారు.

## కడపలో అస్బెస్టాస్ ఫ్యాక్టరీ

ఎగుమతి ప్రోత్సాహం, గనుల శాఖల మంత్రి శ్రీ పి. ఎ. ప్రసాదరావు ఇటీవల కడపలో గనుల యజమానుల సమావేశంలో ప్రసంగిస్తూ కోటిరూపాయల పెట్టుబడితో కడపజిల్లాలో అస్బెస్టాస్ ఫ్యాక్టరీని స్థాపించడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నదని వెల్లడించారు.

ఈ ప్రాంతంలో గనులకు ఉపయోగపడే పరిశ్రమలు నెలకొల్పినట్లయితే, ముడి సరుకులను యీ గనులు ఉపయోగించడానికి వీలు పడుతుందనీ తద్వారా నిరుద్యోగ సమస్య తీరడమేగాక యీ వ్యాపారం నడిపేవారికి సమంజసమైన లాభాలు రావడానికి వీలుంటుందనీ, మంత్రిగారు తెలిపారు.

గనుల యజమానులకు పని సోమతను బట్టి అప్పులిచ్చే విషయాన్ని ప్రభుత్వం సానుభూతితో పరిశీలిస్తుందని మంత్రి హామీ ఇచ్చారు. అంతేకాకుండా గనులపైన విధించే పన్నును గనులలో పనిచేసే కార్మికుల శ్రేయస్సుకు వినియోగించడానికీ, క్రొత్త ఖనిజ సంపదను కనుగొనడానికీ సాంకేతిక సహాయం యివ్వడానికీ, గనుల పరిశ్రమ వ్యవహారాలను సమన్వయ పరచేందుకు ఒక వ్యవస్థను ఏర్పాటు చేయడానికి కూడా ప్రభుత్వం ప్రయత్నిస్తుందని ఆయన తెలిపారు. ఆలస్యం లేకుండా లైసెన్సులను యిచ్చే పద్ధతిని అమలు పరచడం జరుగుతుందని హామీ ఇచ్చారు.

## ప్రపంచ బ్యాంకు బృందం జగిత్యాల పర్యటన

ప్రపంచ బ్యాంకు బృందం సభ్యులు, గత శుక్రవారం నాడు కరీంనగర్ జిల్లా, జగిత్యాలలోని పంచాయతీ సమితి కార్యాలయంలో అభ్యుదయ కర్షకులతోను, వ్యాపారస్థులతోను సహకార ఉద్యమం, రైతులకుగల మార్కెటింగ్ సౌకర్యాలను గూర్చి చర్చించారు.

1952 సంవత్సరంలో సహకార ఉద్యమం గురించి మొదటిసారిగా గ్రామీణ సర్వే జరిగిందని అసిస్టెంటు కలెక్టరు, శ్రీ ఆర్. వైద్యనాథ అయ్యర్, ప్రపంచ బ్యాంకు బృందానికి వివరించారు. అధిక దిగుబడి రకాలకు సంబంధించిన పైర్లపై రైతులు ఋణాలు పొందుతున్నారని ఆయన అన్నారు. సహకార సంఘాలలో అనుసరించాల్సిన విధానాలు ఎక్కువగా ఉన్న కారణంగా రైతులు వాటిలో చేరడానికి వెనుకముందాడుతున్నారని ఒక రైతు అభిప్రాయపడ్డాడు. ప్రభుత్వం సహాయపడిన పక్షంలో వ్యవసాయ రంగంలో యంత్రాలను ప్రవేశ పెట్టడానికి రైతులు ప్రాధాన్యం యిస్తారని ఆయన అన్నాడు.

## గజ్వేలులో పాల శీతల యంత్రం

వ్యవసాయం పశుపోషణశాఖల మంత్రి శ్రీ కాకాని వెంకటరత్నం మెదక్ జిల్లా గజ్వేలులో పాల ఉత్పత్తిదారుల సమావేశంలో మాట్లాడుతూ వారు శీతల యంత్రాన్ని నెలకొల్పడానికి రూ. 10,000లు, 3 ఎకరాల భూమిని విరాళంగా యిచ్చినందుకు అభినందించారు.

గజ్వేలు పంచాయతీ సమితి భవనంలో యునిసెఫ్ సంస్థ వారు సప్లై చేసిన 2,000 లీటర్ల పాల శీతల యంత్రాన్ని ఈ నెలా ఖరులోగా నెలకొల్పవలసిందని మంత్రిగారు పాల ప్రాజెక్టు అధికారులను కోరారు.

## చిత్తూరులో పాల యంత్రం

రాష్ట్రంలో పశుపోషణ అభివృద్ధికి ప్రభుత్వం రూ. 380 లక్షలు కేటాయించింది. ఇందులో రూ. 70 లక్షలు రాయలసీమ ప్రాంతానికి ప్రత్యేకించబడినాయని రాష్ట్ర పాల కమీషనర్ డా॥ ఎ. సూర్యప్రకాశరావు ఇటీవల చిత్తూరులో ప్రసంగిస్తూ వెల్లడించారు.

యీ ప్రాంతంలో నెయ్యి పరిశ్రమను శాస్త్రీయ పద్ధతులలో అభివృద్ధి చేయడానికి మంచి అవకాశాలు ఉన్నాయని ఆయన తెలిపారు.

ఈ నెలలో రూ. 11 లక్షల ఖర్చుతో పాల యంత్రం పనిచేయ నారంభిస్తుంది. ఇక్కడ ఉత్పత్తిఅయ్యే పాలు తిరుపతి లోని యాత్రికులకు, విద్యా కేంద్రానికి సరఫరా అవుతాయి. కడప జిల్లా మైదుకూరులో కూడా పాల యంత్రాన్ని ప్రారంభించేందుకు ప్రతిపాదనలు ప్రభుత్వ పరిశీలనలో వున్నాయని ఆయన చెప్పారు.

## భద్రాచలం సమితికి కుటుంబ నియంత్రణ షీల్డు

హైద్రాబాదులోని జూబిలీహాలులో ఇటీవల జరిగిన జిల్లా వైద్య, ఆరోగ్య శాఖాధికార్లు, జిల్లా కుటుంబ నియంత్రణ శాఖాధికార్ల సమావేశం సందర్భంలో ఏర్పాటు చేసిన ప్రత్యేక కార్యక్రమంలో, కుటుంబ నియంత్రణ విషయంలో రాష్ట్రమంతటిలోనూ ఉత్తమ కృషి జరిపినట్లు ప్రకటింపబడిన భద్రాచలం పంచాయతీ సమితికి ఆరోగ్యశాఖామంత్రి షీల్డును బహూకరించారు.

## పొదుపు పథకం

జాతీయ పొదుపు పథకం విషయంలో హైదరాబాదు జిల్లాకు రూ. 102 లక్షల సేకరణ పరిమితిని నిర్ణయించగా రూ. 70.76 లక్షలను సేకరించడం జరిగిందని హైదరాబాదు జిల్లా కలెక్టరు శ్రీ నరసింగ్‌రాజ్ డిసెంబరు 4 వ తేదీన హైదరాబాదులో జరిగిన జిల్లా సమన్వయ సంఘం సమావేశంలో మాట్లాడుతూ అన్నారు.

## రైతులకు ట్రాన్సిసర్ రేడియోలు

కేంద్రప్రభుత్వం, హైదరాబాదు జిల్లాకు 250 ట్రాన్సిస్టర్ రేడియోలను ఉచితంగా సరఫరా చేసింది. రైతుల చర్చా బృందాల నిమిత్తం వీటిని ప్రతి పంచాయతీ సమితికి 30 రేడియోల చొప్పున పంపిణీ చేస్తారు.

రాజేంద్రనగర్‌లోని రైతుల శిక్షణ కేంద్రం వారు హైద్రాబాదు జిల్లాలో యిప్పటికే 75 చర్చా బృందాలను నిర్వహించారు.

జిల్లా కలెక్టరు, శ్రీ నర్సింగ్‌రాజ్, గత శనివారంనాడు హయాత్‌నగర్‌లో యీ ట్రాన్సిస్టర్ రేడియోలను పంపిణీ చేశారు.

## రాయలసీమలో మెట్టసేద్యం ప్రదర్శన కేంద్రాలు

తరుచుగా అనావృష్టికి గురిఅయ్యే ప్రాంతాలలో రైతులకు మెట్టసేద్యం విధానాలను గురించి తెలియజేసే నిమిత్తం నాలుగవ ప్రణాళిక కాలంలో రాయలసీమలో రెండు మెట్టసేద్యం ప్రదర్శన కేంద్రాలను నెలకొల్పదలచినట్లు వ్యవసాయశాఖ డైరెక్టరు డా॥ టి. వి. రెడ్డి యిటీవల తిరుపతిలో అన్నారు.

వచ్చే సంవత్సరాలలో రాయలసీమ జిల్లాలో భూసార సంరక్షణ, అడవుల పెంపకం కార్యక్రమాలను పెద్ద ఎత్తున చేపట్టడం పట్ల ప్రభుత్వం ఆసక్తి చూపుతుందని ఆయన తెలిపారు. కడప, చిత్తూరు జిల్లాల్లో అరటి సేద్యానికి ప్రత్యేక సదుపాయాలు కల్పించడం కొరకు నిశ్చయించినట్లు వ్యవసాయశాఖ డైరెక్టరు వెల్లడించారు. సకాలంలో పైరును రక్షించడం కొరకు చీడల నిరోధక చర్యలను జిల్లా స్థాయిలోనే తీసుకోవడం జరుగుతుందని డా॥ రెడ్డి అన్నారు.

## రివిన్యూ మంత్రి పర్యటన

నవంబరు 4వ తేదీన సూర్యాపేట తాలూకాలో వరద పీడిత ప్రాంతాలలో రివిన్యూ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డిగారు పర్యటించారు. కాళింగినదికి ఉత్తరపుగట్టునకు తనేలి ఆనకట్ట వద్దనుండి హండ్‌బ్యాంకు నుకట్టి యీ ప్రాంతానికి శాశ్వత పద్ధతిలో నివారణ కలిగించాలని స్థానిక నాయకులు కోరారు.

## కరీంనగర్‌లో గ్రంథాలయోత్సవాలు

నవంబర్ 14వ తేదీనుండి 20వ తేదీ వరకు కరీం నగర్ జిల్లా కేంద్రగ్రంథాలయంలో జాతీయ గ్రంథాలయ వారోత్సవాలు నిర్వహింపబడినవి. ముగింపు సభకు కరీంనగరం మున్సిపల్ చైర్మన్ శ్రీ జె. ఆర్. గోపాలరావు అధ్యక్షత వహించారు జిల్లా రివిన్యూ అధికారి శ్రీ యస్. వెంకట్రామయ్య 14వ తేదీన వారోత్సవాలను ప్రారంభించారు. సమావేశములలో జిల్లా గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ బి. వేంకటరామారావు, శ్రీ గార్లపాటి తిరుపతిరెడ్డి, శ్రీ జువ్వాడి తుక్కారావు, శ్రీ జార్జిశ్యామ్యుయేలు, శ్రీ సముద్రాల నాగభూషణం, శ్రీ సత్యాంబ్ర ఆనందావధూత, శ్రీ టి. నారాయణ రావు ప్రభృతులు పాల్గొన్నారు.

ఈ సందర్భంలో సారస్వతజ్యోతి మిత్రమండలి సమకూర్చిన అనేక కళాఖండములు, చిత్రములతోసహా జిల్లా గ్రంథాలయ సంస్థవారేర్పాటు చేసిన గ్రంథ ప్రదర్శనములో అనేక తాళపత్ర గ్రంథములు ప్రాచీన గ్రంథములు, నాణెములు, గంటములు, గాంధీజీవిత చరిత్రకు సంబంధించిన అల్బములు, తైలవర్ణ చిత్రములు ప్రదర్శించబడినవి.

20వ తేదీన జిల్లా పౌరసంబంధాల శాఖవారిచే ఫిలిం ప్రదర్శింపబడింది.

# మీరు క్రొత్త 1969 నార్టన్ సైకిలును చూచేరా?




## అది చూచుటకు ఎంతో ముచ్చటవేస్తూ ఉంటుంది!

అవును! క్రొత్త నార్టన్‌కు ఆశ్చర్యకరమైన పరిక్రొత్త అంశములు ఉండుట వలన దానిని చూడగానే మీరు కొనాలనుకొంటారు. అది భారతదేశములో సైకిళ్లను తయారుచేయుటలో మార్గదర్శకులైన వారిచే భారతదేశములో తయారుచేయబడుతోంది!

**హింద్ సైకిల్స్ లిమిటెడ్,**
250, వర్లి, బొంబాయి-25 డిడి.
భారతదేశములో పూర్తి సైకిలును తయారుచేసే చాల పెద్ద సంస్థ. అన్ని విడి భాగములను ఒకే చోట తయారుచేస్తోంది.




## ఏ విధముగా చూచినా ఎంతో మంచి సైకిలు-నార్టన్


PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD.
PRINTED BY THE DIRECTOR OF PRINTING GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD.



ఫిబ్రవరి 1970 **ఆంధ్ర ప్రదేశ్** 50 పైసలు

# తెలంగాణా గురించి...

**విస్తీర్ణం, జనాభా జన సాంద్రత 1961**

| | విస్తీర్ణం (మైళ్ళలో) | జనాభా (లక్షలలో) | చదరపు మైలు 1కి జనసాంద్రత |
|---|---|---|---|
| తెలంగాణా | 44,313.9 | 127.12 | 318 |
| ఆంధ్రప్రదేశ్ | 106,052.4 | 359.83 | 339 |

**జనాభా పెరుగుదల 1921-1961**

| | 1921 లో (లక్షలలో) | 1951 లో (లక్షలలో) | 1961 లో (లక్షలలో) |
|---|---|---|---|
| తెలంగాణా | 69.61 | 108.99 | 127.12 |
| ఆంధ్రప్రదేశ్ | 214.20 | 311.15 | 359.83 |

**గ్రామీణ పట్టణ జనాభా 1961**

| | మొత్తం జనాభా (లక్షలలో) | మొత్తం గ్రామీణ జనాభా (లక్షలలో) | మొత్తం పట్టణ జనాభా (లక్షలలో) | మొత్తం జనాభాలో గ్రామీణ జనాభా శాతం | మొత్తం జనాభాలో పట్టణ జనాభా శాతం |
|---|---|---|---|---|---|
| తెలంగాణా | 127.12 | 102.62 | 21.50 | 80.7 | 19.3 |
| ఆంధ్రప్రదేశ్ | 359.83 | 297.09 | 62.74 | 82.6 | 17.4 |

# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 14 ఫిబ్రవరి 1970 సంచిక: 4

మాఘం-ఫాల్గుణం-1891 శా.శ

ప్రధాన సంపాదకులు : పెండ్యాల వామనరావు

## ఈ సంచికలో....



ముఖపత్రం ఫొటో : నందగోపాల్

నాలుగవ అట్ట : వెలుగుకు దారులు

**వెల: 50 పైసలు**

**సాలుచందా ఆరు రూపాయలు**

**Regd. No. H. 135.**



పేజీ

# శుభారంభం

ఈ కొత్త సంవత్సరం మొదటి నెలలో ఆంధ్రప్రదేశ్‌లో — ముఖ్యంగా రాజధానీ నగరం హైదరాబాదులో పండుగ ఉత్సాహం పరవళ్లు త్రొక్కింది. ఏదో ఒక కారణంచేత ఏదో ఒక ప్రాంతంలో గతఏడాది కలిగిన కష్టనష్టాలు కొత్తసంవత్సరంలో తొలగిపోయి శుభప్రదమైన వాతావరణం ఏర్పడింది. మరొక కొత్త దశాబ్ది కాలానికి నాందియైన నూతన సంవత్సరాది, వారం రోజులపాటు వీనుల విందుగా కన్నుల పండువుగా జరిగిన సంగీతనృత్యోత్సవాలు, సంక్రాంతి పండుగ, ఆనందోత్సాహాలతో జరిగిన యాత్రావారోత్సవాలు, భారత రిపబ్లిక్ మూడో దశాబ్ది కాలాన్ని ప్రారంభించిన యీయేటి రిపబ్లిక్‌దినోత్సవం—యిలా ఒకదానితర్వాత ఒకటి వడివడిగా వచ్చి సుఖశాంతి వాతావరణ చిహ్నంగా ప్రజలకు ఆశావహమైన, ఒక నూతన దృక్పథాన్ని కలిగించాయి — అని రాష్ట్రగవర్నరు శ్రీ ఖండూభాయ్‌దేశాయ్ రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా ఆకాశవాణి ద్వారాచేసిన తమప్రసంగంలో చెప్పినది పూర్తిగా యథార్థం. ఆర్థికాభ్యుదయానికీ, దేశప్రగతికీ శాంతి, సామరస్యాలు ప్రాతిపదిక అంశాలని ఆయన పేర్కొన్నారు. శాంతికి భంగకరమైనదేదీ చేయవద్దని ఆయన విజ్ఞప్తిచేశారు.

ఇదే విషయాన్ని ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు కూడా తమ రిపబ్లిక్ దినోత్సవ సందేశంలో పేర్కొన్నారు. హృదయాలమధ్య ఇరుకైన అడ్డుగోడలు నిర్మించి, ప్రగతి గమనానికి ప్రతిబంధకంగా నిలిచి, చారిత్రికంగా లభించిన అవకాశాలను జారవిడుచుకోవద్దనీ, వ్యక్తిగత విద్వేషాలకూ అల్లరిచిల్లర తగాదాలకూ, స్వార్థపరత్వానికీ అతీతంగావుండి దేశంలో గణనీయమైన స్థానాన్ని సాధించిన ఈ నాలుగుకోట్ల తెలుగు ప్రజల రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి పాటుపడవలసిందనీ ఆయన ప్రజలకు విజ్ఞప్తిచేశారు. దారిద్ర్యనిర్మూలనకూ, అభివృద్ధి నిరోధకతత్వాన్ని ఎదుర్కోడానికీ, కుల, మత ప్రాంతీయ ధోరణులను నిర్మూలించడానికీ ప్రతిజ్ఞా కంకణం ధరించవలసిందని ఆయన ప్రజలను ఉద్బోధించారు.

ప్రభుత్వ ఆధ్వర్యంక్రింద మొట్టమొదటిసారిగా హైదరాబాదులోజరిగిన సంగీతనృత్యోత్సవం సాంస్కృతిక కార్యక్రమాల చరిత్రకు ఒక కొత్త శోభను చేకూర్చింది. ఇటు కర్ణాటక బాణీకి, అటు హిందూస్తానీ బాణీకి చెందిన సంగీత, నృత్యాలకు సంబంధించిన సుప్రసిద్ధగాత్ర, వాద్యవిద్వాంసులు, రాష్ట్రంలోవారూ యితర రాష్ట్రాలవారూ—ప్రదర్శించిన కళా నైపుణ్యంతో కన్నుల పండువుగా, వీనుల విందుగా ఒక అపూర్వ ప్రదర్శన జరిగింది. ఈ సంగీత నృత్యోత్సవం యిక ముందు ఏటేటాజరుగుతూ వుండవచ్చు.

బాణాసంచా ప్రేలుళ్ళు, విద్యుద్దీపాలంకరణ, కార్ల ఊరేగింపు, విదేశీ ప్రముఖులు అతిథులుగా హాజరుకావడం వంటి కార్యక్రమాలతో జరిగిన యీ యాత్రిక వారోత్సవం రాష్ట్రంలో మంచి శోభా, సౌభ్రాతృత్వ వాతావరణ మేర్పరచింది ప్రజలనుంచి, ముఖ్యంగా యువకులనుంచి లభించిన ప్రోత్సాహం ఎన్నడూ కని విని ఎరుగనిది. ఈ కార్యక్రమాలన్నింటికీ అశేష సంఖ్యలో ప్రజలు హాజరయ్యారు, విశాఖపట్నంలో జరిగిన యాత్రిక వారోత్సవాలు కూడా ప్రజల్లో అమితమైన ఉత్సాహాన్ని రేకెత్తించాయి.

విదేశీయాత్రికుల్నీ, దేశీయ యాత్రికుల్నీ ఆకర్షించడానికి నూతనోత్సాహంతో రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్నకృషికి నిదర్శనం రాష్ట్ర యాత్రిక వారోత్సవాలు. దీనివల్ల ఒకవైపు హైదరాబాదు నగరానికీ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికీ ఆర్థికంగా ఎంతోలాభం చేకూరుతుంది, మరో వంక జాతీయ సమైక్యతను పెంపొందించి అంతర్జాతీయ అవగాహనకు దోహదం కలుగుతుంది. యాత్రికులను ఆకర్షించే కార్యక్రమం చాలా ఆసక్తితోకూడిన అంశం. అన్నిరంగాలకు పరివ్యాప్తమైన కార్యక్రమం. ఇదిరాజకీయాలతో సంబంధంలేనిది. వాదోపవాదాలకు తావులేనిది. ఈ విషయంలో భిన్నాభిప్రాయాలు వుంటాయని వూహించడానికి కూడా వీలుండదు. యాత్రా కార్యక్రమాలను అభివృద్ధిపరచడం కేవలం ప్రభుత్వ బాధ్యత మాత్రమేకాదు. ప్రభుత్వం ఈ విషయంలో ఒక సంధానకర్త మాత్రమే. ప్రతి పౌరుడు యాత్రా విషయాలశాఖలో స్వచ్ఛంద ప్రతినిధియే. ప్రతి పౌరుడూ ఆతిథ్యం యివ్వడానికీ, స్వీకరించడానికీ అధికారంగలవాడే. అనధికార రంగంనుండి సహాయసహకారాలులభిస్తేగాని మన ఆర్థికప్రగతికి దోహదంచేసే యీ పర్యటనలను అభివృద్ధిపరచే ప్రయత్నాలు ఏవీ విజయవంతంకావు. దీని అభివృద్ధికి ప్రజలభాగస్వామ్యం తప్పనిసరిగా వుండాలి. ఈ సహకారం, యీ నాడు పుష్కలంగా లభిస్తువుండడం నిజంగా ఆనందించదగ్గ విషయం.

పి. ఫై: ఆర్

# "శాంతి సామరస్యాలు ప్రగతికి ప్రాణం వంటివి"



—గవర్నరు సందేశం

రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా 1970 జనవరి 26వ తేదీన ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంద్వారా రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ఒక సందేశం ఇచ్చారు. ఆ సందేశం పూర్తి పాఠం ఈ దిగువ ఇస్తున్నాము.

"ఈ నాడు మనం భారత రిపబ్లిక్ ఇరవయ్యో వార్షికోత్సవం జరుపుకుంటున్నాం. పంధొమ్మిది వందల యాభైలో సరిగ్గా ఇదే రోజున భారత దేశం సర్వ ప్రజల హర్షానందాలతో పరిపూర్ణ ప్రజాస్వామిక రాజ్యంగా రూపొందింది. ఈ సందర్భంలో రాష్ట్ర ప్రజలకూ, యావద్భారత ప్రజానీకానికీ నా హృదయపూర్వక అభినందనలూ, శుభాకాంక్షలూ అందజేస్తున్నాను. ఈ ఇరవయ్యేళ్ళలోనూ ప్రపంచమూ, భారత దేశమూ ఎన్నో పెద్ద పెద్ద మార్పులను చవిచూశాయి. కొత్తగా విదేశీ పాలకుల సంకెళ్ళ నుండి విముక్తి చెంది స్వేచ్ఛావాయువులను పీల్చిన స్వతంత్ర రాజ్యం అనే స్థితి నుంచి శక్తివంతమైన, సంతోష చైతన్యాలు వెల్లివిరిసే ఆధునిక రాజ్యంగా రూపొందడానికి భారత దేశం అనాదినుండీ నిరంతరంగా పరిశ్రమిస్తున్నది. వలస ఆర్థిక వ్యవస్థతో కూడిన వ్యావసాయిక దేశం అనే దశనుండి, వ్యవసాయ రంగంలో పురోగమిస్తూనే పారిశ్రామిక రంగంలో కూడా పాటుపడుతున్న ఒకానొక దశకు మన దేశం చేరుకున్నది. సాంఘిక, ఆర్థిక సమానత్వాన్ని సాధించడానికి పెద్ద పెద్ద బ్యాంకులను జాతీయం చేయడం, భూసంస్కరణలను ప్రవేశపెట్టడం, జీవిత భీమాను జాతీయం చేయడం వంటి చర్యలు దేశ ఆర్థిక వ్యవస్థను పటిష్ఠం చేయడానికీ, సంపదను సమానంగా ప్రజలకు పంపిణీ చేసేందుకు మార్గాలను వేయడానికీ ఉద్దేశించినవే.

"మనం నిర్మించుకున్న రాజ్యాంగం ప్రకారం న్యాయ నిర్ణయంలో అందరూ సమానులే. అందరికీ వాక్స్వాతంత్ర్యం, భావ ప్రకటనా స్వాతంత్ర్యం లభించాయి. రాజ్యాంగంలోని ఆదేశ సూత్రాలు, ప్రాథమిక హక్కులు, మతాతీత సాంఘిక వ్యవస్థా స్వభావం — ఇవి మన దేశ భవిష్యత్తుకు మూల స్తంభాలుగా పేర్కొనదగిన ప్రత్యేక లక్షణాలు.

"సామాన్యుని ఉద్దేశించిన ప్రాథమిక హక్కులవలన అతను దేశ పాలనలో భాగస్వామి కావడానికి మాత్రమే గాక దేశ భవిష్యత్తును తీర్చి దిద్దడంలో సైతం భాగస్వామి కావడానికి వీలు కలిగిస్తుంది.

## మతాతీత విధానం

"లోగడ నేను చెప్పినట్టుగా మన రాజ్యాంగంలోని అతి ప్రధానమైన అంశం — మతాతీత విధానం. దీనిలో మన పురాతన భారతీయ విజ్ఞానం ప్రతిబింబిస్తుంది. సహనశీలమూ, సర్వ జన సమానతాభావమూ ద్యోతకమవుతాయి. నిజానికి ఇది మనలో మనకు విశ్వాసాన్ని కలిగిస్తుంది.

"మన రాజ్యాంగంలో మతం, కులం, సమాజం కారణంగా మనిషికీ మనిషికీ మధ్య విచక్షణకు తావు లేదు. ఆర్థిక స్థితీ, సాంఘిక స్థితిగతుల కారణంగా మనుష్యుల మధ్య తేడాకు అవకాశం లేదు. రాజ్యాంగం ప్రకారం ప్రజలందరూ సమానులే. న్యాయం అందరికీ ఒక్కటే. ఈ సమతా భావాన్ని, మత రహిత ధోరణిని పరిపోషించి, జాతి సమైక్యతనూ, ఏకత్వాన్నీ చెక్కు చెదరనీయకుండా కాపాడవలసిన బాధ్యత మన మీద ఉంది.

"రెండు శతాబ్దాల పరిపాలనలో క్షీణించిపోయిన మన ఆర్థిక వ్యవస్థను పునరుజ్జీవింపజేసి పునర్వ్యవస్థీకరించి, చంద్రునిపై కాలుపెట్టిన ఆధునిక కాలంలో ఈనాటి ఆధునిక ప్రపంచాన్ని

దృష్టిలో వుంచుకుని మన దేశాన్ని సరికొత్త తరహాలో తీర్చి దిద్దే బృహత్తర కృషిలో యీనాడు దేశం మునిగివుంది. మన రెండు దశాబ్దాల ప్రణాళికా కృషివల్ల మనదేశం ఆర్థికరంగంలో గణనీయమైన ప్రగతిని సాధించినదన్న సత్యాన్ని ఎవరూ కాదన లేరు. ఇతర స్వేచ్ఛా రాజ్యాల సరసన అభ్యుదయ పథంలో ప్రయాణించే స్థితికి చేరుకున్నామనే మాట యథార్థం.

## ప్రజలలో క్రియాశీలత :

"గడచిన మూడు పంచవర్ష ప్రణాళికలవల్లా సాధించిన అభివృద్ధి దృష్ట్యా యీనాడు మనం మన చతుర్థ ప్రణాళిక లక్ష్యాలను మరింత ఎక్కువగా పెంచుకున్నాం. ఆంధ్రప్రదేశ్ విషయంలో కూడా యిదే జరిగింది. ప్రణాళికలద్వారా వీలైనంత ఎక్కువ ప్రయోజనాలను సాధించాలంటే ప్రణాళికా కృషిలో మునిగివున్న ఏ కొద్దిమందిలో మాత్రమే గాక యీ ప్రణాళికా అమలుతో సన్నిహిత సంబంధంగల లక్షలాది ప్రజానీకంలో సైతం ఒక విధమైన క్రియాశీలతా, లక్ష్య గమనమూ, కృషికి అంకితమయ్యే మనసూ, మార్గదర్శకతా వుండాలి. అందుచేత వేర్పాటు ధోరణులవల్ల ఉత్పన్నమైన విచ్ఛిన్నకర శక్తులకూ, వినాశకర శక్తులకూ యీనాడు తావులేదు. సమైక్యతా భావం, ప్రజాస్వామ్య ధోరణి, మత రహిత విధానం–ఇవే యీనాడు మన ప్రధాన లక్ష్యాలు.

"అభ్యుదయానికీ, ఆర్థికాభివృద్ధికీ ప్రధానంగా కావలసినవి శాంతి, సమానత్వాలు. అందుచేత శాంతి భద్రతలకు అంతరాయాన్ని కలిగించే ఏ చర్యా కూడనిపనే. ప్రతి వ్యక్తీ ప్రతి వర్గమూ తన శ్రేయస్సుకూ, అభివృద్ధికీ తాను శాంతి మార్గంలో, సక్రమ పద్ధతిలో శ్రమించే హక్కు కలిగివున్నప్పటికీ ఇతరుల మార్గాలకు ప్రతిబంధకంగా వుండే అధికారం వారికి ఏమాత్రంలేదు. మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పెద్దరాష్ట్రం. ఇక్కడ వ్యవసాయ, ఖనిజ, అటవీ సంపదలు విస్తారంగాన్నాయి. ఈ సంపదలను సక్రమంగా వినియోగించుకోగలిగితే సామాన్యుని జీవన పరిస్థితులు నిస్సంశయంగా మెరుగుపడగలవు. ఉత్తర, దక్షిణ భారత దేశాలను కలిపే వంతెనగా ఆంధ్రప్రదేశ్ వున్నది. ఇరు ప్రాంతాలకుచెందిన శీతోష్ణస్థితిగతులు, స్వభావాలు కలిగివుంది. సర్వ సంస్కృతులకు సంగమమైనదిగా రాష్ట్ర రాజధానీ నగరం విలసిల్లుతున్నది. అందుచేతనే యీ రాష్ట్రం మొత్తం దేశంలోనే ఒక సమన్వయ సంధాన కర్తగా వ్యవహరించవలసివుంది.

## గాంధీజీ చూపిన మార్గంలో . . .

"ఈనాడు దేశం ఆర్థికరంగంలో అభ్యుదయ పథంలో పురోగమిస్తున్నది. స్వాతంత్ర్య ఫలాలు సామాన్యునికి అందే విధంగా మనంకూడా యీ పురోగమన ప్రస్థానాన్ని కొనసాగించ వలసి వుంది. సామాన్యుని జీవన స్థితులను మెరుగుపరచడానికి ప్రత్యేక చర్యలను తీసుకోవడం ఈ గాంధీ శత జయంతి సంవత్సర సమయంలో మరింత అవసరం. గాంధీజీ బోధించిన వాటిని ఆచరణలో పెట్టి, ఆయన నిర్దేశించిన మార్గంలో ప్రయాణించి నప్పుడే గాంధీజీకి మనం న్యాయం చేకూర్చినవారమవుతాము.

"ఒకానొక సందర్భంలో డా. ఎస్. రాధాకృష్ణన్ గాంధీజీని గూర్చి ప్రస్తుతించిన మాటలతో నేను ముగిస్తాను "దేశమంటే కేవలం మనుషులేకాదు. అనేకమంది ప్రజల భావాలూ, హృదయాలూ కలిసిన ఒక సమిష్టి సమాజం. నలభై శతాబ్దాలుగా మనకు సంక్రమించిన విజ్ఞానం, ప్రేమ, త్యాగం–ఇవే విదేశాలకై నా–ముఖ్యంగా మనదేశానికి – తలమానికంగా వుండేవి. పునాదుల్ని కదల్చ వీలులేని ఆ మహోన్నత ఆదర్శ గుణాలు మన హృదయాలలో ప్రతిబింబించేంతకాలము మన భవిష్యత్తుకు ఎట్టి విపత్తూ లేదు."

జై హింద్.

---

దేశాభిమానం నాకు కలదని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని ఏదైనాను ఒక మేల్
కూర్చిజనులకు చూపవోయ్

గురజాడ–

# కొత్తదృక్పథం అవసరం

జె. వి. నరసింగరావు



ఇప్పటి తెలంగాణా పరిస్థితి ఏ విధంగా ఉత్పన్నమైనదీ అందరికీ తెలుసు. ఈ పరిస్థితిని ఉద్దేశపూర్వకంగా ఎవరో కల్పించారని నేను అనుకోవడం లేదు. కాని, ప్రేరణ లేకుండావే ఉత్పన్నమైన పరిస్థితిని స్వప్రయోజనాలకు వినియోగించుకోవడానికి ప్రయత్నించారు. అసంతృప్తి జెందిన వారందరూ ఏకమై దీని కొక రూపం కల్పించారు. పరస్పర విరుద్ధమైన భావాలూ, సిద్ధాంతాలూ కలిగిన ధనికులు, అధికారంలో వున్నవారికి వ్యతిరేకంగా తమలో అణగివున్న భావాలను వెల్లడించుకునే తలంపుతో కలిసి, ఒక నినాదం యిచ్చారు. ఇదివరలో అనేక ఉద్యమాలు ప్రారంభించబడినవి. అయితే వాటికొక సిద్ధాంతం, ప్రాతిపదిక వుండేవి. కాని దీని విషయంలో అటువంటిదేదీ వున్నట్లు కన్పించదు. కొంతమంది ప్రజలు దీనిలో ఏదోవిధంగా చేరారు. తరువాత తమ చర్యను సమర్థించుకునేందుకు ఫలానావారు యిలా చేశారనీ, మేము ఇలా చేస్తున్నామనీ అనడం సాగించారు. ఇటువంటి ఉద్యమం ప్రపంచ చరిత్రలోనే కనీ, వినీ, ఎరుగనటువంటిది.

## పెద్దమనుషుల ఒప్పందం

పెద్ద మనుషుల ఒప్పందాన్ని ఉల్లంఘించడం దీనికి ముఖ్య కారణమని అంటున్నారు. ఈ ఒప్పందంమీద నేనుకూడా సంతకం చేశాను. దురదృష్టవశాత్తు ఇటువంటి ఒప్పందం ఒకటి జరగాలని భావించినవారిలో నేను ఒకణ్ణి. ఈ తప్పుకు నేనూ బాధ్యుణ్ణే.

ఎందుచేతనంటే ఎటువంటి రక్షణలు కానీ, ఒప్పందాలు కానీ లేకుండానే తమ తమ భాషా రాష్ట్రాలతో కలిసిపోయిన పూర్వ హైదరాబాదు రాష్ట్రంలోని కర్నాటక, మహారాష్ట్ర ప్రాంతాలకు చెందిన మన మిత్రులు, మన సహచరులు మనకంటే మంచి స్థితిలో వున్నారు. దీనికి కారణం వారు మనకంటే తెలివైనవారు కావడం కాదు. వారు ఆయా రాష్ట్రాలలో భారత పౌరులుగా చేరిపోవడమూ, ఇతర పౌరులతో సమానావకాశాలు పొందడానికి ప్రయత్నిస్తుండడమే యిందుకు కారణం. కాని ఇక్కడ ప్రత్యేకమయిన పరిస్థితులలో మనం ఒప్పందం కొరకు పట్టు పట్టాము. ఆ పరిస్థితులు ఏర్పడడానికి కొంతవరకు బాధ్యులైనవారిలో నేనూ ఒకణ్ణని ఒప్పుకుంటున్నాను. వెనుకబడినతనం మొదలగు కారణాల చేతకాక, ఇక్కడ మిశ్రమ సంస్కృతి వుండడంచేతనూ, ఉత్తర దక్షిణ దేశాల సంస్కృతులకు యిది సంగమ స్థానం కావడంచేతనూ నేనూ, నా సహచరులు కొందరూ ఆ సమయంలో హైద్రాబాదు రాష్ట్రాన్ని విభజించకుండా యథాతథంగా వుంచేటట్లు ప్రయత్నించాలని అనుకున్నాము. వివిధ భాషలు మాట్లాడుతూ సమైక్య దృష్టి కలిగిన ప్రజలు ఇక్కడ వుంటుండేవారు. మనతో కలిసిపోయిన ఇతర ప్రాంతాల వారికంటే మనం మంచి స్థితిలో వున్నామని నేను అప్పుడప్పుడు అనుకుంటుండేవాణ్ణి. ఈ దృష్టితోనే నేను హైదరాబాదు రాష్ట్రాన్ని యథాతథంగా వుంచడంలో తప్పేమీ లేదని అనుకున్నాను. కాని స్వామీ రామానందతీర్థ మార్గదర్శకత్వంలో అనేక మంది మిత్రులు ప్రజాస్వామిక వ్యవస్థలో, ప్రజల ఆకాంక్షలను ప్రభుత్వం అర్థం చేసుకోవడానికీ, ప్రభుత్వ కార్యకలాపాలను ప్రజలు అవగాహన చేసుకోవడానికి వీలుగా భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఉండి తీరాలని అభిప్రాయపడ్డారు. సదుద్దేశంతో దేశ కాల పరిస్థితులకు అనుగుణంగా నడుచుకోవాలన్న ఆలోచనతోనే వారు ఆ విధంగా అభిప్రాయపడ్డారు. ఆ లక్ష్యం తోనే మేము చివరకు తగ్గాము. కాని మేము పట్టుదల చూపడం వల్ల ఫజల్ అలీ కమీషను కండ్ల తుడుపుగా ''అవశిష్ట హైదరాబాదు''ను ప్రత్యేక ప్రాంతంగా వుంచవచ్చునని పేర్కొన్నది. పొరుగున వున్న ఆ యా భాషా రాష్ట్రాలకు చెందిన కొన్ని తాలుకాలూ, బీదరూ ఈ ప్రాంతంలో చేర్చబడినవి. కనుక అది తెలంగాణాకు మాత్రమే పరిమితమై లేదు. మన అపోహాలు, సంశయాలు తొలిగి పోయేవరకూ అయిదు సంవత్సరాలపాటు ''అవశిష్ట హైదరాబాదు'' ను ప్రత్యేక ప్రాంతంగా వుంచవచ్చునని ఫజల్ అలీ కమీషను సిఫార్సు చేసింది. అది ప్రాతిపదిక మాత్రమే. ఈ కమిషను విదర్భకు ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తిని యివ్వాలని సిఫార్సు చేయగా తెలంగాణా విషయంలో ఆ విధంగా సిఫార్సు చేయలేదు.

## తెలంగాణా ప్రాంతీయ సంఘం

రాష్ట్రాల పునర్నిర్మాణ సంఘం నివేదిక ప్రచురించబడినప్పుడు మేము, ఈ ప్రాంతములో నివసిస్తున్న ప్రజలకువున్న అపోహలను, సంశయాలను కొంతవరకైనా నివారించడం కొరకు ఏదైనా చర్య తీసుకోవాలని అనుకున్నాము. విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా పనిచేస్తున్న నా మిత్రుడు ఒకరు, స్కాట్లండ్ పద్ధతిలో ఒక విధమైన స్వయంపాలన ప్రతిపత్తి కోరవచ్చునని సలహా యిచ్చారు. నేను ఢిల్లీ వెళ్ళి, మాకు ఒక విధమైన అటానమీ వుండితీరాలనీ, కొన్ని విషయాలను చూచే బాధ్యత కేవలం మా ప్రతినిధులకు మాత్రమే అప్పగించాలనీ విజ్ఞప్తి చేశాను. కాని వారు అందుకు సమ్మతించలేదు. ఒక విధమైన రాజీ కుదిర్చారు. తెలంగాణా కొరకు ఒక ప్రాంతీయ సంఘాన్ని నెలకొల్పడానికీ కొన్ని విషయాలను మాత్రమే దానికి అప్పగించడానికీ వారు నిశ్చయించారు. విద్య, ప్రజారోగ్యం, మునిసిపల్ పరిపాలన యింకా కొన్ని యితర సాధారణ విషయాలు ఈ సంఘానికి అప్పగించబడినవి. మేము కోరిన దానికంతటికీ వారు సమ్మతించలేదు. ప్రాంతీయ సంఘం పరిధిలో ఎక్కువ విషయాలను చేర్పించడంకోసం అప్పటి సంయుక్త కార్యదర్శి శ్రీ హరిశర్మతో నేను ఎంతో గట్టిగా వాదించవలసి వచ్చింది. కాని ఈ ప్రయత్నంలో పూర్తిగా పరాజయం పొందాను. అప్పుడు హైద్రాబాద్ లో వున్న మిత్రుడు డా. చెన్నారెడ్డిగారిని నేను ఢిల్లీ కి కూడా పిలిపించాను. కాని మేము ఉభయులమూ మా ప్రయత్నాలలో విఫలులమయ్యాము. కడపటికి కొన్ని విషయాలను మాత్రమే ప్రాంతీయ సంఘానికి అప్పగించడం జరిగింది, ద్వంద్వ విధానం నమూనాలో ఏదైనా జరిగితే బాగుంటుందని మేము ఆశించాము. కాని ప్రాంతీయ సంఘానికి కొన్ని అధికారాలను యిచ్చి దాన్ని సలహా సంఘమని పిలవడ ఏమంత గొప్ప విషయంకాదు. అయినప్పటికీ తెలంగాణా పట్ల మా అభిప్రాయాలను వెల్లడించడానికి ప్రాంతీయ సంఘం మాకు వీలు కల్పించగలదని అనుకున్నాము. ఈ విధంగా ప్రాంతీయ సంఘం అవతరణ జరిగింది. ఇది స్వతంత్ర సంస్థకాదు. ఇది శాసనసభ యొక్క ఉపసంఘం మాత్రమే. తెలంగాణాకు చెందిన శాసన సభ్యులు మాత్రమే ప్రాంతీయ సంఘం సభ్యులుగా వుంటారు ప్రాంతీయ సంఘం రాష్ట్ర శాసన సభయొక్క కమిటీ అయిన కారణంచేత దీని చర్చ వివరాలను పత్రికలకు కానీ, ప్రజలకు కానీ వెల్లడిచేయరు. తనకు కేటాయించిన అంశాలను మాత్రమే యిది చేపట్టుతుంది. కాని కాలక్రమేణా ప్రాంతీయ సంఘం విద్యుచ్ఛక్తి, సేద్యపు నీటిపారుదలతో సహా దాదాపు అన్ని అంశాలను చర్చించడం ప్రారంభించింది. కాని అప్పుడు మేము, ప్రాంతీయ సంఘం సలహా సంఘం కనుక తన పరిధిలో లేనటువంటి అంశాలను అది చర్చించినట్లయితే అందుకు ఆక్షేపణ వుండనవసరం లేదనీ యింతమాత్రపు సడలింపును ఇవ్వ వచ్చుననీ అనుకున్నాము. ఈ విధంగా ప్రాంతీయ సంఘం సర్వీసెస్, యిరిగేషన్ తదితర అంశాలపై తమ నివేదికలను పంపడం ప్రారంభించింది. కాని న్యాయ శాస్త్రరీత్యా యిది సరిఅయిన చర్య కాదు.

## తెలంగాణా ఆదాయం

తెలంగాణాకు సంబంధించిన ఆదాయాలన్నింటినీ తెలంగాణా ప్రాంతంలో మాత్రమే ఖర్చు పెట్టాలన్నది కూడా పెద్దమనుషుల ఒప్పందంలోని షరతులలో ఒకటి. తెలంగాణా వెనుకబడిన ప్రాంతం. ఇటువంటి ప్రాంతానికి చెందిన మనం మా డబ్బును కేవలం మా కొరకే ఖర్చు పెట్టుకుంటామని అనడాన్ని ప్రజలు అర్థం చేసుకో లేకపోవచ్చు. ఆంధ్ర ప్రాంతంలో మద్య నిషేధం అమలులో వుండగా తెలంగాణాలో లేదు. అప్పట్లో తెలంగాణాలో అబ్కారీ ఆదాయం రూ, 8 కోట్లు మొదలు రూ. 10 కోట్ల వరకు వుండేది ఇప్పుడది 15 కోట్లకు పెరిగింది. తెలంగాణాలో మద్యనిషేధాన్ని ప్రవేశపెట్టేవరకు కానీ, లేక ఆంధ్ర ప్రాంతంలో మద్యనిషేధాన్ని ఎత్తివేసేవరకు కానీ తెలంగాణా ప్రాంతంలోని ఆదాయాలనన్నింటినీ యిక్కడనే వెచ్చించడం లాభసాటిగా వుండగలదని మేము అనుకున్నాము. మేము పరిశీలించిన అంశం అదొక్కటే. అప్పట్లో మాకెవ్వరికీ ఆర్థిక విషయాలు తెలియవు. దీనిని ఏ విధంగా లెక్కకట్టవలెనో, ఏ పద్ధతిలో అంచనా వేయవలెనో మాకు తెలియదు. "తెలంగాణా ఆదాయాల నన్నింటినీ ఇచ్చటనే ఖర్చు చేయాలి" అని మాత్రమే ఒప్పందంలో వ్రాసుకున్నాం.

ప్రాంతీయ సంఘం పని చేయడం ప్రారంభించింది. నివేదికలు పంపుతూ వుంది. రెండవ ప్రణాళిక చివరినాటికి తెలంగాణా మిగులు నిధులలో నుంచి దాదాపు రూ. 22 కోట్ల మొత్తాన్ని తెలంగాణా అభివృద్ధి కొరకు ఖర్చు పెట్టారు, ఇతర నిలువలు వున్నాయి.

## సర్వీసులు

తెలంగాణా ప్రాంతంలో, రూ. 300ల వరకు జీతం లభించే ఉద్యోగాలలో కేవలం తెలంగాణా ప్రాంతానికి చెందినవారిని మాత్రమే నియమించాలన్న మరో నిబంధన కూడా పెద్దమనుషుల ఒప్పందంలో వుంది, తెలంగాణాలో విద్య తక్కువ కాబట్టి ప్రతి ఉద్యోగానికీ బహిరంగ పోటీ వుండేటట్లయితే తెలంగాణా వారికి ఉద్యోగావకాశాలేవీ వుండక పోవచ్చునన్న ఉద్దేశంతో ఈ ఏర్పాటు చేసుకొనబడింది. అయితే ఆ సమయంలో కూడా తెలంగాణా ప్రజలు విద్యారంగంలోనైతం ఎల్లప్పుడూ చాలా వెనుకబడిన వారుగానే వుంటారన్న న్యూనతా భావం నాకు లేదు. ఐదు సంవత్సరాలపాటు మాత్రమే ఈ ఏర్పాటు వుండాలని మేము అన్నాము. నిమ్నజాతులు, నిమ్నతెగలవారికి పది సంవత్సరాలు యిచ్చారు కనుక మాకు అయిదు సంవత్సరాలు చాలుననుకున్నాము. కొంతమంది మిత్రులు చెప్తున్నట్లు యిది శాశ్వతమైన ఏర్పాటుగా ఉద్దేశించబడలేదు. రక్షణలులేవు కాబట్టి "ముక్తి" లేదనీ, కనుక అధోగతి తథ్యమనీ అనడం సరికాదు. ఈ విధమైన న్యూనతా భావం నాకు ఎప్పుడూలేదు. తెలంగాణా ప్రజలు నిమ్నజాతులవారికంటే వెనుకబడినవారనీ, నిమ్నజాతులవారికి 10 సంవత్సరాల వరకు రక్షణలను యివ్వగా తెలంగాణావారికి 5 సంవత్సరాలు

మాత్రమే యిచ్చినారనీ నేను ఎప్పుడూ అనుకోలేదు. కర్నాటకం లోనూ, మహారాష్ట్రంలోనూ చేర్చబడిన ప్రాంతాల వారెవ్వరూ ఎటువంటి రక్షణలనూ కోరలేదు. రక్షణలను ప్రారంభంలో అయిదు సంవత్సరాల కొరకు ఉద్దేశించారు. తరువాత వాటిని మరో అయిదు సంవత్సరాలపాటు పొడిగించాలన్నారు. ఒప్పందా న్ననుసరించి ప్రభుత్వం రక్షణలను పొడిగించింది. అది మొదటి పొడిగింపు. ఆ గడువు 1969 మార్చిలో ముగిసింది. రెండవ సారి కూడా రక్షణలను మరికొంత కాలంపాటు పొడిగించాలన్న ఆత్రుత చూపించారు. ఆందోళన ప్రారంభం కావడానికి పూర్వమే రక్షణలను మరో అయిదు సంవత్సరాల వరకు పొడిగించాలని మేము భారత ప్రభుత్వానికి సిఫార్సు చేశాము.

## మిగులు నిధులు

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారి నాయకత్వాన రాష్ట్రంలో కొత్త ప్రభుత్వం ఏర్పడిన వెంటనే, రక్షణలు ఎంతవరకు అమలు పరచబడుతున్నదీ, తెలంగాణా మిగులు నిధుల పరిస్థితి ఏమిటీ అనే అంశాలను ఆలోచించారు. ఈ మంత్రివర్గంలో నేనూ వున్నాను ప్రాంతీయ సంఘం కూడా చురుకుగా పని చేసింది. ఇదివరలో అనేక నివేదికలు పంపుతూ వచ్చింది. కాని ఈసారి మేమందరం కలిసి, మిగులు నిధులను నిర్ధారించి ఖర్చు పెట్టడం కొరకు ప్రయత్నించాము.

మన ఆర్థికశాఖ మిగులు నిధులను రూ 30.54 కోట్లకు అంచనా వేసింది. ఎవ్వరు కూడా వ్రేలెత్తి చూపించక పూర్వమే, ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని గురించి ఎవ్వరూ ఆలోచించక పూర్వమే, మమ్ములను నిందించాలని ఎవ్వరూ అనుకోకపూర్వమే 1968 నవంబరు నెలలోనే— ఉభయ శాసన సభల సంయుక్త సమావేశంలో గవర్నరు చేసిన ప్రసంగంలో మిగులు నిధులకు సంబంధించిన ఈ మొత్తాన్ని గురించి పేర్కొనడం జరిగింది ఈ ప్రకారం మేము మిగులు నిధులను రూ. 30.54 కోట్లకు నిర్ధారించి, ఈ మొత్తాన్నంతటినీ నాలుగవ ప్రణాళికా కాలంలో ఖర్చు పెట్టడం జరుగుతుందని చెప్పడంద్వారా గతంలో అమలు జరుగని దానిని యిప్పుడు అమలు జరిపడానికి కృషిచేశాము. ఈవిధంగా మొదటి సారిగా మిగులు నిధులు అంచనా వేయబడినవి. ఇవి నాలుగవ ప్రణాళికలో ఖర్చుపెట్టబడగలవని వాగ్దానం కూడా చేయబడింది. ఆందోళన ప్రారంభం కావడానికి ముందే యిదంతా జరిగిందనే విషయం గమనించాలి.

## రిజర్వు చేసిన ఉద్యోగాలు

తెలంగాణా ప్రజల కొరకు ప్రత్యేకించబడిన ఉద్యోగాలలో ఎంతమంది ఆంధ్ర ప్రాంతీయులు పనిచేస్తున్నారో అంచనా వేయ డానికి ఎవ్వరూ ప్రయత్నించలేదు. దీనిని అంచనా వేయించింది కూడా ఈ ప్రభుత్వమే, మేము అవసరమైన వివరాలను సేకరించి తెలంగాణాలో 1,07, 538 ఉద్యోగాలు వుండగా వాటిలో 4,538 ఉద్యోగాలలో ఆంధ్రప్రాంతానికి చెందిన వారు పనిచేస్తున్నట్లు తెలుసుకున్నాము. ఎవ్వరూ వ్రేలెత్తిచూపక ముందే, తెలంగాణా వారి కోసం ఉద్దేశించబడిన ఉద్యోగాలలో పనిచేస్తున్న ఆంధ్ర ప్రాంతీయుల స్థానే తెలంగాణా వారిని మూడు నెలలలోగా నియమించాలని 1968 జూలైలో ఉత్తర్వు జారీచేశాము. గతంలో నిర్లక్ష్యం చేయబడిన దానిని సరిదిద్దడానికీ, ఈనాడు ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న మిత్రులు చేసిన నిర్లక్ష్యాన్ని సరిదిద్దడానికి మేము ప్రయత్నించడం తప్పా? పొరపాట్లు జరిగితే సరిచేసు కోవాలని మేము అన్నాము. పైన తెలిపినటువంటి ఉద్యోగులలో 1,600 మంది ఉపాధ్యాయులున్నారు. తెలంగాణా వారైన జిల్లా పరిషత్తు అధ్యక్షులే వారిని తాత్కాలికంగా ఎన్నిక చేశారు. ఆరోగ్య శాఖలో పనిచేస్తున్న నర్సులు తదితరులు 1,800 మంది వున్నారు. కేరళకు చెందిన నర్సులు కాశ్మీర్ మొదలు కన్యాకుమారి వరకు అంతటా కనిపిస్తారు. ఢిల్లీ ఆసుపత్రుల్లో మూడింట ఒక వంతు మంది నర్సులు కేరళవారే, కాని కేరళ నర్సులు తెలంగాణాలో పనికిరాలేదు! కొంత మంది ప్రజలూ, ఆందోళనకు నాయకత్వం వహిస్తున్న వారిలో కనీసం ముగ్గురు నలుగురైనా తప్పుడు ముల్కీ సర్టిఫికెట్లు యిచ్చారు. సర్టిఫికెట్ల జారీకి సంబంధించి శాసనసభలో ప్రశ్న అడిగారు. ఆ సందర్భంలో వారిపేర్లు బయటికి వచ్చాయి.

## గోరంతలను కొండంతలుగా చిత్రించారు

ఒకే పార్టీలో అనేక పార్టీలు లేక వర్గాలు వుండవచ్చు, అపోహలూ వ్యక్తిత్వాలమధ్య ఘర్షణలూ వుండవచ్చు. కాని యివన్నీ ఆ పార్టీ అంతరంగిక విషయాలుగా మాత్రమే వుండాలి. ప్రజలను వాటిలోనికి లాగ కూడదు. వర్గవైరుధ్యాలకు ప్రజలను గురిచేయ కూడదు. ఈవిధమైన అంశాల నన్నింటినీ ఫిర్యాదులుగా రచ్చకీడ్చడం జరిగింది. అనేక కరపత్రాలు జారీ చేయబడినవి. ప్రతిచోటా అను మానాస్పదమైన వాతావరణాన్ని కల్పించారు "అవును, నిజమే అన్యాయం జరిగింది" అని ప్రజలు అనడం మొదలు పెట్టారు, జరిగిన అన్యాయమేమిటో నాకు అర్థంకావడం లేదు, ఇది గోరంత లను కొండంతలుగా చేసి చెప్పడం తప్ప మరొకటి కాదు.

## అఖిల పక్ష సమావేశం

మన ముఖ్య మంత్రి నిజమైన గాంధేయవాదిగా జరిగిన లోపాలను ఒప్పుకొని పరస్పర విరుద్ధమైన దృక్పథాలు కలిగిన ప్రజా ప్రతినిధులనందరినీ చర్చలకొరకు ఒక చోట సమావేశ పరి చారు. పొరపాట్లను సరిదిద్దడానికి ముఖ్యమంత్రి వాగ్దానంచేశారు. పొరపాటను ఒప్పుకోవడం జరిగింది కాబట్టి "మీ నేరాలను మీరు ఒప్పేసుకున్నా"రంటూ నిందించారు. తాను కాక తనకంటే పూర్వం అధికారంలో వున్నవారు చేసిన పొరపాట్లను అంగీకరించడం తప్పా? దీనిని గురించి హైకమాండ్ సభ్యుడు ఒకరు నన్ను కొన్ని ప్రశ్నలు అడిగినప్పుడు "అయ్యా మాకు పూర్వం వున్న వారు చేసిన పొరపాట్లకు మేము ప్రాయశ్చిత్తం చేసుకొంటున్నాము, మేమేమి తప్పుచేయలేదు." అని నేను బదులు చెప్పాను. మేము మిగులు నిధులను అంచనా వేయించి ఆ మొత్తాన్ని తెలంగాణా ప్రాంతంలో నాలుగవ ప్రణాళికలో ఖర్చుపెట్టడానికి వాగ్దానంచేశాము. ఉద్యోగాల విషయంలో కూడా ఈ విధంగానే చేశాము.

ప్రభుత్వం అవిచ్ఛిన్నంగా కొనసాగేటటువంటిది. మా బాధ్యతను మేము తప్పించుకొన జూడలేదు. పొరపాట్లను ఒప్పుకున్నాము.

## మిగులు నిధుల అంచనా

మిగులునిధులను లెక్కగట్టే పద్ధతి విషయంలో కొంత వివాదం వున్న దృష్ట్యా ఈ మొత్తాన్ని నిర్ధారించడం కొరకు స్వతంత్ర ప్రతిపత్తిగలవారిని నియమించడానికి 1969 జనవరి 19వ తేదీన జరిగిన అఖిల పక్షసమావేశంలో అంగీకారం కుదిరింది. దీనిననుసరించి ఆడిటర్ జనరల్ ప్రతినిధి ఒకరు ఇచ్చటికి వచ్చి తమ నివేదికలో మిగులు నిధులను రూ 34.10 కోట్లకు నిర్ధారించారు. ఇది కుమార్ లలిత్ నివేదిక అని వ్యవహరించబడుతున్నది. తుదకు మిగులు నిధులను గురించి పరిశీలించడం కొరకు సుప్రీం కోర్టు న్యాయ మూర్తి శ్రీ వి. భార్గవా అధ్యక్షతన ఒక సంఘం నియమించబడింది. మిగులు నిధులను రూ. 100 కోట్లకు తేల్చినప్పటికి దానిని అంగీకరించడానికి మేము సిద్ధంగా వున్నాము. ఇద్దరు సోదరుల మధ్య అభిప్రాయ భేదం ఏర్పడినప్పుడు ఆ విషయాన్ని మూడవ వ్యక్తికి నివేదించడం సహజం. మొదట్లో మేము మిగులు నిధులు అంటే రెవెన్యూ మిగులు అని మాత్రమే అనుకున్నాము. కాని తరువాత దీని అర్థాన్ని విస్తృతీకరించారు. ప్రజలు సందేహాలు వెలిబుచ్చడం ప్రారంభించారు. లోతుకు వెళ్ళకుండా వందకోట్లు అడిగినట్లయితే కనీసం యాభై కోట్లయినా వచ్చి తీరుతాయన్న ఆలోచనతో వ్యవహరించారు. మిగులు నిధుల విషయంలో పొరపాటు ఉద్దేశ పూర్వకంగా జరుగలేదు. నిధులను ఎవరో మళ్ళించడం వంటిది కాదది. అది పొరపాటు అభిప్రాయం. రెవెన్యూ మిగుళ్ళ తరువాత, లోటు బడ్జెట్లు వుంటున్నాయనీ, ఆంధ్రప్రాంతంలో చూపించిన లోటు మొతంలో 50 శాతం లోటు మొత్తాన్ని తెలంగాణాలో ఖర్చు చేసివుండవలసిందనీ, ఆ విధంగా ఖర్చుచేయ్యని మొత్తం కూడా మిగులులో చేరుతుందనీ అన్నారు. ఈ వాదాన్ని మేము కాదనలేదు. ఇద్దరు సోదరులమధ్య వివాదం వున్నప్పుడు సుప్రీం కోర్టు న్యాయ మూర్తి కంటే తక్కువ హోదా కలిగిన వారెవ్వరూ వివాదాన్ని పరిష్కరించరాదని మాత్రమే మేము అన్నాము. మిత్రులు వివిధ అభ్యంతరాలు తెలుపకుండా వున్నట్లయితే ఆయన తన తీర్పుచెప్పి పరిష్కారం చేసివుండేవారు. సమస్య పరిష్కారం కాకుండా ఎప్పుడూ రగులుతూవుంటే కొంతమందికి ఆనందంగా వుంటుంది. కనుక న్యాయమూర్తి భార్గవా తమ నివేదికను అందజేయడానికి సిద్ధంగా వున్న సమయంలో కొంతమంది ఆయన విచారణ జరిపే అంశాలను విస్తృతీకరించాలని కోరారు. మిగులు నిధులను తేల్చి చెప్పే వరకూ మేము నిరీక్షిస్తూ ఊరకుండదలచలేదు. జరిగే ఆలశ్యాన్ని ఆసరాగా తీసుకోలేదు. ఈ సంవత్సరం రూ. 9 కోట్లు ఖర్చు పెట్టదలచాము. ప్రతి జిల్లాకూ కోటి రూపాయల చొప్పున కేటాయించాము. ఈ యేడాది పథకాలను సిద్ధపరచాము. కొన్నింటిని చేపట్టడం, డబ్బు ఖర్చు పెట్టడం జరుగుతున్నది. 5 సంవత్సరాల పాటు సంవత్సరానికి రూ. 9 కోట్ల చొప్పున ఒక అంకెను పరోక్షంగా మేము ఒప్పుకున్నాము. ఇక ఉదాహరణకు అమ్మకంపన్ను సంగతి చూద్దాము. అమ్మకం పన్ను యిచ్చట చెల్లింపబడుతుండగా ప్రొక్యూరుమెంటు ఆంధ్రప్రాంతంలో జరుగుతున్నది. ప్రొక్యూరుమెంటు నిష్పత్తిని బట్టి అమ్మకం పన్ను మొత్తాలను ఉభయ ప్రాంతాల మధ్య పంపిణీచేయాలని ఆంధ్ర సోదరులు అంటున్నారు. ఇలా చేయడం సమంజసం కాదా? అది తప్పవికానీ, ఒప్పని కానీ నేను అనను. ఏది ఏమైనప్పటికీ వివాద గ్రస్తమైన అంశాన్ని పరిష్కరించడానికి సంఘం వుంది. కొన్ని లోపాలు ఏవైనా వున్నట్లయితే ఆ అంశాలన్నింటినీ సర్దుబాటు చేయడానికి న్యాయమూర్తి భార్గవా తీర్పు తోడ్పడుతుంది.

## రక్షణలు

ఉద్యోగాలకు సంబంధించిన రక్షణలను సంధికాలమైన అయిదు సంవత్సరాల కొరకు ఉద్దేశించారు. ఒక సారి యివి పొడిగించబడినవి. రెండవ సారి పొడిగించడానికి కూడా సదుద్దేశంతో భారత ప్రభుత్వానికి మేము సిఫార్సు చేశాము వారు ఈ విషయంలో శాసనం కూడా చేశారు. ఆందోళన ప్రారంభం కావడానికి ముందే పొడిగింపును కోరాము. తరువాత, తెలంగాణా ఉద్యోగాలలో పనిచేస్తున్న ఆంధ్రప్రాంతీయులైన ఉద్యోగస్థులందరినీ మూడు నెలలలోగా ఆంధ్రప్రాంతానికి పంపించి వేయాలని అన్నాము.

ఈలోగా ఆందోళన ప్రారంభమైంది. ఆంధ్ర మిత్రులు కూడా "న్యాయస్థానానికి వెళ్ళడం మంచిదని" అనుకున్నారు. ఎవ్వరూ వారిని ఆపలేక పోయారు. సింగిల్ జడ్జి ఒక తీర్పు చెప్పారు. దానిమీద మేము వూరుకోలేదు అదేరోజు డివిజను బెంచినుంచి స్టే ఆర్డరు పొందాము. మా చిత్తశుద్ధిని తెలుసుకోవడానికి యిదే ప్రబల తార్కాణం. డివిజను బెంచి యిచ్చిన తీర్పు మాకు అనుకూలంగా వుంది. అయితే కొన్ని సూపర్‌న్యూమరరీ ఉద్యోగాలను సృష్టించాలని వారు సూచించారు. తెలంగాణా ఉద్యోగాలలో పనిచేస్తున్న ఆంధ్రప్రాంతీయులందరినీ 1969 ఫిబ్రవరి నెలాఖరులోగా వారి ప్రాంతానికి పంపించివేయాలని జనవరి 19 వ తేదీన జరిగిన ఒడంబడికలో పేర్కొనడం వారిని పరాయి దేశస్థులుగా భావించినట్లవుతుంది. యిది మంచిదికాదు. నేను యిదివరకే అన్నట్లు సమాధానం కుదుర్చుకోవాలని వారందరూ ఒకచోటచేరి ఏకాభిప్రాయాన్ని సాధించడానికి ప్రయత్నంచేస్తే యిలాంటివి జరగడం తప్పనిసరి. ఈ విషయం సుప్రీంకోర్టుకు వెళ్ళింది. రాజ్యాంగం ప్రకారం, రిజర్వేషన్ను మొత్తం రాష్ట్రంలోని ప్రజలకు వర్తింప జేయవచ్చునేగాని, రాష్ట్రంలోని ఒకభాగంలో నివసిస్తున్న వారికి మాత్రమే వర్తింపజేయ వీలులేదని సుప్రీంకోర్టు పేర్కొన్నది. మా మట్టుకు మేము శాయశక్తులా ప్రయత్నించాము. ఇలా జరుగుతుందని మాకు తెలుసు. రక్షణల సంగతి ఏమైనప్పటికీ ఏదైనా పరిపాలనా సంబంధమైన చర్యను గురించి ఆలోచించాలని మేము యోచనచేశాము. రాజ్యాంగాన్ని సవరించడానికి వీలుంటుందో లేదో పరిశీలించవలసిందిగా భారత ప్రభుత్వాన్ని కోరాము. రక్షణలు తాత్కాలికమైనవైనప్పటికీ, తెలంగాణాలోని మా మిత్రుల మానసిక సంతృప్తికోస

మైనా రాజ్యాంగాన్ని సవరించి అవసరమైతే రక్షణలకు కొంత మటుకు శాశ్వత ప్రతిపత్తి కల్పించటం మంచిదని మేము అనుకున్నాము. ఇందుకోసం. సుప్రీంకోర్టు రిటైర్డ్ ఛీఫ్ జడ్జి న్యాయమూర్తి వాంఛూ అధ్యక్షతన ఒకసంఘం నియమించబడింది. శ్రీ సెతల్వాడ్, న్యాయశాఖ కార్యదర్శి ఈ సంఘం సభ్యులుగా పనిచేశారు రాజ్యాంగాన్ని సవరించడం సాధ్యంకాదనీ, పరిపాలనా సంబంధమైన చర్య తీసుకోవచ్చుననీ ఈ సంఘం నివేదించింది. న్యాయమూర్తి భార్గవా నిర్ధారించవలసివున్న మిగులు నిధుల కొరకు వేచివుండనక్కర్లేదని మేము వాంఛూ సంఘం నివేదిక కోసం కూడా వేచివుండలేదు నివారణ చర్య గైకొనడానికై మేము ముందుకు సాగిపోయాము. ఆంధ్రప్రాంతానికి చెందిన ఉపాధ్యాయులు 1600 మంది వున్నారు. వారి చిరునామాలు తెలుసుకున్నాము. ఉద్యోగి జీతానికీ, సీనియారిటీకి దెబ్బతగలకుండా అతని స్వంతజిల్లాలో ఉద్యోగం చూపించినట్లయితే దాని నతడు సంతోషంతో స్వీకరించగలడన్న విశ్వాసంతో మేము ఆ యా జిల్లాలలో ఉద్యోగాలు కల్పించాము. 1600 మంది ఉపాధ్యాయులలోనూ 1200 మందిని అప్పుడే ఈ విధంగా నియమించడం జరిగింది. మిగతా 400 మంది విషయంలో యిలాంటి చర్య గైకొనబడుతున్నది. ఈ అవకాశాన్ని వినియోగించుకొని వారుకూడా వెళ్ళడం జరుగవచ్చు. ఈ చర్య చట్ట వ్యతిరేకమైనది కాదు. రాజ్యాంగ విరుద్ధమైనదీ కాదు. ఉద్యోగిని రాష్ట్రంలో ఎచ్చటికైనా బదిలీ చేయవచ్చు. నర్సుల విషయంలో వారిని మేము పంపించి వేయదలచుకోలేదు మన నర్సులు శిక్షణపొందేవరకూ రోగులను బ్రతికించమని దేవుని ప్రార్థించలేము. ఈ 4,000 ఉద్యోగాలను గురించి ప్రజలు బాధపడ్డారు. మేము అదనంగా ఉద్యోగాలుకల్పించాం. ఈ ఉద్యోగాలన్నింటికీ జిల్లాస్థాయిలో రిక్రూట్మెంటు జరిపించాము. యిది పరిపాలనా సంబంధమైన చర్య. ఉపాధ్యాయులను జిల్లా పరిషత్తులు నియమించాయి. ఇప్పటికీ ఈఉద్యోగాలకు ఆయాజిల్లా పరిషత్తులు అభ్యర్థులను ఎన్నికచేసాయి. జిల్లాస్థాయిలో, రూ.300ల వరకు జీతం కలిగిన పబ్లిక్ సర్వీసు కమీషను పరిధిలోని ఉద్యోగాలను, భర్తీచేయడంకొరకు యిప్పుడు జిల్లా కలెక్టర్ల పరం చేయడం జరిగింది. తెలంగాణాప్రాంతంలో అదనంగా కల్పించబడిన 2000 ఉద్యోగాలకూ సెలక్షను పూర్తయ్యాయి. చాలా వెనుకబడిన జిల్లా అయిన ఆదిలాబాదులో సైతం అప్పుడే 210 మందికి ఉద్యోగాలు లభించాయి. ఈ విధంగా ఈ సమస్య సంతృప్తికరంగా పరిష్కరించబడింది.

## ఉద్యోగాలలో వ్యత్యాసాల తొలగింపు

ఉద్యోగాల మధ్య వ్యత్యాసాలను తొలగించి వాటిని సమానం చేయడం మన ఒప్పందంలో భాగంకాదు. ఈ విషయంలో కొన్ని పొరపాటుజరిగాయి. వివిధప్రదేశాలకు, విభిన్న అధికార పరిధులకు, వేరు వేరు జీతపుస్కేళ్ళకు, ఉద్యోగ పరిస్థితులకుచెందిన వ్యక్తులు కలిసినప్పుడు సమస్యలను పరిష్కరించడం కష్టసాధ్యమవుతుంది. ఉద్యోగాలమధ్య వ్యత్యాసాలను తొలగించి వాటినిసమానం చేయడానికి సంబంధించిన సమస్య మహారాష్ట్ర, మైసూరులలో కూడావుంది. మైసూరులో యింకా అయిదు శాఖలలో ఈ పని జరుగవలసివుంది. మహారాష్ట్రలో సైతం యిటువంటి పరిస్థితే వుంది.

"గతంలో ఏమి జరిగినప్పటికీ యిప్పుడు సర్వీసులకు సంబంధించిన అంశాలను మనం సుప్రీంకోర్టు న్యాయమూర్తికి అప్పగించాలి. అందరూ తమకేసులను ఆయనకు నివేదించుకోనివ్వండి. న్యాయమూర్తి తమ తీర్పు చెప్పనివ్వండి" అని మేము అన్నాము.

అప్పుడు న్యాయశాస్త్రరీత్యా ఒక యిబ్బంది ఏర్పడింది, రాష్ట్రాల పునర్నిర్మాణ చట్టం క్రింద నాన్ గెజిటెడ్, గెజిటెడ్ ఉద్యోగాలకు సంబంధించిన అంశాలను చూసే అధికారం రెండు సంస్థలకు మాత్రమేవుంది. అవి రాష్ట్రసలహా సంఘం, కేంద్ర సలహా సంఘం. రాష్ట్రసలహా సంఘంలో రాష్ట్ర పబ్లిక్ సర్వీసు కమిషను అధ్యక్షుడు, భారత ప్రభుత్వం ప్రతినిధి ఒకరు, రాష్ట్రప్రభుత్వ ప్రతినిధి ఒకరుసభ్యులుగా వున్నారు. కేంద్రసలహా సంఘానికి యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషను ఛైర్మన్ అధ్యక్షుడు. హైకోర్టు, లేక సుప్రీమ్ కోర్టుకు చెందిన ఒక రిటైర్డ్ జడ్జి, న్యాయశాఖ కార్యదర్శి సభ్యులు. ఈ సంఘాలే పై సమస్యలను చేపట్టడానికి అధికారం కలిగిన చట్టబద్ధమైన సంస్థలు. ఉద్యోగస్థులు ఈ సంఘాలకు ఫిర్యాదులు చేసుకోవచ్చు. సలహా సంఘాలు యిచ్చిన తీర్పులను ఎట్టి రిమార్కులు లేకుండానూ, వాటిని ఆ సంఘాలకు కానీ కేంద్రానికి కానీ తిరిగి నివేదించకుండానూ అమలు పరచాలని మేము నిశ్చయించాము. ఈ విధంగా ఈ సమస్యను పరిష్కరించేందుకు మేము ప్రయత్నిస్తున్నాము. అయితే కొంత సమయం పట్టుతుంది. దీనిని శీఘ్రంగా పరిష్కరించడం పట్ల నేను ఆత్రుత చూపుతున్నాను. మేము యితర అంశాలను పరిశీలిస్తున్నాము. పేపర్లను తెప్పించు కుంటున్నాము. శీఘ్రంగా చర్యలు తీసుకొని తెలంగాణా ఉద్యోగులకు ఏవైనా అన్యాయాలు జరిగినట్లయితే వాటిని తొలగించడానికి ప్రయత్నిస్తున్నాము.

## నష్టాల అంచనా

ఆర్థిక, గణాంకముల శాఖవారు తెలంగాణా ఆందోళన వల్ల జరిగిన నష్టాన్ని గూర్చి పరిశీలించి రూ. 52 కోట్ల మేరకు నష్టం సంభవించినట్లు అంచనావేశారు. అది చాలా పెద్దమొత్తం అనడంలో సందేహంలేదు.

రక్షణలు లేవు కాబట్టి విద్యవల్ల ప్రయోజనం లేదని చెబుతూ విద్యార్థులను పాఠశాలలకు, కళాశాలలకు వెళ్ళకుండా మాన్పించడం పట్ల మన మిత్రులు ఆసక్తిచూపుతున్నారు. ఈ రక్షణలన్నీ తక్కువ జీతం తెచ్చుకునే వారికొరకు మాత్రమే ఉద్దేశించబడినవి కాని విద్యార్థులకొరకు కావని నేను వారికి చెబుతున్నాను. డాక్టర్లకు యింజనీర్లకు, చంద్రమండలాన్ని చేరదలచిన శాస్త్రజ్ఞులకు రక్షణలు లేవు. రక్షణలు వర్తించేటటు వంటి ఉద్యోగాలను సంపాదించడమే ఈ విద్యార్థుల లక్ష్యం అయినట్లయితే ఈ దేశం ఏమైపోతుందో నేను చెప్పలేను.

## రాజధాని చుట్టుప్రక్కల కేంద్ర ప్రభుత్వ పరిశ్రమలు

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత హైదరాబాదులోనూ, ఆ చుట్టుప్రక్కల ప్రదేశాలలోనూ రూ. 150 కోట్ల పెట్టుబడితో కేంద్ర ప్రభుత్వ పరిశ్రమలు, ఇతర పరిశ్రమలు స్థాపించబడినవి. వైజాగ్ తదితర ప్రదేశాలలో నెలకొల్పబడిన యిట్టి పరిశ్రమల పెట్టుబడి విలువ రూ. 18.5 కోట్లు వుంటుంది. ఈ పరిశ్రమలలో సుమారు 25,000 ఉద్యోగాలున్నాయి. ఈ ఉద్యోగాలలో దాదాపు 85.7 శాతం ఉద్యోగాలు తెలంగాణావారికి 7.8 శాతం ఉద్యోగాలు ఆంధ్రప్రాంతంవారికి 6.5 శాతం ఉద్యోగాలు యితర రాష్ట్రాలవారికీ లభించాయి. ఉద్యోగాలలో ఆంధ్రప్రాంతీయులు బయటిప్రాంతాల వారు 3,673 మంది మాత్రమే. తెలంగాణావారికి 25,000 ఉద్యోగాలు లభించివుంటాయి. కేవలం 4,800 ఉద్యోగాల కోసం అలజడి చేస్తున్నారా? ఈ 25000 ఉద్యోగాల మాటేమిటి? తెలంగాణావంటి చిన్నరాష్ట్రాల్లో వున్నారనుకోండి. ఫలితమేమిటి? "అవశిష్ట హైదరాబాదు"లో నుంచి బీదర్ పోయింది. 9 జిల్లాలు మాత్రమే మిగిలాయి. ఈ పరిశ్రమలన్నీ యిచ్చట వుండేవా? చిన్న రాష్ట్రం ఆయినప్పుడు కేంద్రంమీదికి యింతటి ఒత్తిడిని తేగలిగే వారా? ఇది పెద్ద రాష్ట్రంలో కాబట్టే పరిశ్రమలలో యిన్ని ఉద్యోగాలు పొందగలిగాము.

## కోల్పోయిన పరిశ్రమలు

నిజానికి ప్రత్యేక తెలంగాణా ఆందోళనవల్ల రాష్ట్రానికి ఎంతో హాని జరిగింది. రాష్ట్రంలో పరిశ్రమలను స్థాపించడం కొరకు కలకత్తాకు చెందిన పారిశ్రామిక వేత్తలను కోరే నిమిత్తం అప్పటి పరిశ్రమలశాఖా మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి, ముఖ్య మంత్రితో కలిసి కలకత్తా వెళ్లారు. అనేక మంది పారిశ్రామిక వేత్తలనుంచి మంచి ప్రోత్సాహం లభించింది. వారు యిక్కడ పరిశ్రమలు స్థాపించ తలపెట్టారు. పెట్టుబడి రూ. 50 కోట్ల వరకు వుండేది కాని ఆందోళన మూలంగా మనం దానిని కోల్పో వలసి వచ్చింది.

## విద్యాసంస్థల మూసివేత

విద్యాసంస్థల మూసివేతవల్ల విద్యార్థులకు అపారమైన నష్టం జరిగింది. ప్రతిభావంతులైన అనేక మంది యువకులను, బాలురను పరీక్షలకు వెళ్లనివ్వలేదు. కాబట్టి వారు పరీక్షలకు హాజరు కాలేక పోయారు. తెలంగాణాలో ఆందోళనమూలంగా ఏర్పడిన వాతావరణంవల్ల బీదప్రజలకు ఎంతో హాని జరిగింది. ఉద్యమానికి వెనుకాలవున్న అనేకమందిమిత్రులు తమపిల్లలను పబ్లిక్‌స్కూల్స్‌కు పంపిస్తున్నారు. ఎందుచేతనంటే ఆ విద్యా సంస్థలు తెరచివున్నాయి. వాటిని ఎప్పుడూ మూసివేయరు. కనుక విద్యా సంస్థలను మూసి వేయడంవల్ల నష్టపోయింది బీద, మధ్య తరగతుల ప్రజలు మాత్రమే.

## ప్రజలకు రక్షణ

మనది ప్రజాస్వామిక వ్యవస్థ ప్రజాస్వామ్యంలో, అధిక సంఖ్యాకులైన ప్రజలు శాంతియుతంగా సాగించుకుంటున్న వృత్తి వ్యాపకాలకు కొద్దిమంది ప్రజలవల్ల అవరోధాలు ఏర్పడడం సహించ రానిది. కాని దురదృష్టవశాత్తు ఆ విధంగా జరిగింది. ఇప్పుడు మనం చైతన్య వంతులం. అసంతృప్తిచెందిన వర్గాలనుంచి కానీ, ఆందోళనకారుల నుంచి కానీ, విద్యార్థులనుంచి కానీ, లేక ఎవరైనా దుండగులనుంచి కానీ ఎటువంటి అవరోధాలు ఏర్పడకుండా తమ వృత్తి వ్యాపకాలను మామూలుగా సాగించుకునేందుకు ప్రజలకు రక్షణ యివ్వడం మన కర్తవ్యం. ఆ మేరకు మేము ఏర్పాట్లు చేశాము. దీనిని మా కర్తవ్యంగా పరిగణిస్తున్నాము. మా కర్తవ్య నిర్వహణలో విఫలులమైనట్లయితే అధికారస్థానాలలో వుండడానికి మాకు అర్హత వుండదు.

## అఖిల భారత దృష్టి

ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం విషయంలో ఒకరికి గట్టి నమ్మకం వుందనుకోండి. అతని సిద్ధాంతంతో నేను ఘర్షణపడను చిన్నరాష్ట్రాలు ఏర్పడ నివ్వండి. నగర రాష్ట్రాలు సైతం అవత రించనివ్వండి. అఖిల భారత స్థాయిలో చూచినప్పుడు యిటు వంటి రాష్ట్రాల ఏర్పాటు వాంఛనీయ మయ్యేటట్లయితే వీటి స్థాపన పట్ల నాకు అభ్యంతరమేమీలేదు ఏ నిర్ణయంచేసినప్పటికీ అది అఖిల భారత దృష్టి తో జరగాలి. అంతేకాని ఎవరో అల్లర్లు చేస్తున్నారనీ, హింసాచర్యలకు పూనుకుంటున్నారనీ నిర్ణయాలు తీసుకోరాదు. ఎవరోకొంతమంది వ్యక్తులు అధికారంలో వుండటం, లేదా లేక పోవడం ప్రధానవిషయం కాదు. ప్రజల దృక్కోణం నుంచి ప్రజానీకం చూడవలసింది ఆర్థికాభ్యున్నతి సాధనాలనూ, దారి ద్ర్యనిర్మూలన మార్గాలను మాత్రమే మన రాజ్యాంగాన్ననుసరించి యావన్మందికీ సమానావకాశాలు చేకూర్చగల సమాజాన్ని సృష్టించ వలసిన బాధ్యత మనమీద వుంది. ఈ బాధ్యతా నిర్వహణలో మనం ఎంతవరకు ముందుకు వెళ్లగలిగాము? మనలను ఎదుర్కొంటున్న ప్రాతిపదిక సమస్యలు యివి. వీటిని మనం పరిష్కరించవలసి వుంది.

## సహకారం

తెలంగాణా ఆందోళనను కొంతమంది ప్యూడలిస్టు ఉద్యమం గా పేర్కొన్నారు. ప్రజలు అట్టి ఉద్యమానికి లోనైనట్లయితే వారు ఏమి సాధిస్తారో ఆ భగవంతునికే తెలియాలి.

ఇప్పుడు మనం క్రొత్త అధ్యాయాన్ని ప్రారంభించవలసి వుంది. ఆందోళనను ధైర్యంగా ఎదుర్కొంటూ మామూలు ప్రకారం కార్యకలాపాలను సాగించుకోవడమే యిప్పుడు మనం చేయవలసింది. మిత్రులు ప్రత్యేక రాష్ట్ర వాదాన్ని ప్రచారం చేయ దలచినప్పుడు అందుకు, ఒకప్పుడు దేశంనుంచి విడిపోవాలన్న వాదాన్ని లేవదీసినట్టి డి.ఎం.కె.ను సైతం అనుమతించినట్లుగానే, అనుమతించాము. మనదేశంలో వాక్స్వాతంత్ర్యం, సంఘ

(తరువాయి 48వ పుటలో)

## పరిపాలనా విషయాలు

### తుఫాను సహాయానికి కేంద్రంనించి మరికొంత గ్రాంటు

తుఫాను సహాయకచర్యగా ఆంధ్రప్రదేశ్‌కు లోగడయిచ్చిన గ్రాంటుగాక అదనంగా మరో 18 కోట్లరూపాయలను మంజూరు చేసేందుకై ప్రధాని హామీయిచ్చారు. ఈ విషయాన్ని జనవరి 10 వ తేదీన నందిగామలో ముఖ్యమంత్రి వెల్లడించారు. భూముల్లేని బీదలకు 20 లక్షల ఎకరాల బంజరుభూమిని పంపిణీ చేయడానికి రాష్ట్రప్రభుత్వం తగుచర్యలను తీసుకున్నట్టుకూడా ముఖ్యమంత్రి తెలియజేశారు.

### ఇనాముల చట్టానికి సవరణ

రాష్ట్రంలో అమలులోవున్న ఎస్టేట్లు ఇనాములు, జాగీర్ల రద్దుచట్టంలో రానున్న శాసనసభా సమావేశంలో కొన్ని సవరణలను చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. ఈ విషయాన్ని జనవరి 6 వ తేదీన రెవెన్యూమంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి హైదరాబాదులో తెలియజేశారు.

ఈ చట్టంలోని కొన్ని లోటుపాట్లను గురించి ప్రస్తావిస్తూ రెవెన్యూమంత్రి ఇనాము భూములు, జాగీర్దారీభూములపై యాజమాన్యాన్ని నిర్ధారించే అంశం ప్రస్తుతం అంత సంతృప్తికరంగా లేదనీ, ఇప్పుడు ఇది సర్వే సెటల్‌మెంట్ అధికారుల చేతుల్లో వున్నదనీ, గ్రామాధికారులకు తెలిసినంతగా వీరికి భూమిపై హక్కుభుక్తాల విషయాలు అంతగా తెలియవని అన్నారు. కొన్ని సందర్భాలలో యీ చట్టంప్రకారం అయిదు ఎకరాలకన్న తక్కువ భూమివున్నకౌలుదార్లకుకూడా తాముకౌలుచేస్తున్న భూమిపై హక్కు లేకుండా పోయింది. ఇటువంటి చిన్న కౌలుదార్లకు తమ కౌలు భూములపై వెంటనే హక్కు కల్పించవలసివుంది. పెద్దరైతు అయితే న్యాయస్థానానికి వెళ్ళడానికైనా పూనుకుంటాడు. కాని బీదరైతుకు అటువంటి అవకాశమేలేదు. అటువంటి వారికి ప్రభుత్వమే తోడ్పడవలసి వుంటుంది–అన్నారు శ్రీ తిమ్మారెడ్డి.

### నిరుద్యోగులైన కార్మికులకు సహాయం

కర్మాగారాలను మూసి వేయడంవల్ల రిట్రెంచ్ చేయబడిన కార్మికులకు సహాయపడేందుకని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒకపథకాన్ని ఆలోచిస్తున్నది. ఈ విషయాన్ని కార్మికశాఖామంత్రి జనవరి 7వ తేదీన విశాఖపట్టణంలో తెలియజేశారు. ఈ సహాయక పథకం ప్రకారం ఒక నిధిని ఏర్పాటుచేయడం జరుగుతుంది. ఈ మొత్తంలో అధికభాగం కార్మాగారాల యజమానులనుండి సేకరించడం జరుగుతుంది. పనిలోవుండి ఆ తరువాత రిట్రెంచ్ చేయబడిన కార్మికులకే యీ పథకంప్రకారం సహాయం అందజేయబడుతుంది.

### చలనచిత్రమండలి పునర్వ్యవస్థీకరణ

చలనచిత్రాలు సబ్సిడీ ఇవ్వడానికి అర్హమైనవోకావో నిర్ణయించేందుకు ఏర్పాటుచేయబడిన చలనచిత్ర మండలిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పునర్వ్యవస్థీకరించింది. దీనికి ఆంధ్రప్రదేశ్ శాసనమండలి అధ్యక్షుడు శ్రీ పి. రంగారెడ్డి అధ్యక్షుడుగా వుంటారు. డా. ఎస్. శ్రీదేవి, ఆంధ్రప్రభ సంపాదకుడు శ్రీ పి. నాగేశ్వరరావు, శ్రీ వి. శంకర్‌గిరి సభ్యులుగావుంటారు. సమాచార పౌరసంబంధ, యాత్రికశాఖా డైరెక్టరు సభ్యుడు–సమావేశకర్తగా వ్యవహరిస్తారు.

---

## పాఠకుల లేఖలు

ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక ఈ మధ్య బాగావస్తున్నది. సకాలంలో ఈ పత్రికను తీసుకవస్తున్నందుకు మిమ్మలను అభినందించక తప్పదు. ఆంధ్రప్రదేశ్ పత్రికధరను 25 పైసల నుంచి 50 పైసలకు పెంచారు. ఆంధ్రప్రదేశ్ పత్రికను లాభసాటి పత్రికగా చేయదలచుకుంటే వ్యాపారప్రకటనలను సంపాదించి ధరను తక్కువ చేసుకోవచ్చును.

జె. రామచంద్రుడు
తెనాలి.

ఆంధ్రప్రదేశ్ జనవరి సంచిక సర్వాంగ సుందరంగా వున్నది. తెలంగాణా ప్రాంతములో బాగా ప్రచారంలోవున్న బోనాలు పండుగను మాకు పరిచయం చేసినందుకు ఆంధ్రప్రదేశ్ సంపాదకులకు, రచయితకు మా కృతజ్ఞతలు. రావూరుగారి సంక్రాంతి మనోగతాలు మమ్మల్ని బాగా నవ్వించాయి. ముఖ్యమంత్రిగారి వ్యాసం తెలుగువ్రజల శ్రేయస్సుకోసం బాగా తోడ్పడగలదు. ఇకముందుకూడ మీరు ఇటువంటి ప్రయోజనకరమైన వ్యాసాలను ప్రచురించగలరని ఆశిస్తున్నాము.

రామవరపు సూర్యనారాయణ మూర్తి
రామవరపు మృత్యుంజయరావు
విశాఖపట్టణం

జనవరి సంచికలో అబ్బూరి గోపాలకృష్ణగారు వ్రాసిన ప్రకృతిదర్శనం కవిత బావున్నది. ప్రతినెలా చక్కటి కవితను ప్రచురిస్తున్నట్టే ఒక్కొక్కకథను గూడా ప్రచురిస్తే బాగుంటుంది. మాసపత్రికలో మూడు సీరియల్స్ అనవసరం. ఒక సీరియల్, ఒక కథ, ఒక కవిత, ఒక సాహిత్యవ్యాసంవుండి మిగతా విషయాలు ప్రభుత్వానికి సంబంధించినవి వుంచేవాలు. ప్రతినెలా మన చరిత్ర సంస్కృతులకుసంబంధించినవ్యాసంకూడాఒకటిచేర్చడం అవసరం.

వి. నరసింహారావు
శంకరగుప్తం (తూ.గో. జిలా)

# ఆంధ్రప్రదేశ్ 4వ పంచవర్ష ప్రణాళిక

**ఆంధ్రప్రదేశ్ నాల్గవ పంచవర్ష ప్రణాళిక పెట్టుబడి రూ. 650 కోట్లు . . .**

**పారిశ్రామిక ఉత్పత్తిని అధికంచేయడం, వ్యవసాయ రంగంలో ప్రాంతీయ వ్యత్యాసాలను తొలగించడం ముఖ్యలక్ష్యాలు.**

---

రూ. 650 కోట్ల రాష్ట్ర నాల్గవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలోని ముఖ్య అంశాలు.

మనరాష్ట్ర ఆర్థిక వ్యవస్థ ముఖ్యంగా వ్యవసాయంపైన ఆధారపడివుంది. అంతేకాకుండా వాణిజ్యేతర వ్యవసాయ పంటలే విశేషంగా వుండటంవల్ల రాష్ట్ర ఆర్థిక వనరులలో పటిష్టత తక్కువగావుంది. ఆర్థిక వనరుల కొరత ఏర్పడటంవలన, రాష్ట్ర అభివృద్ధి పనులు చురుకుగా కొనసాగడానికి ప్రతిబంధకాలున్నాయి. కనుక పారిశ్రామిక ఉత్పత్తిని అధికంచేసి, వ్యవసాయోత్పత్తులలో మార్పులు తీసుకొని వచ్చినట్లయితే ఆర్థికాభివృద్ధిని చూరగొనడం సాధ్యమవుతుంది. మన ప్రణాళిక ముఖ్యోద్దేశంకూడ ఇదే.

వివిధ రంగాలలో రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను పటిష్టం చేయడమే ప్రణాళికల ముఖ్య లక్షణం అయినప్పటికీ, వ్యవసాయోత్పత్తుల పరిస్థితి అంత తృప్తికరంగా లేదనే విషయం మరవకూడదు. కనుక వ్యవసాయన్ని అభివృద్ధి పరచడానికి ఇంకా ఎంతో కృషి చేయవలసివుంది వ్యవసాయోత్పత్తి రీత్యా కొన్ని ప్రాంతాలు బాగా అభివృది చెందిన కారణాన మొత్తంమీద ఇది మిగులు రాష్ట్రమయినప్పటికీ అఖిల భారత స్థాయిలో సగటు ఉత్పత్తి తక్కువగావుంది. ఆహారేతర పంటల ఉత్పత్తి రేటు తక్కువగా ఉండటమే దీనికి కారణం.

మన రాష్ట్రంలో వ్యవసాయోత్పత్తి తీరు తెన్నులు ఏ విధంగా వున్నవంటే తలసరి వ్యవసాయ కార్మికుని ఉత్పత్తి విలువ చాల తక్కువగా వుంది. వ్యవసాయోత్పత్తి విషయంలో కొన్ని ప్రాంతాలు తక్కువగా అభివృద్ధి చెందడమే ఇందుకు ముఖ్య కారణం. ఈ ప్రాంతాలుకూడా అభివృద్ధి చెందిన ప్రాంతాల స్థాయికి వస్తే తప్ప వ్యవసాయ పరిస్థితిలో మెరుగు ఉండదు. ప్రాంతీయ వ్యత్యాసాలను తొలగించడానికి వీలుగా రాష్ట్ర ప్రణాళికను రూపొందించవలసి వుంటుంది ఇది మన ప్రణాళిక యొక్క రెండవ ప్రధాన లక్ష్యమైవుంది

## దీర్ఘ కాలిక ప్రయోజనాలు

నాల్గవ ప్రణాళిక కాలంలో వ్యవసాయ రంగంలో 5 శాతం, పరిశ్రమల రంగంలో 8_10 శాతం అభివృద్ధి సాధించాలని జాతీయ లక్ష్యమై వుంది. కనుక దీన్ని దృష్టిలో పెట్టుకొని ఒకవైపు పరిశ్రమల రంగానికి తగిన ప్రోత్సాహమిచ్చి రెండవ వైపు వ్యవసాయ రంగంలో ప్రాంతీయ వ్యత్యాసాలను తొలగించడానికి ప్రణాళికా పథకాలను రూపొందించవలసి వుంటుంది. ఈ విధంగా చేసినట్లయితేనే ఆశించిన లక్ష్యాలను సాధించడమే కాకుండా, ఈ లక్ష్యాలను అధిగమించడానికికూడా వీలుంటుంది.

అయితే, రాష్ట్ర ఆర్థిక వనరుల కొరత ఏర్పడడం, మిగిలివున్న పథకాలు ఎక్కువగా వుండడం ఈ పరిస్థితివల్ల నాల్గవ ప్రదిశికలో రాష్ట్ర అభివృద్ధి కృషిపైన యెక్కువ భారం పడుతున్నవ రాష్ట్ర ఆర్థిక వనరులను అభివృద్ధి పరచడానికి యెక్కువ అవకాశాలు లేవు. అంతేకాకుండా దీర్ఘకాలిక భారీ ప్రాజెక్టులపైన ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టవలసి వస్తున్నది. ఈ పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని వివిధ రంగాల అభివృద్ధికి నిధులు కేటాయించాలి.

## "మిగిలిపోయిన పథకాల" అమలు

మిగిలిపోయిన పథకాలను పూర్తి చేయడానికి రూ. 350కోట్లు అవసరమవుతాయి. ఇందులో రూ. 180 కోట్లు విద్యుచ్ఛక్తి అభివృద్ధికి, రూ. 90 కోట్లు నీటి పారుదల అభివృద్ధికి ఖర్చు అవుతాయి. కనుక నాల్గవ ప్రణాళిక ఖర్చులో చాలా భాగం విద్యుచ్ఛక్తి, నీటిపారుదలకు ప్రత్యేకించవలసి ఉంటుంది. అయితే ఈ రెండు రంగాలు అభివృద్ధి చెందినట్లయితే, వ్యవసాయ పారిశ్రామిక ప్రగతికి దోహదం కలుగుతుంది.

ఇది ఇలా వుండగా, ఇదివరకే చేపట్టిన భారీ, మధ్యతరహా నీటి పారుదల పథకాలు ప్రాంతీయ వ్యత్యాసాలను తొలగించడానికి ఉపకరించడంలేదు. కనుక మన రాష్ట్రంలో చిన్న తరహా నీటి పారుదల పథకాలను అమలు పరిచేటప్పుడు ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. అంటే రాష్ట్ర పరిస్థితిని గమనించి ఏ ప్రాంతంలో ఇప్పుడు చిన్నతరహా నీటి పారుదల తక్కువగా అభివృద్ధి చెందిందో, ఏ ప్రాంతంలో భారీ, మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టులకు ఖర్చుపెట్టడం జరుగలేదో, ఆ ప్రాంతాలకు ఎక్కువగా నిధులు కేటాయించ వలసివుంటుంది. ఈ విధంగా చేసినట్లయితే ప్రాంతీయ వ్యత్యాసాలు తొలగిపోవడానికి ఆస్కారముంటుంది.

## ఇతర ముఖ్య రంగాలు

విద్యుచ్ఛక్తి, నీటిపారుదల ప్రాజెక్టుల తరువాత ముఖ్యమైనవి వ్యవసాయోత్పత్తి పరిశ్రమలు, గనులకు సంబంధించిన పథకాలు. ఈ రంగాలకు కేటాయించిన నిధులు, మొత్తం పెట్టుబడితో పోల్చినట్లయితే చాల తక్కువగా కనిపించవచ్చు. అయితే విద్యుచ్ఛక్తి నీటిపారుదల, రోడ్డురవాణాలకై చేసిన ఖర్చు ప్రత్యక్షంగానే వ్యవసాయ, పరిశ్రమల అభివృద్ధికి దోహదం కల్గిస్తుందనే విషయం గమనించాలి. ఇంకొక విషయం. ఎరువుల ఫ్యాక్టరీలు, వ్యవసాయ పరపతి ఈ రెండింటిపై పెట్టే ఖర్చు ప్రణాళికలో వుండదు. కనుక ముఖ్యంగా వ్యవసాయ పరపతి అవసరాలను ఆదుకొనడానికి తగిన నిధులు లభించేటట్లు చూడాలి.

ఆయా రంగాల అభివృద్ధి విషయమై ప్రత్యేక శ్రద్ధ వహించడం ఎంతైనా అవసరం. పరిశ్రమల విషయంలో ప్రయివేటు రంగంలో కానీ, కేంద్ర ప్రభుత్వ రంగంలో కానీ పెటుబడులు వుండాలి ఇవి రాష్ట్ర ప్రణాళికలో లేవు. అందువల్ల ప్రయివేటు కేంద్ర ప్రభుత్వ ప్రాజెక్టులను ఆకర్షించేందుకు తగిన వసతి సౌకర్యాలు కల్పించేందుకు మాత్రమే రాష్ట్ర ప్రణాళికలో కేటాయింపులు చేయడం జరుగుతుంది. ఆ తరహాలోనే రవాణా, కమ్యూనికేషనుల అభివృద్ధికి కూడా తగిన ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతుంది. వీటివల్ల కూడా వ్యవసాయ పరిశ్రమల రంగాలు అభివృద్ధి చెందడానికి విశేషావకాశాలున్నాయి.

సాంఘిక సంక్షేమం అభివృద్ధి విషయంలో బడి పిల్లల సంఖ్య శాతం, ప్రతి వెయ్యి మంది జనాభాకు ఆసుపత్రి మంచాల సంఖ్య మున్నగువాటిని పరిశీలించినట్లయితే ఏ దృష్టితో చూసినా గణనీయమైన ప్రగతి జరుగలేదని చెప్పవచ్చు. వాస్తవంగా ఈ విషయాలలో అఖిల భారత స్థాయికంటే, మన రాష్ట్రంలో కొన్ని ప్రాంతాలు తక్కువగా వున్నాయి. విద్యుచ్ఛక్తి నీటిపారుదల వంటి రంగాలలో యెక్కువగా పెట్టుబడి పెట్టడంవలన సాంఘిక సంక్షేమ రంగం కొంత వెనుకపడి వుంది. కనీసం నాల్గవ ప్రణాళికలో అయినా ఈ రంగం అభివృద్ధి పట్ల తగిన శ్రద్ధ వహించడం అవసరం. అయితే ఈ రంగాలను ఎదుర్కొంటున్న గడ్డు సమస్యల్ని పరిశీలించినట్లయితే నాల్గవ ప్రణాళికలో కేటాయించిన నిధులు చాలకపోవచ్చు రాష్ట్ర నాల్గవ ప్రణాళికను రూపొందింటప్పుడు స్థూలంగా ఈ విషయాలు దృష్టిలో వుంటాయి. అయి ప్రతిరంగం అభివృద్ధి విషయంలో ఆర్థిక శక్తి స్తోమతలనుబట్టి, ప్రాంతీయ అభివృద్ధి విధానాలనుబట్టి తగిన శ్రద్ధ వహించడం జరుగుతుంది.

## వ్యవసాయం

వ్యవసాయ రంగానికి ప్రత్యేకించిన నిధులు పరిశీలించేటప్పుడు, వ్యవసాయోత్పత్తికి ముఖ్యమైన ఎరువులు, పరపతి విషయాలు చతుర్థ ప్రణాళికలో చేర్చడం జరగలేదనే విషయం గమనించాలి. ప్రణాళికలో మేలురకం విత్తనాలు, క్రిమిసంహారక మందులకొరకు మాత్రమే కేటాయింపులు జరిగాయి. ఈ రెంటికీ తగిన నిధులు లభించేట్లు చూడాలి. ఇక, ప్రాంతీయ అసమానత్వాలు తొలగించే విషయం. ఏ ప్రాంతంలో వ్యవసాయోత్పత్తి తక్కువగా వుందో, ఏ ప్రాంతంలో రైతుల ఉత్పత్తిశక్తి తక్కువగా వుందో ఆ ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవటం జరుగుతుంది. ఈ విధంగా చేసినట్లయితేనే ప్రాంతీయ అసమానత్వాలు తొలగిపోతాయి.

## సహకారం

అధిక వ్యవసాయోత్పత్తి సాధనకు పరపతి సౌకర్యాలు లభించడం చాలా అవసరం. రాష్ట్ర ఆర్థిక వనరులు పరిమితంగా వుంటూన్న కారణాన భూమి తనఖా బ్యాంకులు, అగ్రికల్చర్ రీ ఫైనాన్స్ కార్పొరేషనుకు సాధ్యమైనంతవరకు ఆర్థిక పటిష్ఠత చేకూర్చడానికి ఇతర వనరులను అన్వేషించాలి. అందువల్ల సహకారం క్రింద భూమి తనఖా బ్యాంకుల విషయంలో ప్రత్యేక డిబెంచరు కార్యక్రమాలకు ప్రాధాన్యత ఇవ్వాలి. రాష్ట్ర ప్రభుత్వం కూడా ఇందులో భాగస్వామిగా వుండాలి. ఈ కార్యక్రమాలవల్ల చిన్నతరహా నీటిపారుదల పథకాలక్రింద భూగర్భ జలసంపద వినియోగానికి అవకాశం ఏర్పడుతుంది. తక్కువ ఉత్పత్తిగల ప్రాంతాల సమస్యల పరిష్కారానికి ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతుంది.

అయితే ఇంతమాత్రాన తక్కువ ఉత్పత్తిశక్తిగల రైతులకు పెద్ద సహాయం జరక్కపోవచ్చు. కానీ అట్టి రైతుల ఉత్పత్తి శక్తిని హెచ్చించడానికి వారికి పరపతి సౌకర్యాలు కల్పించే విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించాలి.

## సామాజికాభివృద్ధి

సామాజికాభివృద్ధిక్రింద చేపట్టిన కార్యక్రమాలు ఉత్పత్తి పథకాలకు దోహదం కలిగించే విధంగా వుండాలి. ఇవి చిన్న తరహా నీటి పారుదల పథకాలకూ, వ్యవసాయోత్పత్తికీ సహాయకారిగా వుండాలి. పంచాయతీరాజ్ సంస్థలకిచ్చే ఆర్థిక సహాయం ఆర్థిక వనరులను సమీకరించేందుకు తోడ్పడే విధంగా వుండాలి.

## నీటిపారుదల

వివిధ జిల్లాల మధ్యా, మూడు ప్రాంతాల మధ్యా నీటిపారుదల సౌకర్యంతో సాగు అవుతున్న భూమి దామాషాలో చాలా

లేదావుంది. ఈ వ్యత్యాసాలను తొలగించడానికి ఇప్పుడు కృషి చేయబడుతుంది. భారీ, మధ్యతరహా నీటిపారుదల క్రింద ముఖ్యంగా మిగిలివున్న ప్రాజెక్టులు — అంటే నాగార్జునసాగరు, పోచంపాడు ప్రాజెక్టులు, తుంగభద్ర హైలెవల్ కాలువ రెండవదశ రాష్ట్రంలోని మూడు ప్రాంతాలకు ఉపకరించేవిగా వున్నాయి. అయితే ఇదివరకే నీటిపారుదల సౌకర్యం ఎక్కువగావున్న ప్రాంతంలోనే భారీ, మధ్యతరహా ప్రాజెక్టులు ఏర్పాటు చేయడానికి రెండు ముఖ్య కారణాలున్నాయి.

రాష్ట్ర ఆర్థిక వనరులు పరిమితంగావున్న కారణాన ప్రజలు ఏ ప్రాంతాలలో అభివృద్ధి పన్ను రూపంలో డబ్బు ఇస్తారో ఆ ప్రాంతాలలోనే ఈప్రాజెక్టులు ఏర్పాటు చేయడానికి ప్రాధాన్యత ఇవ్వవలసి వుంటుంది. నీటిపారుదల విషయంలో ఇదివరకే కొంత బాగా అభివృద్ధి చెందిన ప్రాంతంలోనే ఇట్టి ప్రాజెక్టులు నిర్మించడానికి అవకాశాలు యెక్కువగా వుంటాయి ఇది మొదటి కారణం. సాంకేతిక పరిస్థితులు, జనసమృద్ధి—ఈ రెండు విషయాలను దృష్టిలో పెట్టుకొని భారీ, మధ్యతరహా ప్రాజెక్టులను నిర్మించవలసి వుంటుంది కానీ చిన్నతరహా నీటిపారుదల పనుల మాదిరి నిర్మించడం సాధ్యంకానిపని. కనుక చిన్నతరహా నీటిపారుదల పనులను అమలు పరచడం ద్వారా ప్రాంతీయ వ్యత్యాసాలను తొలగించడానికి కృషి చేయవలసి వుంటుంది.

## విద్యుచ్ఛక్తి

వ్యవసాయం, పరిశ్రమల రంగాలలో ఉత్పత్తి యెక్కువ కావడానికి విద్యుచ్ఛక్తి తోడ్పడుతుంది కనుక తీవ్ర రూపంలో విద్యుచ్ఛక్తి కొరత ఏర్పడకుండా వుండేటట్లు చూడాలి. అంతే కాకుండా విద్యుచ్ఛక్తి సంఘం యొక్క మూల ధనం అభివృద్ధి కావడానికి కాల విలంబన లేకుండా ఉత్పత్తి అయిన విద్యుచ్ఛక్తిని వినియోగదారులకు సరఫరా చేయడానికి వీలుండే విధంగా విద్యుచ్ఛక్తి ట్రాన్స్‌మిషను, పంపిణీల విషయాలకు సంబంధించిన పనులను సక్రమంగా అమలు జరపవలసి వుంటుంది. వ్యవసాయ ఉత్పత్తిని, ప్రాంతాల అభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా పథకాలను అమలుపరచవలసి వుంటుంది.

## పరిశ్రమలు

ముఖ్యంగా కేంద్ర ప్రభుత్వ, ప్రయివేటు రంగాలు మాత్రమే పరిశ్రమలు నెలకొల్పడానికి కృషిచేయవలసి వుంటాయి. రాష్ట్ర ప్రణాళిక ఈ రెండు రంగాలను ఆకర్షించడానికి కావలసిన సదుపాయాలను మాత్రమే కల్పించగలదు. గ్రామీణ ప్రాంతాలలో మిగులుగావున్న సంపత్తును ఉత్పత్తి రంగాలలో పెట్టుబడి చేయడానికి వీలుగా ప్రధానంగా లఘు పరిశ్రమలకు తగిన ప్రోత్సాహం ఇచ్చినట్లయితే ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు అభివృద్ధి చెందడానికి ఆస్కారం వుంటుంది. రాష్ట్ర వనరులు పరిమితంగా వున్న కారణాన, వెంటనే అభివృద్ధి చెందడానికి అవకాశంగల ప్రాంతాలలో వీటిని ప్రోత్సహించడానికి కృషిచేయాలి హైదరాబాదు–సికిందరాబాదు ప్రాంతం, విశాఖపట్నం– అనకాపల్లి ప్రాంతం, విజయవాడ–గుంటూరు ప్రాంతం, నాగార్జున సాగరు ఆయకట్టు ప్రాంతం, కొత్తగూడెం–రామగుండం ప్రాంతం, కడప–కర్నూలు కాలవ ఆయకట్టు ప్రాంతాలలో ప్రధానంగా వివిధ లఘు పరిశ్రమలు నెలకొల్పడానికి శ్రద్ధ వహించబడుతుంది.

## రవాణా, కమ్యూనికేషనులు

ఈ పద్దుక్రింద "మిగిలిపోయిన" పథకాలకు ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతుంది అయితే క్రొత్త పనులు ఆరంభించడానికి పై పరిశ్రమల క్రింద పేర్కొన్న ముఖ్య విషయాలు పరిశీలించడం జరుగుతుంది. అంతే కాకుండా వ్యవసాయోత్పత్తి అధికం కావడానికి రోడ్డు దారుల్లో నాగార్జునసాగరు ఆయకట్టువంటి ప్రాంతాలలో వెంటనే రవాణా, కమ్యూనికేషనులు అభివృద్ధి పరచడానికి కృషిచేయడం జరుగుతుంది.

## సాంఘిక సంక్షేమం

ప్రణాళికయొక్క మానవశక్తి అవసరాలను దృష్టిలో పెట్టుకొని విద్యా కార్యక్రమాలు చేపట్టవలసి వుంటాయి. అనావృష్టి ఫలితంగా తరచుగా నీటి ఎద్దడి ఏర్పడే ప్రాంతాలలో గ్రామీణ నీటి సరఫరా పథకాలకు ప్రాధాన్యత ఇవ్వవలసి వుంటుంది. పరిశ్రమల అభివృద్ధికి రూపొందించిన ప్రణాళికలకు అనుగుణంగా పట్టణ నీటి సరఫరా పథకాలు అమలుపరచవలసి వుంటుంది షెడ్యూల్డు జాతులు, వెనుకబడిన తరగతుల ప్రజల సంక్షేమం పట్ల రాష్ట్ర ప్రభుత్వం బాధ్యత వహించవలసి వుంటుంది.

పైన పేర్కొన్న సాధారణాంశాలే కాక ఎప్పుడూ క్షామానికి గురిఅయ్యే ప్రాంతాలు, గిరిజనుల సంక్షేమం, వరద నిరోధక చర్యలు రాజధాని అభివృద్ధి, నిరుద్యోగ సమస్య మున్నగు ప్రత్యేక విషయాలను పరిష్కరించడానికి ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఈ సమస్యలు పరిష్కరించడానికి పథకాలు రూపొందించినపుడు, ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం విడి విడిగా పరిశీలించడం జరిగింది. రాష్ట్ర ప్రణాళికా లక్ష్యాలకు అనుగుణంగా వాటిని రూపొందించడం జరిగింది.

---

# కరీంనగర్ జిల్లాను సస్యశ్యామలంచేసే

# మానేరు ప్రాజెక్టు

**మా**నేరునది కరీంనగర్ జిల్లాకు పశ్చిమంగా నిజామాబాదు జిల్లాలో తిరుమలాపూర్ కొండలమీద పుట్టి, మెల్లగా దిగువకొచ్చి నిజామాబాదు, కరీంనగర్ జిల్లా భూముల్ని తడుపుతూ 140 మైళ్ళ దూరం ప్రయాణంచేసి కరీంనగర్ జిల్లా తూర్పు భాగంలో గోదావరిలో సంగమిస్తున్నది. కరీంనగర్ పట్టణానికి రెండు మైళ్ళ దూరంలో మానేర్‌నది ఎగువ ప్రవాహంగా దాపిమీద మరో 'నవ భారత నూతన ఆలయం' నిర్మితం కానున్నది. దిగువ మానేరు ప్రాజెక్టు అనబడే యీ మానవ మహోన్నత ఆధునిక దేవాలయం 1975 నాటికి రూపురేఖలు దిద్దుకోగలదు తెలంగాణా ప్రాంతంలో సంపద సమృద్ధులకు ఒక నూతన శకావిర్భావానికి యిది అంకురార్పణ చేస్తుంది. ఆనకట్ట నిర్మాణానికి రూ. 687 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా. ఈ దిగువ మానేరు ఆనకట్టవల్ల 29 వేల ఎకరాల పల్లపుభూమి, 58 వేల ఎకరాల మెట్టభూమి — వెరసి 87 వేల ఎకరాలు అదనంగా ఆయకట్టు క్రిందికి వస్తాయి

కరీంనగర్ జిల్లా, కుటీర పరిశ్రమలకు రాష్ట్రంలోనేకాక దేశంలోనూ ప్రసిద్ధి కెక్కింది వెండి ఫిలిగ్రీ పనితనానికి కరీంనగర్ జిల్లా పెట్టింది పేరు. తెలంగాణా ప్రాంతంలో ఎక్కువగా ఆహార ధాన్యాలను పండించే జిల్లాలలో కరీంనగర్ జిల్లా ఒకటి. ఇక్కడ ప్రధానంగా జొన్న, వరి, మొక్కజొన్న, మినుములు మొదలైనవి పండుతాయి, అయితే యీ జిల్లాలోని భూములకు సేద్యపు నీటి సరఫరా చాలా కాలంగా ఒక సమస్యగా వుంటున్నది. సాధారణంగా ఈ జిల్లాకు ఉత్తరపు కొసగా, తూర్పు వైపుగా ప్రవహించే బ్రహ్మాండమైన గోదావరి నది, ఈ జిల్లాలో పశ్చిమంనుంచి తూర్పుకు ప్రవహించే మానేరు ది వాటి ఉపనదులు యీ జిల్లాలోని పంట భూములకు జీవాధారమైన ప్రధాన నీటి వనరులుగా వున్నాయి. బహుళ ప్రయోజనకారి అయిన పోచంపాడు ప్రాజెక్టును గోదావరి మీద నిర్మించే పని అప్పుడే చేపట్టడం జరిగింది ఇక్కడ పని చురుకుగా కొనసాగుతున్నది. పోచంపాడు కాలువను యిప్పుడు నిర్మించనున్న దిగువ మానేరు ఆనకట్టతో కరీంనగర్‌వద్ద కలపాలనీ, యీ రెండింటిలోచేరే జలాలను మరింతగా వినియోగంలోకి తేవాలనీ ఉద్దేశించారు. మానేరుకు ఆవల మొత్తం 2,07,000 ఎకరాలకు సేద్యపునీరు లభిస్తుంది అంటే పోచంపాడు దక్షిణ కాలువవల్ల 1,20,000 ఎకరాలకు, మానేరులోకి వచ్చి చేరే జలాలవల్ల 87 000 ఎకరాలకు సేద్యపు నీరు లభిస్తుంది.

## మానేరు ఆనకట్టు వివరాలు

మట్టి ఆనకట్ట—14,000 అడుగుల పొడవు

నీరు పొర్లని రాతి ఆనకట్ట—2,460 అడుగుల పొడవు

60అ × 15అ సైజుగల రేడియల్ గేట్‌లు 25 అమర్చిన స్పిల్‌వే—1,740 అ పొడవు

మట్టి ఆనకట్టగరిష్టఎత్తు పునాదిపైన 55 అ. వుంటుంది.

నీరు పొర్లని రాతి ఆనకట్ట గరిష్ట ఎత్తు పునాదిపైన 104అ. వుంటుంది. స్పిల్‌వే శిఖరం ఎత్తు అన్నిటికన్న లోతైన పునాది నించి 67 అ. ఎత్తున వుంటుంది. ఇక్కడ ఏర్పడే జలాశయంలో 19.20 చ. మై. విస్తీర్ణం మేరకు నీరు విస్తరించి వుంటుంది. ఈ జలాశయంవల్ల కేవలం తొమ్మిది గ్రామాలు మాత్రమే నీటిలో మునిగిపోతాయి. అందువల్ల పునరావాస సమస్య ఒక పెద్ద సమస్య కాదు. ఈ జలాశయం వందేళ్ళ పాటు చెక్కు చెదరకుండా వుంటుంది.

కరీంనగర్ దగ్గర కట్టనున్న యీ ఆనకట్టవద్ద డ్రైనేజ్ ప్రాంతం 2,496 చ. మైళ్ళు. దీనివల్ల 28 శ. కో. ఘ. అడుగుల నీరు లభిస్తుంది. ఎగువ మానేరు రిజర్వాయరు, శనిగరం చెరువు యీ రెండు నీటి పారుదల పథకాలు యిప్పుడు మానేరు పరీవాహక ప్రాంతంలో వుండనే వున్నాయి. ఈరెండింటికి తోడు సుమారు 3,000 సేద్యపు నీటి చెరువులు, ఇంకా అనేక నీటిగుంటలు వున్నాయి. ప్రస్తుతం సేద్యపు నీటి సరఫరా జరుగుతున్న ప్రాంతం లక్ష ఎకరాలు వుంది. సుమారు 16 శ. కో. ఘ. అ. నీరు ఉపయోగించబడుతున్నది. అంటే 10 శ. కో. ఘ. అడుగుల నీరు (ఇంకిపోయిన, ఇగిరిపోయిన నీటి తరుగుదల కొంత పోగా) దిగువ మానేరులో నిలువ చేసి, వినియోగించడానికై వుంచి వేయబడుతుంది. మానేరునది ఎగువ ప్రవాహంలో యిప్పుడు ఒక ఆనకట్ట వుండడంచేత ప్రస్తుతం నిర్మింపనున్న దానిని దిగువ మానేరు ఆనకట్టగా పిలుస్తున్నారు.

స్పిల్‌వే, గ్రావిటీడామ్ ఏర్పాటుకు వీలుగా కుదురైన 3,500 అ. పొడవున ఒడ్డు వుండడం, నదీ గర్భంలో తేలిగ్గా రాయి లభ్యం కావడం, నిర్మాణమప్పుడు నదిని మళ్ళించడానికి వీలైన ఏర్పాట్లు వుండడం — యీ కారణాలవల్ల యీ ప్రాంతాన్ని ఆనకట్ట నిర్మాణానికి ఎన్నిక చేశారు. ఈ ప్రాంతానికి దగ్గరి రైలు స్టేషను పెద్దపల్లి. ఇది 23 మైళ్ళ దూరంలో వుంది.

ఈ ఆనకట్ట నిర్మాణాన్ని చేపట్టడానికై ఒక సర్కిలును కూడా మంజూరు చేయడం జరిగింది. ఆనకట్ట 1975 జూన్ నాటికి పూర్తవుతుంది. ఈ మానేరు ప్రాజెక్టు కరీంనగర్ జిల్లా స్వరూప స్వభావాలనూ, ఆర్థిక వ్యవస్థనూ మార్చివేయుగలదు. ఇది యావత్ రాష్ట్రం — ముఖ్యంగా తెలంగాణా ప్రాంతం — సర్వతోముఖాభివృద్ధికి దోహదం చేస్తుంది. 

# అహింసాత్మక విప్లవవాది

—హుమాయున్ కబీర్

పాశ్చాత్య రాజ్యాల ప్రభావ ప్రాబల్యాలు ప్రపంచం అంతటా పరివ్యాప్తమై ఉన్న కాలంలో మోహన్ దాస్ కరమ్ చంద్ గాంధీ జన్మించారు. అనాడు పాశ్చాత్య దేశాల రాజకీయ ప్రాబల్యమే కాక ఆర్థిక, సాంస్కృతిక, వైజ్ఞానిక రంగాలలో కూడా వారి ప్రాబల్యం తిరుగు లేనిదిగా ఉండేది. భారతదేశం, ఆ మాటకు వస్తే మొత్తం ఆసియా, ఆఫ్రికా ఖండాలు రాజకీయ స్వాతంత్ర్యం, ఆర్థికాభ్యున్నతి, నైతిక శక్తి కోల్పోయి దీనస్థితికి దిగజారాయి. భారతదేశంలో పూర్వ వైభవ పునరుద్ధరణకై మొగలాయి చక్రవర్తీ, ఆయిన అనుయాయులూ చేసిన చిట్టచివరి ప్రయత్నం—1857 నాటి సిపాయిల విప్లవం—విఫలమైంది. టర్కీ క్రమంగా బలహీనమైంది. టర్కీ సామ్రాజ్యం శీఘ్రంగా విచ్ఛిన్నం కావడం ప్రారంభమైంది. చైనా, జపాన్‌లలో నూతన పరిణామాలువచ్చాయి. రష్యా ఆసియాలోకి తూర్పుగా, దక్షిణంగా చొచ్చుకొని రావటం, ప్రాబల్యం పెంచుకోవటం జరిగింది. పాశ్చాత్య రాజ్యాల సామ్రాజ్య తత్త్వం విజృంభించి ప్రపంచం నలుమూలలా వ్యాపించింది. పశ్చిమ రాజ్యాల ఆధిక్యతకు తల ఒగ్గక తప్పదేమోనని పలువురు ఆసియా, ఆఫ్రికా ఖండవాసులు భావించ నారంభించారు. గాంధీ మహాత్ముడు మృతి చెందడానికి పూర్వం ఈ రకమైన నైరాశ్యం తొలిగిపోయింది. ప్రజలలో నూతన ఆశాభావం, ఆకాంక్ష కలిగాయి. ఆత్మవిశ్వాసం పెంపొందింది. ప్రజలలో ఆత్రుత పెరిగింది ఆసియా, ఆఫ్రికా దేశాలలో ప్రజా జీవితంలో నూతన వికాసం కలిగింది. వారిలో నవ చైతన్యం వెల్లివిరిసింది. వారు ప్రపంచంలో తమకు రావలసిన స్థానం రావాలని కోరారు. ఈ పరిణామాలకు గాంధీ కారకులు కాదు. ఆయన ప్రధానంగా భారత ప్రజల పునరుద్ధరణకు కారణభూతులు అయ్యారు. భారత దేశంలో చైతన్యం కలగడంతో ఆసియా, ఆఫ్రికా ఖండాలలో మారుమూల ప్రాంతాలు కూడా ప్రభావితం అయ్యాయి ఆ కాలంలో పరాయి పాలన క్రింద ఉన్న మరే ఇతర దేశానికి చెందిన వ్యక్తికి కూడా అంతటి విశిష్ట స్థానం లభించలేదు. ఆయన దివంగతులైన పది సంవత్సరాలలో సామ్రాజ్య వాదం ప్రపంచంలో అన్ని చోట్లకూడా క్షీణించడం ప్రారంభం అయింది.

## సహనంలో వున్న విప్లవశక్తి

భారత ప్రజల సహనంలో నిగూఢంగా నిబిడీకృతమై ఉన్న శక్తిని బహిర్గతం చేసి విడుదలచేయడానికి ఆయన ప్రయత్నాలు సఫలం కావడంలోనే ఆయన విప్లవశక్తి తాలూకు ప్రాధాన్యం ప్రపంచానికి వెల్లడి అయింది భారత ప్రజలు పరిపాలనలో అనేక కష్టాలు పడ్డారు అనేక అన్యాయాలు భరించారు. చైతన్యవంతులయిన మరొక జాతి ప్రజలయితే ఏనాడో తిరుగుబాటు లేవదీసేవారు. వారి స్తబ్ధత, వారి సహనంచూచి వారి మిత్రులు, శత్రువులు కూడా అది వారి బలహీనతగా పొరబడడం జరిగింది. భారతీయ నాయకులే భారత ప్రజల స్వభావాన్ని బట్టి బహిరంగంగా ప్రత్యక్షంగా పెద్ద విప్లవం తీసుకొని వచ్చే అవకాశంలేదని గట్టిగా వాదించారు. గాంధీ ప్రజల స్వభావాన్నీ వారి సహజ లక్షణాలనూ గుర్తించకపోలేదు. వారిలో నిగూఢంగా అనంతంగా ఉన్న శక్తిని వెలికి తీసుకొనివచ్చి వారికి ఒక కొత్త రాజకీయ పంథా చూపించారు. హింసాత్మకమైన, పెద్ద ఆర్భాటంతో కూడిన విప్లవానికి బదులుగా సహాయ నిరాకరణ ఉద్యమం ప్రారంభించారు. అటువంటి ఉద్యమంలో భారత ప్రజలను సహజమైన సాత్విక, సహన గుణాలు శక్తిసామర్థ్యాల ప్రదర్శనకు అనుగుణమైనవారిగా రూపొందించడ జరిగింది. భారత ప్రజానీకం రాజకీయ లక్ష్యంవైపు పురో

గమనం ప్రారంభించేసరికి భారతీయులలో సహజంగా ఉన్న శక్తి వెల్లువికి విప్లవశక్తిగా రూపొందింది. ప్రజల ఆత్మగౌరవం పునరుద్ధరించబడింది. అందుమూలంగానే వారి ఆధ్యాత్మిక విలువలకు తిరిగి గౌరవం లభించింది.

పాశ్చాత్య రాజ్యాల ఆధిపత్యాన్ని ధిక్కరించిన నూతన నాయకులలో గాంధీ ఒకరు. కాని ఆయన మానవ జాతికి వారసత్వ సంపద కాగల విలువలను తిరస్కరించలేదు. ఐరోపాలో వైజ్ఞానిక శాస్త్ర రంగంలో వచ్చిన బృహత్పరిణామం మూలంగా మానవ జాతికి అనేక రంగాలలో విస్తృతావకాశాలు లభించాయి. సాంకేతిక రంగంలో సాధించిన అపూర్వమైన అభివృద్ధి మూలంగా మానవాళి క్షుద్బాధా నివారణకూ, వ్యాధుల నివారణకూ అవకాశాలు పెరిగాయి. ఇక రాజకీయ రంగంలో సర్వత్రా ప్రజాస్వామ్య వ్యవస్థాపనకు అనుకూల్యం కన్పించింది. హేతువాదం బలపడడంతో విద్యా వ్యాప్తి ద్వారా అన్ని రకాల దురాచారాలనూ, రుగ్మతలనూ రూపుమాపడానికి అవకాశం ఉన్నదన్న ఆశాభావం ప్రబలింది. అనేక రంగాలలో ఐరోపా ముందడుగు వేసింది. ఐరోపా ముందుకు దారి తీసిన ప్రతి రంగంలోనూ మిగతా దేశాలన్నీ దానిని అనుసరించడం జరిగింది.

**మానవుల కష్టాలను తొలగించడానికి వైజ్ఞానిక శాస్త్ర రంగంవల్ల జరిగిన దోహదాన్ని గాంధీ గుర్తించారు కాని, దానిని పురస్కరించుకొని దీని ఫలితంగా వచ్చిన ఐహిక భోగలాలసతను ఆయన నిరసించారు.**

ఐరోపా వాసులు రాజకీయ స్వాతంత్ర్యంకోసం పోరాడి, తుదకు ఆర్థిక రంగానికి సంబంధించి అసహ్యకరమైన బానిసత్వానికి తల ఒగ్గారని ఆయన భావించారు. మామూలు యంత్రాలు మానవ సంక్షేమ సాధనకు అవసరం కావచ్చును. కాని ఐరోపాలో లాగా మనుష్యులు యంత్రాలకు దాదాపు బానిసలు కావడం ఆయనకు గిట్టదు. అక్కడి పరిస్థితులను మెరుగుపరచడానికి ఆయన సత్యాన్వేషణ ప్రయత్నాల మూలంగా సాధనోపాయాలను కనుగొన్నారు.

యంత్రాల దుర్వినియోగం మూలంగా కొందరి చేతులలో సంపద కేంద్రీకృతం అయింది. పారిశ్రామికీకరణకు దారి తీసింది, క్రొత్త నాగరకత తల ఎత్తింది. ఈ దుష్ఫలితాలను తప్పించుకోడానికి గాంధీ క్రొత్త మార్గం చూపించారు. స్వపరిపాలన, స్వయం సమృద్ధికల గ్రామాల అభివృద్ధి, సమాజ నిర్మాణానికి ప్రాతిపదిక కావాలన్నారు గాంధీ. అలా జరిగినప్పుడు వ్యక్తుల మధ్య సంబంధాలు దృఢపడడానికీ, వ్యక్తి స్వాతంత్ర్యం పెరగడానికీ నియంతృత్వ ధోరణికి అవకాశం లేకుండా చెయ్యడానికీ వీలవుతుందని గాంధీ అభిప్రాయపడ్డారు.

## ఆర్థిక స్వాతంత్ర్యం

వ్యక్తుల ఆర్థిక స్వాతంత్ర్యం తాలూకు ప్రాధాన్యాన్ని గాంధీ గుర్తించారు. ఆర్థిక స్వాతంత్ర్యం లేనిదే రాజకీయ స్వాతంత్ర్యం కేవలం హాస్యాస్పదం కాగలదనీ, ప్రజాస్వామ్యం నిరర్థకం కాగలదనీ అభిప్రాయపడ్డారు. అక్రమంగా, విపరీతంగా సంపద కేంద్రీకృతం కావడం వల్ల వ్యక్తి పరమైన, వ్యక్తుల ఆధీనంలో ఉండే కర్మాగారాలు, ఇతర కేంద్రాలలో ఉత్పత్తి పెరుగుతుంది. వ్యక్తుల చేతులలో సంపద విపరీతంగా కేంద్రీకృతం కాకుండా నివారించడానికీ లేదా పరిమితం చేయడానికీ పరిశ్రమలను వికేంద్రీకరించాలని పరిష్కార మార్గం సూచించారు గాంధీ. వ్యక్తి స్వాతంత్ర్యానికి గాంధీగారు అధిక ప్రాధాన్యం ఇచ్చారు. విధులను నిర్వహించినప్పుడే హక్కులు లభిస్తాయని ఆయన విశ్వసించారు. జీవితంలో మంచిని, సౌఖ్యాన్ని అందరూ పంచుకోవాలని ఆయన అభిప్రాయపడ్డారు. అయితే ఈ లక్ష్యం సాధించడానికి హింస ఎన్నటికీ పనికిరాదని ఆయన ఉద్ఘాటించారు. అనాది నుంచి కూడా మతాచార్యులు మానవుడు విద్వేషంతో మనుగడ కొనసాగించలేడని ప్రబోధించారు. గతంలో అహింస కేవలం వ్యక్తిగతమైన విషయంగా ఆచరణలో ఉండేది. కొంతమందికలిసి అహింసాత్మక చర్యకు, ఉద్యమానికి పూనుకోవడంలో గల ప్రాధాన్యం, ప్రయోజనం మొదటిసారిగా గాంధీ ప్రజలకు ఎత్తిచూపారు. ప్రముఖ రాజకీయ వాదిగా ఆయన పేరు గడించారు. అందువల్ల కేవలం ఆశావాదిగా ఆయన్ను పరిగణించడానికి వీలు లేదు. రాజకీయ లక్ష్యాలు సాధించడానికి అహింసా సిద్ధాంతాన్ని ఒక సాధనంగా ఉపయోగించవచ్చునని ఆయన చేసిన ప్రచారానికి ప్రపంచంలో పలుచోట్ల ఆదరణ లభించింది. ఫలితంగా విభిన్న వర్గాల వారు తమ సమస్యలను పరిష్కరించుకోడానికి ఈ సాధనాన్ని వినియోగించడం జరిగింది. దుష్టత్వాన్ని పారద్రోలడానికి, అహింసాత్మకమైన ఉద్యమాలు నడిపేందుకు ఆయన కృషిచేశారు.

**దేశ ఆంతరంగిక వ్యవహారాలలో అయినా, విదేశ వ్యవహారాలలో అయినా అవతలవారికి నచ్చచెప్పి మనవైపుకు త్రిప్పుకోవడమే ఉత్తమ పద్ధతి అనీ, అది ఒక్కటే నాగరికమైన పద్ధతి అనీ ఆయన ఉద్ఘాటించారు. ఏ సందర్భంలో అయినప్పటికీ బలప్రయోగం కూడదనీ దానికి బదులుగా నైతికంగా ఒత్తిడి తీసుకొనిరావడం జరగాలనీ ఆయన వివరించారు.**

చెడును అహింసాత్మకమైన పద్ధతిలో నిరోధించడమే ఆయన సిద్ధాంతంలోని సారాంశం. ఈ కార్యక్రమం వ్యక్తి విషయంలో ఆరంభం కావాలనీ, తద్వారా ఇతర వ్యక్తులు ప్రభావితులు కావాలనీ ఆయన విశ్వసించారు. వ్యక్తిగతమైనవీ. పలువురు వ్యక్తుల మధ్యవున్నవీ అయిన ఉద్రిక్తతలను సడలించడానికి ఈ కార్యక్రమం ఎంతో ఉపయుక్తం అవుతుంది. అంతర్జాతీయ స్థాయిలో ఉండే ఉద్రిక్తతలను సడలించడానికికూడా ఈ పద్ధతులే అనుసరించాలని ఆయన ప్రబోధించారు. వివిధ వ్యక్తుల మధ్య, వివిధ జాతుల మధ్య అసమానతలు ఉండటంవల్లనూ, న్యాయం

(తరువాయి 21వ పుటలో)

# రాష్ట్రంలో అనుబంధ కళాశాలలు

—పీరమాచనేని వెంకట నారాయణ

భారత దేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశాలకు విద్య ప్రధానసమస్య. అందులో ఉన్నత విద్యా సమస్య అతి ముఖ్యమైనది. స్వాతంత్ర్య సముపార్జనానంతరం మన దేశం ఉన్నత విద్యతోపాటు మిగిలిన రంగాలలోనూ పురోగమిస్తున్నది. ఈ మధ్య కాలంలో విద్యారంగంలోని వివిధ శాఖలలో చెప్పుకోదగ్గ కొత్త కొత్త ప్రయోగాలు జరిగాయి. అనుబంధ కళాశాలలో ఉన్న విద్యార్థుల సంఖ్య ఉన్నత విద్యా సంస్థలన్నింటిలోఉన్న విద్యార్థుల మొత్తం సంఖ్యలో నూటికి 85 నుండి 90 వరకూ వున్నది. ఇందులో గ్రాడ్యుయేట్ కాకుండానే విద్యాభ్యాసాన్ని ముగించిన వారు అధిక సంఖ్యలో ఉన్నారు. పోస్టు గ్రాడ్యుయేట్ విద్యకు, రిసెర్చికి తగిన వారిని సమకూర్చడంలో ఈ అనుబంధ కళాశాలలు చేస్తున్న కృషి ఎన్నదగినది.

పోస్టు గ్రాడ్యుయేట్ విద్య అభ్యసిస్తున్న వారిలో మూడు వంతుల మంది అనుబంధ కళాశాలల నుండి వచ్చినవారే. భవిష్యత్తులో అనుబంధ కళాశాలల విద్యార్థుల సంఖ్య కంటే విశ్వ విద్యాలయ విద్యార్థుల సంఖ్య పెరిగినా పెరగవచ్చు. అయినప్పటికీ ఉన్నత విద్యా విధానంలో అనుబంధ కళాశాలలు ప్రముఖ పాత్ర వహించక తప్పదు. ఒకటి రెండు దశాబ్దాలలో పోస్టుగ్రాడ్యుయేట్ విద్యను అనుబంధ కళాశాలలోనే బోధించే అవకాశము లేకపోలేదు. నాకు తెలిసినంతవరకు మనదేశంలో ప్రయివేటు యాజమాన్యంలో స్థాపించిన కళాశాలలు రెండు వేలకు పైగా ఉన్నాయి. ప్రతి సంవత్సరం సగటున వంద కళాశాలలు స్థాపించడంతో అనుబంధ కళాశాలలసంఖ్య శీఘ్రగతిని పెరుగుతూనే ఉంది. 1950వ సంవత్సరం వరకూ పట్టణ ప్రాంతాలలోనే ఎక్కువగా ఈ కళాశాలలు స్థాపించబడుతూండేవి. ఆ తరువాత గ్రామీణ ప్రాంతాలలో కళాశాలల స్థాపనావశ్యకత అధికమవుతూ వచ్చింది. పదివేలలోపు జనాభా కలిగిన గ్రామాలలో కూడా కళాశాలలను స్థాపిస్తున్నారు. వాటిలో కొన్నిటిలో వందమంది విద్యార్థులుకూడ లేరు. కళాశాలలు ఆర్థికంగా లోటుపాట్లు లేకుండా చక్కగా నిర్వహించవలెనంటే కనీసం అయిదువందల మంది విద్యార్థులైనా ఉండాలి.

## విద్యావిధానం

ఇది ఇలా ఉండగా రెండువేలకు పైగా విద్యార్థులున్న కళాశాలలుకూడ వున్నాయి. కలకత్తాలో ఉన్న కొన్ని కళాశాలల్లో ఏడువేలకుపైగా విద్యార్థులున్నారు. ఈ కళాశాలలో అధికభాగం ప్రయివేటు యాజమాన్యంలో వున్నాయి. విశ్వవిద్యాలయం యాజమాన్యంలో వున్న కళాశాలల సంఖ్య చాలతక్కువ. మొత్తం కళాశాలల్లో నూటికి 10_15 ప్రభుత్వ యాజమాన్యంలో నడుస్తున్నాయి.

విద్యార్థులసంఖ్యా పరిమాణంలో యాజమాన్యం విషయంలో ఉన్న ఈ తేడాలవల్ల ఈ కళాశాలల విద్యాస్థాయి ఒకేతీరున ఉండక పోవడం సహజమే. ఉన్నత విద్యాప్రమాణాలు కాపాడుతూన్న కళాశాలలు కొన్ని. ఉన్నతపాఠశాలల విద్యాస్థాయిని మాత్రమే కలిగిన కళాశాలలు కొన్ని ఉన్నాయి.

పరస్పర విరుద్ధమైన ఈ విషయాల సమన్వయంకోసం విద్యావిధానాన్ని పునః పరిశీలించవలసిన అవసరం ఎంతయినా ఉంది.

ప్రజాహిత సంస్థలకు పనికివచ్చే పట్టభద్రులను రూపొందించేవి అనుబంధ కళాశాలలే. అనుబంధకళాశాలల విద్యాప్రమాణాల మీదనే ఉన్నతవిద్య ఆధారపడి ఉంది. కనుక ఉన్నత విద్యకు సంబంధించిన అభ్యుదయ పథకాలను అనుబంధ కళాశాలల స్థాయిలోనే ప్రవేశపెట్టాలి. ప్రధానమైన ఈ విషయాన్ని నిర్లక్ష్యం చేయడంవల్లనే స్వాతంత్ర్యసముపార్జనానంతరం కొద్దికాలంపాటు ఉన్నతవిద్యలో సంతృప్తికరమైన ఫలితాలు సాధించలేకపోయాము. ద్వితీయ, తృతీయ పంచవర్షప్రణాళికలలో యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్‌వారు అనుబంధకళాశాలలలోని ఉపాధ్యాయుల వేతనాలను సవరించి వారి స్థితిగతులను మెరుగుపరచారు. ప్రస్తుతపరిస్థితులలో ఉపాధ్యాయులకు గ్రాంట్సుకమిషన్‌వారు చేసిన సహాయం స్వల్పం. ఎడ్యుకేషన్ కమిషన్ అనుబంధ కళాశాలల ప్రాధాన్యాన్ని ఉగ్గడించింది. గత కొద్ది సంవత్సరాలుగా ఈ సంస్థల ప్రాధాన్యం గుర్తింపబడుతున్నందుకు చాల సంతోషం.

కళాశాలల స్థాపన సందర్భంలో అనుకూల స్థలనిర్ణయం, చక్కటి ప్రణాళిక చాలా ముఖ్యం. ఆర్థికమైన ఇబ్బందులకు లోను కాకుండా సరిగా విద్యాసంస్థలు నిర్వహింపబడాలంటే విద్యార్థుల సంఖ్య ఒక పరిమితికి లోబడి ఉండడం అవసరం. ఈ సంఖ్యా పరిమితి విషయం సాంకేతిక కళాశాలలకు సంబంధించినంతవరకూ

మరీ ముఖ్యం. పేరుప్రతిష్ఠల నార్జించడానికి కళాశాలల స్థాపన ఒకసాధనంగా కొందరు భావిస్తున్నారు. కుగ్రామాలు సయితం కళాశాలల స్థాపనకు అనువైన స్థలాలుగా అనుమతించడం మంచిది కాదు. దీనివలన ఆ కళాశాలలు అభివృద్ధిచెందడంలేదు. సరికదా నిర్వహించడంకూడా కష్టసాధ్యమే అవుతుంది. తగిన ఆర్థికసోమతులేకుండా అసంఖ్యాకంగా కళాశాలలను స్థాపించడం ప్రోత్సహించవలెనో లేదో తేల్చవలసింది విద్యావేత్తలు, పరిపాలకులు మాత్రమే.

ఒకేతీరు సంస్థలు పెక్కుకాకుండా స్థాపకుల మధ్య అవాంఛనీయ స్పర్ధలు లేకుండా వుండి ఆర్థిక స్తోమతు కల్గి సమర్థంగా పని చేసే అనుబంధ కళాశాలలు స్థాపించే స్థలాల నిర్ణయం విషయంలో విశ్వవిద్యాలయాధికారులు తమకు నిర్దేశించిన ప్రాంతాల్లో పర్యటించి నిర్దుష్టమైన పథకాలను రూపొందించాలి. వాస్తవానికి ప్రస్తుతం వున్న కళాశాలలు చక్కగా నిలదొక్కుకుంటేనేగాని సర్వతోముఖమైన అభివృద్ధిని సాధించడానికి వీలువుండదు.

## కళాశాలల స్థాయి

ప్రస్తుత విద్యావిధానాన్ని అభివృద్ధి చేయడంలో విశ్వవిద్యాలయాల పాత్ర ప్రాముఖ్యమైనది. విద్యా ప్రమాణాలు పడిపోకుండా చూడవలసిన బాధ్యత విశ్వవిద్యాలయాలదే. కనుక క్రొత్తగా కళాశాలలకు ఎఫిలియేషన్ ఇచ్చేటప్పుడుకాని పాత కళాశాలలకు ఉన్న ఎఫిలియేషన్‌ను పొడిగించేటపుడుగాని విశ్వవిద్యాలయాలు చాల జాగ్రత్తగా వ్యవహరించాలి. సమర్థులైన ఉపాధ్యాయులు, చక్కటి గ్రంథాలయాలు అన్ని సదుపాయాలు కలిగిన ప్రయోగశాలలు వుంటేనే కాని కళాశాలలు చక్కగా పనిచేయలేవు. అంతేగాక పాలకవర్గనియమావళి నిర్దుష్టంగా రూపొందించాలి. ఇలాలేకపోవడంచేత అనేకమైన ఒత్తిడులకులోనై తరచు నియమాలను ఉల్లంఘించడం జరుగుతుంది. ఇకముందైనా విద్యాప్రమాణాలు కాపాడవలసిన విశ్వవిద్యాలయాలు ఈ నియమోల్లంఘనం జరుగకుండా చూడవలెనని అభ్యర్థించడం అత్యంత సముచితం.

ప్రయివేటు యాజమాన్యంలో ఉన్న అనుబంధ కళాశాలల సంఖ్య ఎక్కువ కాబట్టి వాటికి సంబంధించిన గ్రాంట్-ఇన్-ఎయిడ్ (grant in and) కోడ్‌ను పునః పరిశీలించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నదని విద్యాధికారుల దృష్టికితేదలచాను. కష్టం, క్లిష్టం ఐన ఈ సమస్యా పరిష్కారానికి కొన్ని మార్గాలను సూచించడానికి సాహసిస్తున్నాను.

కళాశాలలో విద్యాప్రమాణాలు కాపాడే బాధ్యత విశ్వవిద్యాలయానిదే కనుక అందుకు సంబంధించిన నియమాలనేవో అదే నిర్దేశిస్తుంది ఆర్థిక వనరులను సమకూర్చేది రాష్ట్ర విద్యాశాఖ. నియమాలను నిర్దేశించే విశ్వవిద్యాలయాలకు ఆర్థికవనరులను సమకూర్చే రాష్ట్రవిద్యాశాఖకు మధ్య సమన్వయ భావం ఉంటేనే కాని ఈ నియమాలను అమలు పరచడం సాధ్యంకాదు. అనుబంధ కళాశాలల నిర్వహణకు అభివృద్ధికి రాష్ట్ర విద్యాశాఖ గ్రాంటులిస్తుందే తప్ప కళాశాలలోని విద్యాప్రమాణాలను అభివృద్ధి చేయడంలో దానికి ఎట్టి పాత్ర లేదు. విద్యా ప్రమాణాలనుకాపాడే బాధ్యత ఆర్థికవనరుల సమకూర్చే అధికారం రెండు ప్రత్యేక సంస్థల చేతులలో ఉండడం సిద్ధాంత రీత్యా విరుద్ధ విషయం ఇది ఆచరణలో చాల విపరీత పరిణామాలకు దారితీయగలదు. విశ్వవిద్యాలయాలకు గ్రాంట్లు ఇచ్చే అధికారంగల రాష్ట్ర విద్యాశాఖకు విద్యాప్రమాణాలు కాపాడే బాధ్యత అప్పజెప్పడం తగదనే విషయం అందరకూ తెలిసిందే అనుబంధ కళాశాలలకు సక్రమంగా గ్రాంట్లను మంజూరుచేసే ప్రణాళికలో రాష్ట్ర విద్యాశాఖకు విశ్వవిద్యాలయానికి పొత్తు కుదర్చగలిగిన కార్యవర్గమొకటి అవసరం. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులతో, రాష్ట్ర విద్యాశాఖ ప్రతినిధులతో కూడిన కమిటి ఈ కార్యవర్గం నిర్వర్తించే విధులను పర్యవేక్షిస్తూ ఉండాలి. ఇందు మూలంగా గ్రాంట్లు యిచ్చే విధానం సులభమౌతుంది. అనుబంధ కళాశాలల అభివృద్ధికి చక్కటి కార్యక్రమాలను కూడా రూపొందించుకొనవచ్చు.

## గ్రాంట్లు, ప్రత్యేకగ్రాంట్లు

ఉన్నత విద్యాప్రమాణాలను సాధించేందుకు అనుబంధ కళాశాలలు అనవరతం కృషిచేస్తున్నాయి. అందుకు అనుకూల వాతావరణం చక్కటి పరిస్థితులు ఎంతైనా అవసరం.

త్రికరణ శుద్ధిగా విద్యాబోధన కంకితమైన ఉపాధ్యాయులూ ఉత్సాహపూరితులైన విద్యార్థులూ, విద్యార్థులలోను, ఉపాధ్యాయులలోను విశ్వాసం పాదుకొల్పే యాజమాన్యం వీటిపై ఇది ఆధారపడింది. కరుడు గట్టిన పాత పద్ధతులకు-రెడ్ టేప్ విధానాలకు అతీతంగా ఉన్నప్పుడే వేగంగా పనులుసాగుతాయి.

ప్రస్తుతం ఇస్తున్నట్లుగానే అన్ని కాలేజీలకు గ్రాంటుల నివ్వాలి. ఇక పోతే సంస్థ సాధించే విజయాలను బట్టి సామర్థ్యాలను బట్టి ప్రత్యేకగ్రాంట్లు ఈయడం మంచిది. గ్రాంట్లను ఈ రెండు పద్ధతులలో ఇవ్వడం మూలంగా మంచి ఫలితాలను సాధించవచ్చు. నిష్పక్షపాత మైన పరిపాలనా పద్ధతిపై ఎన్నిక విధానం ఆధారపడి ఉంది. కనుక సహజంగా కొన్ని సాధక బాధకాలువుంటాయి.

కళాశాలలు స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉండాలని ఆందోళన చేస్తున్నారు. చాలావిశ్వ విద్యాలయాల చట్టాలలో కళాశాలలను స్వతంత్రపతిపత్తి కలిగిన సంస్థలుగా ఉంచడానికి అవకాశం ఉంది. కాని, చాలా రాష్ట్రప్రభుత్వాలు విశ్వవిద్యాలయాలు ఉపయుక్తమైన ఈ సూచనను అంగీకరించినా అమలు పరిచేందుకు ముందుకు రావడం లేదు. ఈ సంస్కరణను అమలు పరిస్తే మంచి కళాశాలలు ఉన్నత స్థాయిని నిలబెట్టేందుకు తగ్గస్వేచ్ఛను కలిగి ఉంటాయి.

స్వతంత్ర ప్రతిపత్తిని కలిగిన ఈ కళాశాలలలో కొన్ని కాలక్రమేణా విశ్వవిద్యాలయాల స్థాయిని అందుకొనే అవకాశం ఉంది. అనుబంధ కళాశాలలలో కొన్ని అయినా అత్యున్నత స్థాయి గలిగి ప్రత్యేకస్థానం ఆక్రమించేటట్టు కృషిచేయడంలో కళాశాలల పాలకవర్గాల వారు ఎంతయినా పాటుపడగలరని ఆశిద్దాము. ★



# అనావృష్టి ప్రాంతాలలో సాగునీటి సౌకర్యాల కల్పన

-జి. ఏ. నరసింహారావు

భారతదేశంలో వర్షంమూలంగా ఏటా సగటున సుమారు 3700,440 మిలియన్ల ఘనపు మీటర్ల నీరు లభిస్తున్నది. మొత్తం దేశానికి అంతటికికలిపి 114.3 సెంటీమీటర్ల (45 అంగుళముల) నీరు సరిపోతుంది. ఈ వివరాలు పైకి చూడడానికి సంతృప్తికరంగా కనిపిస్తాయి. కాని వాస్తవానికి పరిస్థితి సంతృప్తికరంగా లేదు. దేశంలో అన్ని ప్రాంతాలలో వర్షపాతం ఒకేలా ఉండకపోవడం, సకాలంలో వర్షాలు పడకపోవడం ఇందుకు కారణం. రాజస్థాన్‌లో కొన్ని ప్రాంతాలలో 12.70 సెంటీమీటర్ల (5 అంగుళాల) కంటె తక్కువ కావడంవల్ల తీవ్ర అనావృష్టి ఏర్పడింది. మరొక ప్రక్కన అస్సాములో పర్వతప్రాంతాలలో 1220 సెంటీమీటర్ల (500 అంగుళముల) వర్షంపడ్డది.

మొత్తంమీద చూస్తే దేశంలో నూరింట 12 వంతుల ప్రాంతాలలో సగటున వర్షపాతం 61 సెంటీమీటర్లు (24 అంగుళములు) మాత్రమే. నూరింట 8 వంతుల ప్రాంతములో 254 సెంటీమీటరులు (100అంగుళములు) వర్షపాతం ఉంటున్నది.

వర్షాలు చాల ఆలస్యంగా పడడం, ఇతర కాలాలలో ఉష్ణోగ్రత చాలా ఎక్కువగా ఉండడం కారణంగా అనావృష్టి పరిస్థితి ఏర్పడుతున్నది. ఈ పరిస్థితుల మూలంగా గత పది సంవత్సరాలలో దేశంలో అనేక ప్రాంతాలలో వ్యవసాయోత్పత్తి దెబ్బతిన్నది. 1965లో ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మైసూర్, ఒరిస్సా, రాజస్థాన్, పశ్చిమ బెంగాలు రాష్ట్రాలలో కొన్ని ప్రాంతాలలో తీవ్ర అనావృష్టి ఏర్పడింది. ఈ రాష్ట్రాలమొత్తం విస్తీర్ణం దేశం విస్తీర్ణంలో నూరింట 65 వంతులు.

1966లో కూడా పరిస్థితి మెరుగు కాలేదు. బీహారు, గుజరాత్, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్‌లలో కొన్ని ప్రాంతాలలో అనావృష్టి ఏర్పడింది. వీటిలో ఉత్తర ప్రదేశ్, రాజస్థాన్‌లలోని ప్రాంతాలు ఎక్కువగా దెబ్బతిన్నాయి. 1968లో వర్షాభావం మూలంగా ఆంధ్రప్రదేశ్‌లో రాయలసీమ ప్రాంతం, మైసూరు, తమిళనాడులో కొన్ని ప్రాంతాలు బాగా దెబ్బతిన్నాయి.

కరువు ఏర్పడినప్పుడు ప్రజలకు సహాయం చేసేందుకుగాను ప్రభుత్వం సహాయక కార్యక్రమాలు అమలు పరుస్తుంది. ప్రజల కొనుగోలు శక్తి పడిపోకుండా నివారించేందుకు ఈ కార్యక్రమాలు ఉద్దేశించ బడినాయి. నిర్మాణాలు, బావులు, చెరువులు వంటి చిన్న తరహా నీటి పారుదల నిర్మాణాలు, భూసారరక్షణ పథకాలు, కాలువల అభివృద్ధి, అడవుల పెంపకం రోడ్ల నిర్మాణం, అభివృద్ధి వ్యవసాయదారులకు పరపతి సౌకర్యాల కల్పనవంటి వాటిని ఈ కార్యక్రమాల క్రింద అమలు జరుపుతారు. దేశం మొత్తంమీద అనావృష్టి ఏర్పడిన ప్రాంతాలకు సహాయం చేయడానికి గాను గత సంవత్సరాలలో 1966_67లో రూ. 82 కోట్లు, 1967_68లో 76 కోట్లు 1968_69లో రూ. 106 కోట్లు, కేంద్రప్రభుత్వం వ్యయంచేయడం జరిగింది.

ఇటువంటి తాత్కాలిక చర్యలు కాక శాశ్వత ప్రయోజనం కలిగించేందుకు పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పథకాలు, లోతు ఎక్కువగా ఉండే గొట్టపు బావుల త్రవ్వకానికి సంబంధించిన పథకాలు అమలు జరుపుతారు.

దేశంలో వ్యవసాయ యోగ్యమైన భూమి విస్తీర్ణం 480 మిలియన్ల ఎకరాలు కాగా 390 మిలియన్ల ఎకరాల విస్తీర్ణం గల ప్రాంతం మాత్రమే వ్యవసాయం క్రిందకు వచ్చింది. 90మిలియన్ల ఎకరాలకు మాత్రమే సాగునీటి సౌకర్యం ఉన్నది.

దేశం మొత్తంమీద 200 మిలియన్ల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు కల్పించడానికి వీలున్నది. ఇందులో 150మిలియన్ల ఎకరాలకు నిశ్చయంగా సాగు నీరు సరఫరా చేయడానికి వీలున్నది. ప్రస్తుతం అమలు జరుగుతున్న పథకాలను చతుర్థ ప్రణాళికలో పూర్తి చెయ్యాలని ఉద్దేశిస్తున్నారు. ఇందుమూలంగా గత నాలుగు అయిదు సంవత్సరాలలో అనావృష్టి వల్ల ఏర్పడిన క్లిష్ట పరిస్థితి తొలగి పోగలదని ఆశిస్తున్నారు. మైసూర్, ఆంధ్రప్రదేశ్‌లలో క్షామం, కొరత ఏర్పడిన ప్రాంతాలను సస్యశ్యామలంగా మార్చివేసిన తుంగభద్ర వంటి ప్రాజెక్టుల విషయమై ప్రణాళికలలో ఇంకా ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వవలసి ఉన్నది. ఇటు రాష్ట్రాలలోనూ, అటు కేంద్రంలోనూ కూడా క్షామ ప్రాంతాల శీఘ్ర అభివృద్ధినిమిత్తం బృహత్ప్రణాళికలు రూపొందించవలసిన అవసరం ఉన్నది. దేశంలో క్షామానికి గురి అవుతున్న ప్రాంతాలు ఏవో గుర్తించడం జరిగింది, ఆంధ్రప్రదేశ్, గుజరాత్, మహారాష్ట్ర, మైసూరు, తమిళనాడులలో ఈ పరిశీలన పూర్తి అయినది.

బృహత్ప్రణాళికల పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పథకాల ద్వారా సాగునీటి సౌకర్యాలు కల్పించడానికీ, భూగర్భ జల సంపదను వినియోగంలోకి తీసుకొని రావడానికి ఉద్దేశించినవి. వీటి అమలు నిమిత్తం అనావృష్టి ప్రాంతాలలో పెద్ద ఎత్తున అనేక రకాల పరిశీలనలు నిర్వహించవలసిన అవసరం ఉన్నది. అనావృష్టి సమస్య దేశానికి అంతటికీ సంబంధించిన విషయంగా పరిగణించాలి ఆధికంగా నీరులభించే నదులనుంచి నీటిని ఇటువంటి ప్రాంతాలకు మళ్ళించాలి. అనావృష్టికి కూడా తట్టుకునే పంటలు వెయ్యడం విషయమై పరిశోధన జరగాలి. తరచుగా అనావృష్టికి గురిఅయ్యే ప్రాంతాలలో మెట్ట పంటలు పండించమన్న నూతన వ్యవసాయ పద్ధతులు అవలంభించాలి. ఇటువంటి ప్రాంతాలలో ఎక్కువ దిగుబడి ఉండే విత్తనాలు రసాయన ఎరువులు వాడడం, సస్యసంరక్షణ చర్యలు తీసుకోవడం కూడా జరగాలి. మొత్తం అటువంటి ప్రాంతాలలో సాగునీటి సౌకర్యాలులేని సందర్భాలలో క్షామనివారణ సహాయక కార్యక్రమాలలో భాగంగా మధ్యతరహా నీటిపారుదల నిర్మాణాల అభివృద్ధి, రోడ్ల నిర్మాణం, అభివృ, భూసార రక్షణ నిమిత్తం కట్టల నిర్మాణం, అడవుల పెంపకంవంటి కార్యక్రమాల అమలు నిమిత్తం దీర్ఘకాలిక ప్రణాళికలు రూపొందించడం కూడా అవసరం.

---

( 17వ పుటనుండి )

సాధించకపోవడంవల్లనూ, ఉద్రిక్తతలు, విద్వేషాలు ఏర్పడుతున్నాయనీ, వివిధ దేశాలమధ్య సంబంధాలు దృఢతరం కావడం వల్లనూ, కొట్టవచ్చినట్టుగా కప్పించే వ్యత్యాసాలను తొలగించడం వల్లనూ ఈ పరిస్థితి మారుతుందనీ ఆయన ప్రబోధించారు. మానవ స్వభావాన్ని మార్చడానికి ప్రయత్నించిన విప్లవవాద గాంధీ. ఆయనకు వాస్తవిక దృక్పథం ఉన్నది. ఫలితాలనుబట్టి ప్రజలు తన సిద్ధాంతాల మంచి చెడ్డలను నిర్ణయిస్తారని ఆయనకు తెలుసు. అందువల్లనే ముమ్మందుగా వ్యక్తిని — వ్యక్తి స్వభావాన్ని మార్చడానికి ప్రయత్నించారు. మొటట్లో చిన్న కార్యక్రమాలను అతి నిరాడంబరంగా ప్రారంభించారు. అవి క్రమంగా బ్రహ్మాండమైన ఉద్యమంగా రూపొందగలవని ఆయన విశ్వాసం. లక్ష్యశుద్ధి ఉంటే చాలు — ఉత్తమ లక్ష్యాన్ని సాధించడానికి ఏ పద్ధతులైనా అనుసరించవచ్చుననే వాదాన్ని ఆయన తిరస్కరించారు. లక్ష్యం, లక్ష్య సాధన పద్ధతులు రెండూ కూడా ముఖ్యమైనవేననీ, రెండూ ఉత్తమమైనవిగా ఉండాలనీ గాంధీ విశ్వసించారు. ఏ సందర్భంలోనూ ఆయన ధైర్యాన్ని విడనాడలేదు. సదవగాహన, దయాదాక్షిణ్యాలు, సౌభ్రాతృత్వం అన్నింటికంటె ముఖ్యమైనవని ఆయన ప్రబోధించారు. అపూర్వమైన ధైర్యంతోనూ, సహనంతోనూ, ఆయన తను నమ్మిన సిద్ధాంతాలను ప్రచారం చేశారు. ఆయన మాటల్లో ఎప్పటికప్పుడు నూతనమైన మాధుర్యం కన్పిస్తుండేది. కార్యాచరణలోనూ అందరికీ అటువంటి సమాకర్షణ కప్పించింది. ఆయనతో పరిచయభాగ్యం కలిగిన ప్రతి వ్యక్తీ పూర్వం కంటె పవిత్రుడూ, ఉత్తముడూ కావడం జరిగింది.



# బాపూ

హిందీ
సుమిత్రానందన్ పంత్

తెలుగు
మానేపల్లి సత్యనారాయణ

[ప్రఖ్యాత హిందీ కవి శ్రీ సుమిత్రానందన్ పంత్ బాపూజీ పై అనేక కవితలు వ్రాశారు. బాపూ శతజయంతి జరుగుతున్న ఈ సందర్భంలో ఆయన కవిత నొకదాన్ని తెలుగు పాఠకులకు అందిస్తున్నాం —సం.]

భావిమానవుణ్ణి ఏ గుణాలతో చూస్తావో బాపూ
ఈ సమరోన్ముఖమయిన ప్రపంచమును
ఏ యే కాంతులతో నింపుతావో!
మానవుల మానసములు సత్యమునూ
అహింసనూ తెలుసుకోగలవా ఎప్పటికయినా?
ప్రపంచ జీవనము అమరమయిన ప్రేమతో
మధుర స్వర్గముగా రూపొందదా?
నూతన మానవ లోకం
ఆత్మమహిమతో పరిపూర్ణము కాదా?
ప్రేమ శక్తిచేత పశుత్వము
శాశ్వతముగా జయింపబడుతుందా?
బాపూ! నీ ఆత్మ తేజోవంతమయిన
ఆహ్వానమును ఆలకించి
సమస్త ప్రజానీకము రోమాంచంతో
పులకిత గాత్రులై హర్షిస్తారు
భౌతికవాదము ప్రపంచము స్వర్గముగా
మారడానికొక సోపానము మాత్రమే
అక్కడ ఆత్మాదర్శము అనాదిగా
మలిన రహితముగా పరిశుద్ధముగా ఉండాలి
యుగ పరివర్తనములో ఎంతటి జనక్షయము
జరగనున్నదో తెలియరాదు మనకు
కాని, మానవునికి సత్యము, అహింస - వీటిపై
మక్కువ ఏర్పడటము మాత్రము నిశ్చయము
బాపూ! ఓ నవ సంస్కృతి దూతా
భగవంతుని యొక్క కార్యమును
నిర్వహించుటకు - మానవాత్మ నుద్ధరించ
వచ్చిన వాడవు నీవు - బాపూ!

# కస్తూరీ పరిమళాన్ని వెదజల్లిన

# కస్తూర్బా

-కల్యాణసింగ్

వీరాంగనలు దుర్గావతి, లక్ష్మీబాయిలవలె కస్తూర్బా కత్తిని చేత బట్టలేదు. అహల్యాబాయివలె సింహాసనం అధిష్టించి రాజ్య పాలనం చేయలేదు. ఐనా ఆమెలో అపారమైన శౌర్యము, సాహసమూ సమూహితమై ఉండినవి. గాంధీజీ వంటి పురుషోత్తముని ధర్మపత్నికి అవశ్యకమైన గుణసంపద ఆమెలో భాసించింది.

గాంధీజీ కస్తుర్బాలు 1869 లో కొన్ని నెలలు ముందువెనుకగా జన్మించారు. కస్తూర్బా పితృపాదులు గోకుల్‌దాస్ మకన్ జీ. ఆమె మొదటిపేరు వృజకుఁవరి. గాంధీజీతో ఆమె వివాహం పదమూడవ ఏటనే జరిగింది. తన పత్ని ఆదర్శపత్నిగా ఉండాలని గాంధీజీ పట్టుదల. కస్తూర్బా బాల్యంలో చదువుకోలేదు. గాంధీజీ ప్రోత్సాహంతో ఆమె గుజరాతీ భాషలో సుమారుగా పరిజ్ఞానం సంపాదించింది.

గాంధీజీ బారిస్టరు చదువు చదవటానికి ఇంగ్లండు వెళ్ళినప్పుడు కస్తూర్బా నియమ సహిష్ణుతాది గుణాలను బాగా పెంపొందించుకొంది. భావి జీవన సంగ్రామానికి సిద్ధపడే అవకాశం కలిగింది.

గాంధీజీ దక్షిణ ఆఫ్రికాకు వెళ్లినప్పుడు కస్తూర్బా ఆయన వెంట వెళ్ళింది. ఆమె పతిదేవుని కార్యక్రమాలలో సహకరించింది. "నా కఠోర నియమాలవల్ల నా పత్నికి నేను కలిగించిన దుఃఖానికి నేను ఋణవిముక్తుణ్ణి కాను." అని గాంధీజీ వ్రాసుకొన్నారు. దక్షిణ ఆఫ్రికాలో గాంధీజీ జీవనం ఒక ప్రయోగశాలగా మారింది.

ఆదేశంలో ఉండినప్పుడు ఒకసారి కస్తూర్బాకు తీవ్రవ్యాధి కలిగింది. వైద్యులు మాంసరసం తీసుకోవాలన్నారు. ఐనా కస్తూర్బా భగవంతుని మీద భారంవేసి మాంస స్వీకారానికి సమ్మతించలేదు.

దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం వివాహాలను రెజిస్టరు చేసుకోవాలనే చట్టం చేసినప్పుడు గాంధీజీ సత్యాగ్రహం నడిపించారు. కస్తూర్బా మహిళలలో ప్రబోధం కలిగించింది. ప్రభుత్వం చేసిన అగ్నిపరీక్షలో దంపతులు విజయం సాధించారు.

గాంధీజీ భారతదేశం తిరిగి వచ్చిన తరువాత కస్తూర్బా అత్యంత కఠిన పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. చంపారన్ సత్యాగ్రహ సమయంలో గ్రామీణులకు ధైర్యం కలిగించి గ్రామాలలో పారిశుద్ధ్యాన్ని అభివృద్ధి చేసే కార్యభారం కస్తూర్బాకు అప్పగించారు గాంధీజీ.



సంయమనానికీ ధైర్యానికీ ఆలవాలం కస్తూర్బా. 1906 లో గాంధీజీ బ్రహ్మచర్య నియమానికి పూనుకొన్నారు. అప్పటికి బాపు వయస్సు 35 సంవత్సరాలు. ఆమె సాధ్వీమణి సతీశిరోమణి ఐ గాంధీజీ ఆదర్శ మహాపురుషుడు అయ్యే మార్గం సుగమం చేసింది. గాంధీజీ ఒకచోట ఇలా వ్రాశారు. "ఏనాడు బ్రహ్మచర్య వ్రతానుష్ఠానం ఆరంభం అయిందో ఆనాడే మా స్వాతంత్ర్యం కూడా ఆరంభం అయింది. నా పత్ని పతి నియంత్రణం నుంచి విముక్తి పొందింది. ఏ నా తృష్ణను తృప్తి పరచడానికి ఆమెకు తప్పనిసరి అయ్యేదో ఆ తృష్ణా దాస్యంనుంచి నేనుకూడా ముక్తి పొందాను." సాంసారిక ప్రేమకంటే అత్యుత్తమమైన ఒక వస్తు విశేషంగా ఐపోయింది కస్తూర్బా.

సబర్మతీ, సేవాగ్రామ్ ఆశ్రమవాసుల పాలిట కస్తూర్బా దేవతామూర్తిగా వుండేది. వారందరికీ ఆమె మాతృదేవత. రాత్రీ పగలూ ఆమె, సేవలోనే నిమగ్న ఐ ఉండేది గ్రామాలలో తిరిగి గ్రామీణుల మధ్య నివసించేది. గాంధీజీ సహధర్మచారిణి ఐ ఆమె ఆయన అడుగుజాడలలో నడిచింది. స్త్రీ పురుషులు విదేశీ వస్త్రాలను ధరించడం మానివేయాలనీ, స్త్రీలందరూ రాట్నంతిప్పి నూలు వడకాలనీ, వ్యాపారస్తులు విదేశీ వస్త్రాలను తెప్పించకూడదనీ ప్రచారం చేసింది. కర్నల్ విడల్ హార్ట్ ఒక సందర్భంలో ఇలా వ్రాశాడు. "తెల్లని ఖద్దరు వస్త్రం ధరించి సేవాగ్రామ్‌లో ఆదర్శ గృహిణిగా జీవనం గడుపుతూ, ఆశ్రమ వాసుల సేవలో నిమగ్న ఐ ఉన్న ఆ తల్లి కంటె దర్శనీయమైన వస్తువు భారత దేశం వెళ్లినప్పుడు మనకు కనబడదు."

సహాయనిరాకరణ ఉద్యమంలో ఆమె భారతీయమహిళలందరికంటె ముందు నిలిచింది. బార్డోలీ సత్యాగ్రహ సందర్భంలో గాంధీజీ నిర్బంధితులైనప్పుడు కస్తూర్బా తన వీర ప్రయత్నంతో కర్షకులలో సాహసాన్ని ధైర్యాన్ని నింపింది. గుజరాత్ కర్షకుల దృష్టిలో ఆమె జగదంబగా తేజరిల్లింది.

1939లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభంఅయింది. తెల్లవారు గాంధీజీ మాటలు పెడచెవిని పెట్టారు. మహాత్ముడు వ్యక్తిగత సత్యాగ్రహ ఉద్యమాన్ని లేవదీశాడు. కస్తూర్బా ఆయనకు సహాయపడింది. 1942 ఆగస్టు 9 వ తేదీని గాంధీజీ ఆయన అనుయాయులూ నిర్బంధింపబడ్డారు. ఆ నాటి సాయంకాలం శివాజీ పార్కులో ఉపన్యాసం ఇవ్వడానికి కస్తూర్బా సిద్ధపడింది. కాని ఆ అమ్మను ఆగాఖాన్ భవనానికి పంపించివేశారు. అక్కడ ఆమె నిరంతర పతిసేవాపరాయణ ఐ కాలం గడిపింది. మహాదేవ దేశాయి మరణంతో గాంధీజీ కుడిభుజం పడిపోయినట్లయింది. గాంధీజీ ఇరవై ఒక్క రోజులు ఉపవాసం చేశారు. బా హృదయం దుర్బలమైపోయింది. న్యూమోనియా ప్రవేశించింది.

1944 ఫిబ్రవరి 22 వ తేదీ బా జీవితంలో తుది దినం. ఆ నాడు మహాశివరాత్రి. పర్వదినం. బా బాపూజీ ఒడిలో ఒరిగింది రాత్రి ఏడుగంటలకంతా బా కన్నుమూసింది.

ఆ మరునాడు బా అంతిమయాత్ర శవానికి స్నానం చేయించారు గాంధీజీ స్వయంగా వడికిన నూలుతో నేసిన చీర బా కు కప్పారు. కంఠంలో తులసిపూల వేశారు. నుదుట చందనమూ, కుంకుమా పూశారు. చిన్నకుమారుడు దేవదాసు అగ్ని సంస్కారం చేశాడు. గాంధీజీ వంటి స్థిత ప్రజ్ఞుడు కూడా కన్నీటిని ఆపుకోలేక పోయాడు. "ఆమె నా ముందరే వెళ్లిపోవాలని నేను కాంక్షిస్తూ ఉండేవాణ్ణి. అయినా ఆమె నా జీవనంలో ఒక అవిభాజ్య అంశంగా ఉండినది. ఆమె మరణం వల్ల కలిగిన శూన్యం శూన్యంగానే ఉండిపోతుంది." అని దుఃఖపడ్డారు గాంధీజీ.

గాంధికుడు అంటే పరిమళ ద్రవ్యాలను అమ్మేవాడని అర్థం. గాంధీజీ సత్యాహింసల పరిమళాన్ని వ్యాపింపజేస్తే, కస్తూర్బా పాతివ్రత్య కస్తూరీ పరిమళాన్ని వెదజల్లింది. ఆదర్శ పత్ని, ఆదర్శమాతగా విలసిల్లింది.

*

## ముక్త్యాల కాలువలోకి నీరు విడుదల



నాగార్జున సాగర్ ఎడమ కాలువ అయిన లాల్ బహదూర్ కాలువ శాఖించి ముక్త్యాల కాలువలోకి నాగార్జున సాగర్ జలాలను రెవెన్యూ మంత్రి శ్రీ తిమ్మారెడ్డి జనవరి 16 వ తేదీన విడుదల చేశారు. కోదాడుకు దగ్గరలో వున్న బర్కత్ గూడాలో అశేష ప్రజానీకం హాజరైన బ్రహ్మాండమైన ఒక ఉత్సవంలో శ్రీ తిమ్మారెడ్డి నాగార్జున సాగరు జలాలను విడుదల చేశారు. ఆ సందర్భంలో జరిగిన సభకు చిన్ననీటి వసరుల మంత్రి శ్రీ వి. పురుషోత్తమరెడ్డి అధ్యక్షత వహించారు. సమాచార పౌర సంబంధ శాఖ మంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావు కూడ ఈ ఉత్సవానికి హాజరయ్యారు

# సమీకృత పాలపథకం



# సీసా పాల కథ

ఆంధ్రప్రదేశ్‌లో, ప్రభుత్వరంగంలో చేపట్టబడిన పాడి పరిశ్రమకు సంబంధించిన మొట్టమొదటి భారీ పథకం సమీకృత పాల ప్రాజెక్టు. ఇది "యునిసెఫ్" సహాయంతో పంచవర్ష ప్రణాళికా పథకంగా అమలుపరచబడుతున్నది. "యునిసెఫ్" 1,60,000 డాలర్లు ఖరీదు చేసే పాడిపరిశ్రమ సాధన సామగ్రిని ఈ దిగువ పేర్కొన్నవాటి స్థాపన కొరకు మొదటి ఘట్టంలో యిస్తున్నది.

(అ) కృష్ణా జిల్లాలో విస్తృతంగా పాల ఉత్పత్తి జరిగే ప్రదేశానికి కేంద్రమైన విజయవాడలో పాల నిలువ, పాల వుత్పత్తుల ఫ్యాక్టరీ.

(ఆ) హైద్రాబాదులో పాల ప్రొసెసింగ్ యంత్రం :— అంతిమ ఘట్టంలో విజయవాడలోని ఫ్యాక్టరీ రోజుకు 2,50,000 లీటర్లు, హైదరాబాదులోని యంత్రం 2,00,000 లీటర్ల చొప్పున వుత్పత్తి శక్తిని కలిగి వుంటాయి.

ఈ పథకం క్రింద, మొదటి ఘట్టంలో సాధించదలచిన ముఖ్య లక్ష్యాలు యివి :— హైదరాబాదులో వేడి చేసిన పాలను రోజుకు 50,000 లీటర్లు, విజయవాడలో రోజుకు 1,25,000 లీటర్ల చొప్పున ఉత్పత్తి చేసి సరఫరా చేయడం ప్రాజెక్టు రెండవ ఘట్టంలో వుత్పతి ప్రారంభమైన 3 మొదలు 5 సంవత్సరాల కాలంలో—అంతిమంగా విజయవాడలో 2,50,000 లీటర్ల పాలను, హైద్రాబాదులో 2,00,000 లీటర్ల పాలను ఉపయోగించడానికి సౌకర్యాలు వుండే విధంగా ఈ రెండు ప్రదేశాలలోని యంత్రాగార భవనాలను, సేవా పథకాలను రూపొందించారు.

## విజయవాడ యంత్రం

విజయవాడలోని పాల నిలువ, పాల వుత్పత్తుల ఫ్యాక్టరీ అయిదు లక్షలకుపైగా జనాభా కలిగిన విజయవాడ, గుంటూరు పట్టణాలకు రోజుకు సుమారు 25,000 లీటర్ల పాలను పంపిణీ చేయడమే కాకుండా, 27 000 లీటర్ల వేడిచేసిన పాలను హైదరాబాదుకు





హైదరాబాదులోని కేంద్ర పాడి క్షేత్రంలో గ్రామాలనుంచి సేకరించిన పాలు

# లక్షలాది ప్రజలకు





కేంద్రపాడిక్షేత్రం లోపల ఒక దృశ్యం



స్టెయిన్‌లెస్ స్టీల్ పాల టేంకర్



పాలనుంచి

సికిందాబాదు,

పాశ్చరైజేషన్ యూనిట్







# పౌష్టికాహారం
# పాలు



పాలను ప్రయోగశాలలో పరిశీలిస్తున్న దృశ్యం



ను వేరుచేసే విభాగం



నెయ్యి తయారీ విభాగం



వినియోగదారుల్ని చేరడానికి సిద్ధంగావున్న పాలు

సీసాలకు మూతలు అమర్చే యంత్రం



టలోని కేంద్ర పాడిక్షేత్రం





హైదరాబాదులోని కేంద్ర పాడి క్షేత్రం సిబ్బంది కాలనీ

రైలు మార్గంగా పంపిన తరువాత మిగిలివున్న పాలనుంచి నెయ్యి, పాలపొడి తయారు చేస్తుంది. మొదటి ఘట్టంలో ఈ ఫ్యాక్టరీలో యేటా సుమారు 1,000 టన్నుల నెయ్యి, 600 టన్నుల పాలపొడి వుత్పత్తి అవుతాయి.

సికింద్రాబాదులోని కేంద్ర పాడి క్షేత్రంలో 1967 జనవరిలో పని ప్రారంభించబడింది. దీని ద్వారా జంట నగరాలలోని వినియోగదార్లకు పాల సీసాలు సరఫరా చేయబడుతున్నాయి. ఈ పాడి క్షేత్రంమీద ప్రభుత్వం యిప్పటివరకు రూ. 1.50 కోట్లు ఖర్చు పెట్టింది. నిర్ణీత లక్ష్యం మేరకు ఇది 1968 నవంబరులో 50,000 లీటర్ల వుత్పత్తి స్థాయికి చేరుకున్నది. ప్రస్తుతం జంట నగరాలలో 163 పాల విక్రయ కేంద్రాలున్నాయి. కార్డులుగల సుమారు 90,000 మంది వినియోగదార్లు ఈ కేంద్రాలవద్ద పాలు తీసుకుంటున్నారు. హైద్రాబాదు పాడి క్షేత్రంలో మొదటిసారిగా 1967_68 సంవత్సరంలో పాలను ప్రమాణీకరించడం, నెయ్యి తయారు చేయడం ప్రవేశపెట్టబడినవి. ఇందువల్ల సేకరించిన పాల నాణ్యతను పెంచడానికీ, ఈ పథకానికి ఆదాయాన్ని వృద్ధి చేయడానికీ వీలుకలిగింది. అదనంగా పాల విక్రయ కేంద్రాలను తెరవడం కొరకు, కొత్త పాల కార్డులను జారీ చేయడం కొరకు పౌరులు అభ్యర్థించడం జరుగుతున్నది. కాని పాల నిలువ సౌకర్యాలు, రవాణా సౌకర్యాలు, స్థానికంగా పాల వుత్పత్తి పరిమితంగావున్న దృష్ట్యా, పరిమిత సిబ్బంది దృష్ట్యా ఈ పాడి క్షేత్రం కార్యకలాపాలను ఘట్టాల వారీగా మాత్రమే పెంపొందించడానికి ఉద్దేశించబడింది.

## శీతలీకరణ కేంద్రాలు :

ఈ ప్రాంతంలో 1967_68 పాడి ఋతువులో 18,000 లీటర్ల పాలు మాత్రమే వుత్పత్తి అయ్యాయి. హైద్రాబాదు ప్రాంతంలో నాలుగు శీతలీకరణ కేంద్రాలు (భువనగిరి, కడ్తల్, జహీరాబాదు, షాద్‌నగర్) వున్నాయి. 1968_69 సంవత్సరంలో గణనీయమైన ప్రయత్నంలో, రోజుకు 27,000 లీటర్ల లక్ష్యాన్ని చేరుకోవడం జరిగింది. ఈ ప్రాంతానికి సంబంధించి నంతవరకు యిది గరిష్ఠ పరిమాణం. ఇదే విధంగా హైదరాబాదు పాడి క్షేత్రంలో నెయ్యి వుత్పత్తి 1967 అక్టోబరులో రోజుకు 113 కిలోగ్రాములు మాత్రమే వుండగా 1968 అక్టోబరు నాటికి ఈ వుత్పత్తి స్థాయిని రోజుకు సుమారు 850 కిలోగ్రాములకు హెచ్చించడం జరిగింది. వుత్పత్తి స్థాయి యిప్పుడు యింకా మెరుగ్గా వుంది.

కేంద్రపాడిక్షేత్రం నిర్వహిస్తున్న 50,000 లీటర్ల పాలలో దాదాపు రెండు రైలుటేంకుల పాలు అంటే దాదాపు 2,700 లీటర్ల పాలు విజయవాడనుండి లభిస్తున్నాయి. స్థానిక ఉత్పత్తులను పెంపొందింప జేసి, హైదరాబాదు పాడి క్షేత్రాన్ని స్వయం సమృద్ధం చేసేందుకు గత రెండు సంవత్సరాలలో కొత్త పాల వనరులను ప్రారంభించారు. ధరలను దృష్టిలో ఉంచుకుని స్థానికంగా సేకరణను గరిష్టస్థాయికి తేవడం జరుగుతుంది.

## కొత్తపథకాలు :

1969_70 సంవత్సరంలో రెండు కొత్త పథకాలను చేపట్టాలని ఉద్దేశించారు. అవి (1) కేర్ కార్యక్రమంక్రింద లభించే సహాయాన్ని వినియోగించి జంటనగరాలలోని దాదాపు 200 పాఠశాలలకు వర్తించే విధంగా పాఠశాలల బాలబాలికలకు పాలసీసాలు సరఫరా చేసే పథకం. (2) ప్రణాళికలో అంగీకరించిన విధంగా అల్పాదాయ వర్గాల ప్రజలకు సబ్సిడీపై పాల పంపిణీ చేపట్టే పథకం.

హైదరాబాదులోని కేంద్ర పాడి క్షేత్రంతోపాటు వరంగల్లు పట్టణ ప్రజల పాల అవసరాలను తీర్చడానికి వరంగల్లులో భారీ తరహా పాలశీతల కేంద్రాన్ని కూడా ప్రారంభించారు. పాలసేకరణ కార్యక్రమాన్ని ములుగు ప్రాంతానికి విస్తరింప చేయాలని వరంగల్లులోని కేంద్రాన్ని అన్నిహంగులు కలదిగా చేయాలని ప్రస్తుతం ఉద్దేశించారు. జిల్లా అభివృద్ధి మండలులు నిధులు సమకూర్చే పక్షంలో శీతల కేంద్రాలను ఏర్పాటుచేసే దృష్టితో సర్వే జరిపి నల్లగొండ, మెదకు, నిజామాబాదు జిల్లాలలో యితర ముఖ్యమైన పాల ఉత్పత్తులను తయారు చేయాలని ఉద్దేశించారు.

## పెద్ద ఫ్యాక్టరి

విజయవాడలోని పాల ఉత్పత్తుల ఫ్యాక్టరీ, దక్షిణ భారత దేశంలోనే అతిపెద్దఫ్యాక్టరీ, ఈ ఫ్యాక్టరీకి; పామర్రు, హనుమాన్ జంక్షన్, గుడ్లవల్లేరు, వీరంకిలాక్‌లలోని నాలుగు పాల శీతల కేంద్రాల నిర్మాణానికిగాను ప్రభుత్వానికి రు. 1861 లక్షలు ఖర్చు అయ్యాయి. మొదటిదశలో యీ ఫ్యాక్టరీ ఉత్పత్తి శక్తి 1.25 లక్షల లీటర్లు ప్రతిశీతల కేంద్రం ఉత్పత్తి శక్తిని 10,000 లీటర్లు. అయితే వాటి ఉత్పత్తి శక్తిని 20,000 లీటర్లకు పెంచే అవకాశం ఉంది. 1965 ఫిబ్రవరిలో పామర్రులోని ప్రథమ శీతల కేంద్రం ఉత్పత్తిని ప్రారంభించింది. 1965_66 నుండి హైదరాబాదుకు పాలు సరఫరా చేయడం ప్రారంభించారు. 1966 జూన్‌లో హనుమాన్ జంక్షన్‌లోని శీతల కేంద్రం పని ప్రారంభించింది. వీరంకిలాక్‌లోని మూడవ శీతల కేంద్రం 1967 నుండి పని ప్రారంభించింది. ఆ తర్వాత ఒక సంవత్సరానికి గుడ్లవల్లేరులోని కేంద్రం ప్రారంభమయింది. ఈ మొత్తం పాల శీతల కేంద్రాలు 34,000 లీటర్ల పాలను నిర్వహిస్తున్నాయి. అంటే వాటి ఉత్పత్తి శక్తి కన్నా ఎక్కువపాలను నిర్వహిస్తున్నాయి. వాటి ఉత్పత్తి స్థాయిని రెండింతలు చేయడానికి కృషిజరుగుతున్నది. ఈ ఫ్యాక్టరీలోని ద్రవ విభాగం, వెన్న, నెయ్యి, విభాగాలు, పాలపొడి విభాగాలను విజయవంతంగా పరీక్షించడం జరిగింది. మేలిరకం పాలపొడిని ఉత్పత్తి చేశారు. విజయవాడ, గుంటూరులకు సీసాలలో పాలు సరఫరా చేస్తున్నారు. వాటికి తోడు, గుడివాడ, ఏలూరులకు పాలు సరఫరా చేయడానికి ఏర్పాట్లు చేశారు. ఈ ఫ్యాక్టరీలోను, శీతల కేంద్రాలలోను రోజుకు ఒక టన్ను చొప్పున నెయ్యి తయారు చేస్తున్నారు. పాడి ఋతువులో పాలపొడి విభాగంతో సహా అన్ని విభాగాలు పని ప్రారంభించినప్పుడు రోజుకు దాదాపు 70,000 నుండి 80,000 లీటర్లవరకుపాలను సేకరించడం జరుగుతుందని ఆశించబడుతున్నది పశ్చిమ గోదావరి, గుంటూరు ప్రాంతాలకు పాల సేకరణ కార్యక్రమాన్ని విస్తరింప జేయడం ద్వారా యీ లక్ష్యాన్ని సాధిస్తారు. పశ్చిమ గోదావరి జిల్లాలోని భీమడోలు, భీమవరంలోను, కృష్ణా జిల్లాలోని చిలకలూరు, చల్లపల్లి, తిరువూరులలోను, భారీ శీతల కేంద్రాలు, పాల శీతల కేంద్రాలను ఏర్పాటు చేయడానికి అప్పుడే ఏర్పాట్లు జరిగాయి.

## ప్రత్యేక కృషి

జిల్లా పాడి క్షేత్రాలకు సంబంధించి పూరికాని అనేక పనులను పూర్తి చేయడానికి 1968_69 లో ప్రత్యేక కృషిని ప్రారంభించారు. నెల్లూరు, విశాఖపట్నం, వరంగల్లులోని పాడి క్షేత్రాలలో పాల సేకరణ చురుకుగా కొనసాగుతున్నది. (విశాఖపట్నం, నెల్లూరులలో రోజుకు 2,500 లీటర్లు, వరంగల్లులో రోజుకు 400 లీటర్లు).

చిత్తూరు, రాజమండ్రిలలోని పాడి క్షేత్రాల నిర్మాణం త్వరితగతిని పూర్తి అవుతున్నాయి. పాడి ఋతువులో యివి పని ప్రారంభిస్తాయని ఆశించ బడుతున్నవి.



వందలాది మైళ్ళు ప్రయాణించి వినియోగదార్లకు చేరుతున్న పాలు

# మహాభారతము

తెనుపుగంటుల లక్ష్మణశాస్త్రి

బృహదశ్వుడు వెడలిపోయిన తరువాత ధర్మరాజు, తీర్థ యాత్రలు చేయుచు వచ్చిన బ్రాహ్మణుల ద్వారా, "అర్జునుడు వాయు భక్షణము చేయుచు దుష్కరమైన తపము చేయుచున్నాడు. ఇంతకు పూర్వము ఇట్టి కఠిన తపశ్చర్యచేసిన వారు ఎవరుగూడ లేరు. అతడు మౌనముతో నుండి ఒంటరిగా సంచరించు చుండుటను జూడగా మహాశ్చర్యము కలుగుచున్నది. అర్జునుడు మూర్తీభవించిన ధర్మమే యనవచ్చును." అని వినెను. ఆ సంగతి విని యుధిష్ఠిరుడు తమ్ముని కష్టమును తలచికొని మిక్కిలి పరితపించెను. అతనికి జయము కలుగుగాక యని దీవించెను. అర్జునుడు రాగానే అతనికి అక్షహృదయ విద్య నేర్పెదనని నిశ్చయించుకొనెను. అతనికై యందరును నిరీక్షించుచుండిరి.

అర్జునుడు కామ్యకవనము నుండి వెడలి తపస్సునకు పోయిన తరువాత ఇతర పాండుపుత్రులు తెగిన దారము నుండి మణులవలె, ఛిన్నములైన రెక్కలుగల పక్షులవలె నిరాధారులుగా అప్రసన్నులై యుండిరి. ఆ వన మంతయు కుబేరుడు లేని 'చైత్రక' వనమువలె నుండెను ప్రతి దినము పాండవులు వన్యాహారములను తెచ్చి బ్రాహ్మణులకు పెట్టి తాము భుజించు చుండిరి. అందరికన్న పాంచాలి మిక్కిలి ఉద్విగ్నమానసయై మధ్యమపతిని స్మరించుచు ధర్మరాజుతో, 'సహస్ర బాహుడైన కార్తవీర్యార్జునునితో సమానుడగు అర్జునుడు లేని యా వనము శోభిల్లుటలేదు. భూమి శూన్యముగా కనబడుచున్నది. పిడుగు వంటి అతని ధనుస్సు ధ్వని విననిదే నాకు సుఖము కలుగుటలేదు.' అని యనెను. ఆమె మాటలను వినుచున్న భీమసేనుడు ఆమెతో, 'కల్యాణీ! నీ మాటలు మనస్సుకు ప్రీతికరములుగా నుండి అమృతము త్రాగినట్లు సంతసమును గూర్చుచున్నవి. ఐదు పడగలుగల సర్పములవలె శత్రుభయంకరములగు బాహువులతో నొప్పారుచున్న అర్జునుడు లేనిదే మనకు నిక్కముగా సుఖములేదు. అదృశ్యుడగు సూర్యుడుగల ఆకాశమువలె ప్రపంచమునకు గోచరించుచున్నది. అతడు లేనిదే మనకు ఈ వనమునందు ధైర్యము చాలకున్నది. దిక్కులన్నియు అంధకారావృతములైనట్లు కనపడుచున్నవి.' అని యనెను. అప్పుడు నకులుడు, "దేవతలకు గూడ ఆశ్చర్యకరములగు కార్యములను చేయునట్టి అర్జునుడు లేనిదే ఈ వనమునందు మనకు సుఖములేదు. అతడు ఉత్తర దిక్కులో గంధర్వులను జయించి ఉత్తమాశ్వములను సంపాదించెను. రాజసూయయాగములో అన్నగారికి అతడు 'తిత్తిరి, కల్మాష' అను రెండు వాయువేగములైన అశ్వములను కానుకలుగా తెచ్చియుండెను. నాకు ఇక్కడ ఉండుటకు ఇష్టము కలుగుటలేదు." అని యనెను. పిదప సహదేవుడు, 'అర్జునుడు లేని యీ వనము రమణీయముగ లేదు, దిగ్విజయము చేసి యతడు ధనములను తెచ్చి రాజునకు అర్పించెను. యాదవులను జయించి సుభద్రను పెండ్లియాడెను. ఈ యాశ్రమమునందు అతని శూన్యాసనము చూచి ఇక్కడ వసించుటకు నాకు రుచిపుట్టుటలేదు.' అని యనెను.

వారి మాటలన్నియు విని యుధిష్ఠిరుడు గూడ మనస్సు చిన్నపుచ్చుకొని యుండెను. అప్పుడు అక్కడికి బ్రహ్మతేజస్సు చేత, 'మండుచున్న అగ్ని' వలె వెలుగుచున్న దేవర్షి నారదుడు వచ్చెను. పాండవులా మహామునిని ఎదుర్కొని స్వాగత సత్కార పూర్వకముగా పూజించిరి. ధర్మరాజు, దేవతల మధ్య ఇంద్రుడు వలె, తమ్ముల మధ్య విరాజిల్లుచుండెను. గాయత్రి వేదములను విడువక అనుసరించుచున్నట్లున్ను, మేరు పర్వతమును సూర్యప్రభవలెను పాంచాలి పాండవులను ఆశ్రయించియుండెను. ఆట్టి వారు చేయుచున్న పూజను స్వీకరించి నారదుడు ధర్మరాజును 'రాజా! నీకేమి కావలెను? నేను నీకు ఏమి యిత్తును? చెప్పుము.' అని యడిగెను ఆ మాటకు యుధిష్ఠిరుడు, 'మహాత్మా! నీవు సంతసించితివి అంతియే చాలును. అయినను నీ యాజ్ఞయైనది కనుక ఒక్కమాట అడిగెదను, ఏమనగా, తీర్థయాత్ర చేయుచు మనుష్యుడు భూప్రదక్షిణము చేయును. దానివలన గలుగు ఫలమేమి?' అని యడిగెను. దానికి నారదుడు ధర్మరాజుతో నిట్లనెను :—

## నారదుని పుణ్యతీర్థ వర్ణనము

"రాజా! పూర్వము భీష్ముడు గంగాద్వారమునందలి (హరిద్వారము) గంగాతీరమునందు మహామునుల సమక్షములో పితృ

శ్రాద్ధాది కర్మలు చేయుచుండెను. అతడు శాస్త్రోక్తముగా దేవతర్పణము, ఋషితర్పణము చేయుచుండెను. ఇట్లుండగా నొకనాడు అద్భుత మహిమలుగల 'పులస్త్య' మహాముని అచటికి వచ్చెను. ఆ మునికి భీష్ముడు అర్ఘ్యపాద్యాదులతో పూజలు సలిపి ప్రాంజలియై వంగి 'మహాత్మా! నేను భీష్ముడను. మీకు దాసుడను. నీ దర్శన మాత్రమున నా పాపములన్నియు నశించినవి.' అని చెప్పి మౌనముతో ఆ ముని యెదుట నిలువగా నతడు తపస్స్వాధ్యాయములచేత కృశించిన అవయవములుగల భీష్ముని చూచి ప్రీతి చెంది యిట్లనెను:—

"మహాభాగా! నీ నియమము చేత, తపోవ్రతముల చేత, సత్య, శమ, దయాది గుణముల చేత నేను చాలప్రీతుడనైతిని. పితృభక్తియనెడు ఉత్తమ ధర్మమును దీక్షతో నీవు ఆశ్రయించి యున్నావు గనుకనే దాని ప్రభావముచేత నీవు నన్ను చూడ గలుగుచున్నావు. ఆ కారణముచేతనే నీ పైన నాకు ప్రేమగూడ అధికముగా గలిగినది. నా దర్శనము నీకు వ్యర్థము కాగూడదు. కనుక భీష్మా! నీకు ఏమి కావలెనో కోరుకొనుము. తప్పక యిచ్చెదను." ఆ మాట విని భీష్ముడిట్లనెను:—

"మహాత్మా! సర్వలోకములకు పూజనీయుడవగు నీవు సంతుష్టుడవైనచో అదియే చాలును. నా పుణ్యవశము చేత నీ దర్శనము లభించినది. నాకొక సందేహము గలిగినది. బ్రహ్మర్షీ! తీర్థయాత్రలు చేయుచు భూప్రదక్షిణము చేయుటవలన కలుగు ఫలమును నాకు దయచేసి తెలుపుము." ఆ మాటకు పులస్త్యు డిట్లు చెప్పెను.

"పుత్రా! వినుము. హస్తపాదాద్యవయవములు, మనస్సు తన వశములో ఉంచి, విద్య, తపస్సు, యశస్సు గలవాడు తీర్థయాత్రలు చేసి తత్ఫలమును పొందగలడు. దానమును పుచ్చుకొనని వాడు తనకున్న దానితో తృప్తిచెందువాడు, అహంకారములేనివాడు, గర్వరహితుడు, కర్తను గదా యను గర్వము లేని వాడు, అల్పాహారము తినువాడు, జితేంద్రియుడు, సర్వపాపముల నుండి విముక్తుడైన వాడు, కోపములేనివాడు, సత్యశీలుడు, గట్టి దీక్షగలవాడు, అన్ని జంతువులను తనతో సమానముగా చూచుకొనువాడు భూప్రదక్షిణము చేసి తీర్థయాత్రలు సలిపి తత్ఫలముమ పొందగలడు.

"నాయనా! ఋషులు, దేవతలను తృప్తి పరచుటకుగాను యజ్ఞములు చేయవలెనని నిర్దేశించిరి. అవి యిహపర సుఖములను గలిగించును. కాని వానిని దరిద్రుడు చేయజాలడు. అధికధనము, వస్తు సంభారములు కావలెను. కనుక యజ్ఞాదులను రాజులు, సంపన్నులు మాత్రమే చేయగలుగుదురు. అర్థబలము, అంగబలము లేనివారు వానిని సాధించలేరు. అట్టి వారు తీర్థయాత్రల వలన యాగఫలములను పొందగలుగుదురు. ఎవడు తీర్థయాత్రలు చేయడో, తీర్థములలో మూడు రాత్రులు ఉపవాసము చేయడో, సువర్ణదానము, గోదానము చేయడో అట్టివాడు దరిద్రుడై పుట్టును. అనేకదక్షిణలు ఇచ్చి అగ్నిష్టోమాది యాగములను చేసిన ఫలము ఒక్క తీర్థయాత్రల వలననే కలుగును. శుభ్రములైన మూడు గిరిశిఖరములు, మూడు సెలయేళ్లు పుష్కరములని ఆదికాలమునుండి ప్రసిద్ధి కలదు. అందుకు కారణము మాకు గూడ తెలియదు. పుష్కర గమనము, పుష్కర దర్శనము, పుష్కరమునందు తపస్సు-దానముచేయుట దుష్కరము. అచ్చట నివసించుటయనగా అతిదుష్కరము. అట్టి పుష్కర తీర్థక్షేత్రము నందు నియతాహారుడై పన్నెండు దినములు నివసించి, నియమముతో ప్రదక్షిణముచేసి అచటినుండి క్రమముగా ఈ క్రింద చెప్పబడిన తీర్థములను సేవించవలెను:—

"జంబూ మార్గమును ఆశ్రయించినచో అశ్వమేధఫలము కలుగును. అచట ఐదు దినములు నివసించినచో పవిత్రుడై దుర్గతి పొందడు. జంబూ మార్గమునుండి 'తందులికాశ్రమము' పోవలెను. దానిని సేవించినవానికి బ్రహ్మలోకము ప్రాప్తించును. అచటి నుండి 'అగస్త్య సరస్సు' నకు పోయి మూడు రాత్రులు ఉపవాసము ఉండి పితృకర్మలు, దేవపూజలు చేసిన వానికి 'అగ్నిష్టోమ' యజ్ఞ ఫలము కలుగును. శాకములు, ఫలములు భుజించుచు అక్కడ వసించువాడు కుమారస్వామి (శివుని పుత్రుని) లోకమునకు పోవును. అచటి నుండి ధర్మారణ్యమైన 'కణ్వాశ్రమము'నకు పోవలెను. అచట ప్రవేశించగనే సర్వపాపముల నుండి విముక్తుడై అన్ని కోర్కెలను పొందును. అక్కడ ప్రదక్షిణముచేసి 'యయాతి పతనము' అను తీర్థమును సేవించుటకు పోవలెను. అచటి నుండి పోయి 'మహాకాల' తీర్థమును సేవించవలెను. అచటి నుండి పోయి 'భద్రవటము' అను పేరుగల శివుని తీర్థమును సేవించవలెను. దానిని సేవించినవాడు సహస్ర గోదానములు చేసిన ఫలమును పొంది 'గాణాపత్యము' అను పుణ్యలోకములకు పోవును. దాయాదులేని సమృద్ధమైన సంపదను పొందగలడు. నర్మదను సేవించిన వాడు అగ్నిష్టోమయాగ ఫలమును పొందగలడు. దక్షిణ సముద్రయాత్రను బ్రహ్మచారియై చేసినచో విమానములో పోయి స్వర్గ సుఖమును అనుభవించ గలడు. 'చర్మణ్వతీ' నదీసేవనము చేత 'రంతి దేవ'రాజునకు లభించిన సత్ఫలము కలుగగలదు.

"హిమవంతుని కొడుకగు 'అర్బుద' పర్వతమును సేవించినవానికి సహస్ర గోదానములు చేసిన ఫలము కలుగును. ఆ పర్వతము వద్ద పూర్వము భూమిలో వివరము ఉండెను. అచ్చట వసిష్ఠాశ్రమము ఉండెను. 'పింగ' తీర్థమును, 'ప్రభాస' తీర్థమును సేవించవలెను. ప్రభాసమునందు అగ్ని సర్వదా సన్నిహితుడై యుండును. అక్కడ స్నానముచేసిన వానికి 'అగ్నిష్టోమ-అతిరాత్ర' యజ్ఞములు చేసిన ఫలము కలుగును. ఆ తరువాత సరస్వతీ-సాగరసంగమ క్షేత్రమును సేవించవలెను. అతడు సర్వదా అగ్నివలె ప్రకాశించుచుండును. అచట మూడు దినములు ఉపవాసముచేసి పితృదేవతలకు తర్పణాదులు చేసినవాడు చంద్రుని వలె ప్రకాశించుచు అశ్వమేధము చేసిన ఫలమును పొందగలడు. అచటి నుండి 'వరదాన' తీర్థమునకు పోవలెను. అచట దుర్వాసుడను మహాముని విష్ణువునకు వరమునిచ్చెను. అటనుండి 'ద్వారకా' క్షేత్రమును సేవించి యిచట 'పిండారక' తీర్థములో స్నానము చేసినచో అధిక సువర్ణ ప్రాప్తి కలుగును. అచట ఇప్పటికిని కమల చిహ్నములుగల బంగారు నాణెములు కనపడును. ఈ

విషయము అత్యద్భుతము. అచట త్రిశూల చిహ్నితములైన కమలములుగూడ గోచరించును. అదియే శ్రీ మహాదేవుని సన్నిధి యని తెలిసికొనవలెను.

"భీష్మా! సింధునదీ-సాగర సంగమములో స్నానముచేసి పితృదేవతలను అర్చించిన వానికి వరుణలోక ప్రాప్తి కలుగును. అచట 'శంకుకర్ణేశ్వర' శివుని పూజించినవానికి అనేక ఫలములు కలుగును. ఆ దేవునకు ప్రదక్షిణ నమస్కారములుచేసిన తరువాత ఆ సమీపమునందున్న 'దమి' యను తీర్థరాజమును సేవించవలెను. అచటవెలసిన పరమశివుని బ్రహ్మాది దేవతలు సేవించిరి. దానిని సేవించినవారికి జన్మ ప్రభృతి చేసిన పాపములు నశించును. అచటనే పూర్వము విష్ణుదేవుడు స్నానముచేసి రాక్షస సంహారదోషము నుండి విముక్తుడయ్యెను. పిదప'వసుధారా' తీర్థమును సేవించినవాడు విష్ణులోకమును పొందును. అచ్చటనే వున్న 'వసు సరస్సులో' స్నానము చేసిన వాడు వసుదేవతలకు ప్రియుడగును. అక్కడనే ఉన్న 'సింధూత్తమ' తీర్థములో స్నానము చేసినవానికి అధిక సువర్ణము లభించును. 'భద్రతుంగ' తీర్థమును సేవించిన బ్రహ్మలోకము పొందగలడు 'కుమారికా' తీర్థసేవనముచేత స్వర్గప్రాప్తి కలుగును. అచ్చటనే ఉన్న 'రేణుకా' తీర్థములో స్నానమాచరించినవాడు స్వచ్ఛ చంద్రునివలె ప్రకాశించును. అచ్చటనే 'పంచనద' క్షేత్రమును సేవించిన 'పంచయజ్ఞ' ఫలమును పొందును- (దేవ-మనుష్య-భూత-బ్రహ్మ-పితృ యజ్ఞములు పంచయజ్ఞములనబడును). అచటి నుండి 'భీమా' నదిని చేరి సేవించిన మానవుడు దేవీపుత్రుడై విరాజిల్లును. అతని శరీరము స్వర్ణవర్ణముచే ప్రకాశించును. అచటినుండి 'శ్రీకుండ' మునకు పోయి బ్రహ్మదేవుని సేవించవలెను. అటనుండి 'విమల' తీర్థమునకుపోయి స్నానమాచరించిన వానికి స్వర్గప్రాప్తి కలుగును. ఆ తీర్థమునందు బంగారు-వెండి వర్ణములుగల చేపలు ఉండును.

"భీష్మరాజా! కాశ్మీరమునకుపోయి 'వితస్తా' నదిలో స్నానముచేసి అచటనే ఉన్న 'వితస్తా' అను పేరుగల తక్షక నాగరాజు భవనమును సేవించవలెను. అతనికి 'వాజపేయి' యాగ ఫలము చేకూరును. అక్కడి నుండి పోయి 'బడబా' తీర్థమును సేవించవలెను. ఆ తీర్థమునందు సంధ్యాసమయమునందు స్నాన సంధ్యలు చేసి అన్నము (చరువు) వండి అగ్నిదేవునకు నివేదించవలెను. అచ్చట పితృదేవతలకు చేసిన దానము అక్షయమగును. అనేక దేవతలు, ఋషులు అచట విష్ణుదేవునకు ఏడు 'చరు' నివేదనములను చేసి ఆ దేవుని ప్రసన్నుని చేసిరి. వారికి విష్ణుదేవుడు అణిమాదుల అష్టైశ్వర్యముల నిచ్చెను. అచటనే ఆ దేవుడు మేఘములో మెరుపువలె అంతర్థానము చెందెను. కనుక ఆ తీర్థమునకు 'సప్తచరు' తీర్థమని లోక ప్రసిద్ధి కలిగెను. అక్కడ అగ్నిలో చేయబడిన చరుహోమమువలన మానవుడు అనేక యజ్ఞములు చేసిన ఫలములను పొందగలడు. అచటి నుండి తిరిగి వచ్చి 'రుద్రపదము' అను తీర్థమును సేవించిన వానికి అశ్వమేధ ఫలము సిద్ధించును. బ్రహ్మచర్యము నాశ్రయించి 'మణిమంతము' అను తీర్థమును సేవించవలెను. అచటి నుండి పోయి 'దేవికా' తీర్థమును దర్శించవలెను. ఆ తీర్థమునందే బ్రాహ్మణుల ఉత్పత్తి జరిగినదని చెప్పబడుచున్నది. అది త్రిశూల ధరుడగు శివుని స్థానము. అచట స్నానముచేసి, పరమేశ్వరుని పూజించి చరు నివేదనము చేసిన వాడు అన్ని కోర్కెలను పొందును. అక్కడనే ఉన్న శంకరుని 'కామ' తీర్థమును సేవించిన సర్వసిద్ధులను పొందగలడు. అచటి జలమును, ఉసికను, పువ్వులను స్పృశించిన మానవుడు దుఃఖమును పొందడు. అచటనే ఐదు ఆమడల పొడవు-అర్థయోజనము వెడల్పుగల ఒక వేదిక కలదు. దానిని దేవతలు-మునులు సేవించెదరు.

"ధర్మజ్ఞా! అక్కడి నుండి 'దీర్ఘసత్రము' అను తీర్థమునకు పోయి స్నానపూజాదులు చేయువానికి రాజసూయాశ్వమేధముల ఫలము లభించును. ఆ తరువాత 'వినశన' తీర్థమును సేవించవలెను. అచట మేరుపృష్ఠమునందు సరస్వతీ నది గూఢముగా ప్రవహించును. అచట 'చమనోద్భేదము-శివోద్భేదము-నాగోద్భేదము' అను మూడు తీర్థములలో సరస్వతీనది ప్రత్యక్షముగా కనబడును. చమనోద్భేదమునందు స్నానము చేసినవాడు అగ్నిష్టోమ యాగఫలమును, శివోద్భేదమునందు స్నానముచేసిన సహస్రగోదాన ఫలమును, నాగోద్భేదమునందు చేసిన నాగలోకమును పొందగలడు. రాజేంద్రా! అచటి నుండి పోయి 'శశయాన' తీర్థమును సేవించవలెను. అచటి సరస్వతీ నదిలో ప్రతి సంవత్సరము కార్తీక పూర్ణిమనాడు కుందేటి రూపములో దాగియున్న పుష్కర తీర్థము కనపడును. అక్కడ స్నానము చేసినవాడు చంద్రునివలె ప్రకాశించును. అతనికి సహస్ర గోదాన ఫలము కలుగును. అచటినుండి పోయి 'కామకోటి' తీర్థమునందు మునిగిన వాడు కులమును ఉద్ధరించగలడు.

"కురునందనా! అచటి నుండి 'రుద్రకోటి' తీర్థమునకు పోవలెను. అచట కోటి మునులు వచ్చి స్నానముచేసి అచటి రుద్రదేవుని సందర్శించుటకు 'నేను ముందు-నేను ముందు' అని అందరు తొందరపడుచుండిరి. వారికి రుద్రదేవుడు కోటి రూపములను ధరించి వారందరి యెదుట ఏకకాలములో కనపడెను. అప్పుడువారు 'దేవుని నేను ముందు చూచితిని-నేను ముందు చూచితిని' అని హర్షము చెందిరి. దానికి సంతుష్టుడై పరమశివుడు అప్పుడు అందరికిని వరములను ప్రసాదించెను. కనుక దానికి 'రుద్రకోటి' యను నామమేర్పడినది. రాజేంద్రా! అక్కడి నుండి 'సరస్వతీ సంగమ' తీర్థమునకు పోవలెను. అచట బ్రహ్మాది దేవతలు, మునులు విష్ణుదేవుని ఉపాసించెదరు. అచటికి చైత్ర శుద్ధ చతుర్దశినాడు పోయి ఆ తీర్థములో స్నానము చేసిన వానికి అధికముగా సువర్ణము లభించును. సర్వపాపముల నుండి విముక్తుడై బ్రహ్మలోకమును పొందగలడు. రాజా! అచటి నుండి 'అవసాన' తీర్థమునకు పోవలెను. అక్కడ ఋషీశ్వరులు సత్రయాగములు చేసి నిర్విఘ్నముగా ముగించిరి. కనుక దానికి అవసాన (ముగింపు) తీర్థమని పేరువచ్చినది. దానిలో స్నానము చేసిన వానికి సహస్రగోదాన ఫలము లభించును. తరువాత పులస్త్య మహాముని భీష్మునకు 'కురుక్షేత్రము' మొదలగు తీర్థముల మహిమలను గూర్చి యిట్లు చెప్పదొడగెను :-

"కురువంశ భూషణా! ఆ తరువాత మానవుడు 'కురుక్షేత్ర' మునకు పోయి సేవించవలెను. ఆ తీర్థమును దర్శించినంత మాత్రముననే సమస్త జంతువులు సర్వపాపముల నుండి విముక్తులగుదురు. 'కురుక్షేత్రమునకు పోయెదను. కురుక్షేత్రము నందు నివసించెదను.' అని యెల్లప్పుడు చెప్పుచుండు వానికి ఏపాపములును అంటవు అచటి ధూళిగూడ వాయు ప్రేరితములై అత్యంత దుష్కృత్యములను చేసిన వారినైనను స్పృశించినంత మాత్రమున ఉత్తమలోక గాములను చేయును. సరస్వతీ నదికి దక్షిణముగాను, దృషద్వతీ నదికి ఉత్తరముగాను నున్న కురుక్షేత్ర ప్రదేశమునందు నివసించువారు స్వర్గమునందు నివసించువారుగానే భావింపబడుదురు. కురుక్షేత్రమునందు ఒక నెల నివసించినచో బ్రహ్మాది దేవతలు, మునులు, సిద్ధచారణాదులు గల బ్రహ్మ క్షేత్రమును చేరుదురు. కురుక్షేత్రమును మనసార ధ్యానించిన వారు గూడ పాపవిముక్తులై బ్రహ్మలోక వాసమును చేయుదురు. శ్రద్ధాయుక్తుడై కురుక్షేత్ర యాత్ర చేసినవాడు రాజసూయాశ్వమేధ యాగములు చేసిన ఫలమును పొందును. ఆ తరువాత అక్కడనే ఉన్న 'మచక్రక' అను ద్వారపాలకునకు నమస్కరించిన వాడు సహస్ర గోదాన ఫలమునందును. మచక్రకుడు మహాబల సంపన్నుడైన యక్షుడు.

"కురునందనా! ఆ తరువాత 'సతతము' అను పేరుగల విష్ణుస్థానమును సేవించవలెను. అచట సర్వదా విష్ణువుసన్నిహితుడై యుండును. అచట స్నానముచేసి ఆ దేవుని దర్శించిన వానికి అశ్వమేధయాగ ఫలము చేకూరును. పిదప 'పారిప్లవ' క్షేత్రమును దర్శించినవాడు అగ్నిష్టోమ, అతిరాత్రియాగములు చేసిన ఫలమును పొందును. పిమ్మట 'పృథివీ' తీర్థమునకు పోయి స్నానము చేసినచో సహస్రగోదాన ఫలమును పొందును. దాని నుండి 'శాలూకినీ' క్షేత్రమునకుపోయి అచటనున్న 'దశాశ్వమేధ' తీర్థమునందు స్నానముచేసిన దశాశ్వమేధ యాగఫలమును పొందును. 'సర్వదేవీ' క్షేత్రమునందలి 'నాగ' తీర్థమును సేవించిన నరునకు నాగలోక ప్రాప్తికలుగును. అచటి నుండి పోయి ద్వారపాల-తరంతుక' క్షేత్రములను సేవించి ఒకరాత్రి ఉపవసించినచో గో సహస్ర దాన ఫలమును పొందగలడు. ఆ తరువాత 'పంచనద' క్షేత్రమునకు పోయి నియతుడై యచటి 'కోటి తీర్థము'లో మునిగిన వానికి అశ్వమేధ యాగఫలము కలుగును. 'అశ్వనీ' తీర్థములో గ్రుంకినవాడు రూపవంతుడగును.

"నరశ్రేష్ఠా! పూర్వము వరాహావతారములో శ్రీ మహావిష్ణువు నివసించిన 'వారాహ' తీర్థములో స్నానము చేసినవానికి అగ్నిష్టోమ ఫలము కలుగును. 'జయంతీ' క్షేత్రమునందలి 'సోమ' తీర్థములో స్నానముచేసి రాజసూయ ఫలమును, 'ఏకహంస' తీర్థమునందు స్నాతుడై సహస్రగోదాన ఫలమును, 'కృతశౌచ' తీర్థములో మునిగి పౌండరీక యాగఫలమును, శివస్థాన మగు 'ముంజవట' క్షేత్రమును సేవించి గాణాపత్య లోకమును పొందును, అచటనేయున్న 'యక్షిణీ' క్షేత్ర సేవనము చేత మానవుడు అన్ని కోరికలను పొందగలడు. అది కురుక్షేత్రమునకు ద్వారము. దానికి ప్రదక్షిణముచేసి 'పుష్కరము' తో సమాన మగు అచటి తీర్థమునందు స్నానముచేసి పితృదేవతలను అర్చించినవాడు ధన్యుడై అశ్వమేధ ఫలమును పొందగలడు ఆ తీర్థము జమదగ్ని పుత్రుడగు పరశురాముడు నిర్మించెను. అచటి నుండి తీర్థయాత్రికుడు 'పరశురామకుండము'లకు పోవలెను. అచట పరశురాముడు క్షత్రియజాతిని నశింపజేసిన తరువాత ఐదు సరస్సులను నిర్మించెను. ఆ కుండములను అతడు నెత్తురుతో నింపెనని యందురు. ఆ రుధిరముతోనే పరశురాముడు పితృదేవతలకు తర్పణము చేసెను. అప్పుడు అతని పితృదేవతలు సంతృప్తులై పరశురామునితో నిట్లనిరి :—

"రామా! నీ పితృభక్తికి, పరాక్రమమునకు మేము సంతృప్తి చెందితిమి. వరము కోరుకొనుము. ఇచ్చెదము" ఆ మాటకు పరశురాముడు "మీరు అనుగ్రహించినచో నా పై కృప జూపుడు. నా తపస్సు పూర్తియగునట్లు ప్రసాదింపుడు. మీ వరప్రసాదముచేత నేను పూర్వము కోపావిష్టుడనై క్షత్రియ వంశములను నాశనమొందించిన పాపమును శాంతింప జేయుడు. నేను నిర్మించిన యీ సరస్సులు పుణ్యతీర్థములగుగాక." అని ఆకాశమునందున్న పితృదేవతలను ప్రార్థించెను. దానికి వారు, "వత్సా! ఈ నీ పితృభక్తిచే నీ తపస్సు వృద్ధి పొందునుగాక. క్షత్రియ హత్య వలన గలిగిన పాపముశాంతించుగాక. వారు స్వీయ కర్మలచేతనే చచ్చిరి. నీవు నిమిత్త మాత్రుడైతివి. నీ సరస్సులు గూడ పుణ్యతీర్థములై యుండునుగాక. వానిలో స్నానముచేసి పితృతర్పణము చేసినవారికి పితృ దేవతలు తృప్తులై ఇహలోక సుఖమును, స్వర్గ సుఖమును ప్రసాదింతురు గాక". అని వరములనిచ్చి వారు అతనిని వీడ్కొని అచటనే అంతర్ధానమును చెందిరి. ఇట్టి పుణ్య తీర్థములను పరశరాముడు నిర్మించెను గనుక వానికి 'రామహ్రదము' అని ప్రసిద్ధివచ్చెను. వానిలో స్నానముచేసి యచటి పరశురామ దేవుని పూజించిన వారలకు బహుసువర్ణము లభించును. ఆ యైదు తీర్థములకు 'సమంత పంచకము' లని ప్రసిద్ధి కలదు.

( స శే ష ము )

# ఆంధ్ర ప్రదేశ్‌లో గఫార్‌ఖాన్ పర్యటన

బాదుషాఖాన్, 1969 డిసెంబరు ఆఖరులో ఆంధ్రప్రదేశ్‌లో చేసిన 5 రోజుల పర్యటన యీ ప్రాంతం ప్రజల హృదయాలను ఆకట్టుకున్నది. స్వాతంత్ర్య సమరం తీవ్రస్థాయిలోఉన్న తరుణంలోని రోజులు ప్రజలకు గుర్తుకు వచ్చాయి. డిసెంబరు 22వ తేదీన ఆయన విజయవాడ వచ్చారు. విజయవాడ మున్సిపాలిటీ ఆయనకు సన్మాన పత్రాన్ని సమర్పించింది. మరుసటి రోజు హైదరాబాదు చేరుకున్నారు. ప్రేమాదరాలతో హృదయపూర్వకమైన స్వాగతం లభించింది. హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషన్

ప్రపంచంలో నిస్వార్థులే
జాతికీ, భాషకూ, మతానికీ
నిజమైన సేవ చేయగలుగుతారు.
ఇట్టివారు చేసే సేవే
దేశాన్ని గమ్యానికి చేరుస్తుంది.
ప్రతి జాతిలోనూ, ప్రతి దేశంలోనూ
నిస్వార్థ పరులూ, నిజాయితీ పరులూ
ఉద్భవించారు.
వారు చేసిన ఘనకార్యాల వల్లనే
ఆయా దేశాలూ, జాతులూ పైకి వచ్చాయి



హైదరాబాదులో గఫార్‌ఖాన్‌కు స్వాగతం చెప్తున్న గవర్నరు



గన్నవరం విమానాశ్రయంలో బాద్షాఖాన్‌కు స్వాగతం చెప్తున్న ముఖ్యమంత్రి

వారు, నిజాంకాలేజిమైదానంలో ఆయనకు పౌరసన్మానం జరిపారు. డిసెంబరు 27వ తేదీన హైదరాబాదునుండి బయలుదేరి వెళ్ళడానికి ముందు బాదుషాఖాన్ జంటనగరాలలో అనేక కార్యక్రమాలలో పాల్గొన్నారు. జాతీయ సమైక్యతా చర్చగోష్ఠికి ప్రారంభోత్సవం, న్యాయకళాశాలలో విద్యార్థుల సమావేశంలో ప్రసంగం, వనితా మహావిద్యాలయ శంకుస్థాపన, ఇబ్రాహింపట్నం సమీపంలో నమూనా అంబర్ చర్ఖాకేంద్రానికి ప్రారంభోత్సవం, ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థుల సమావేశంలోను, ఆంధ్రమహిళాసభ సమావేశంలోను ఉపన్యాసం మొదలైన కార్యక్రమాలలో పాల్గొన్నారు. జంటనగరాల పౌరుల తరపున డిసెంబరు 24న ఆయనకు జన్మదిన కానుకగా రూ. 1,01,016ల నిధిని సమర్పించారు.

## విజయవాడలో బాద్షాఖాన్

దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర)విభాగం వారు విజయవాడలో నడుపుతున్న హిందీ ప్రచార విద్యాలయ నూతన భవనానికి ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ డిశంబరు 23 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. ఈ భవన పునాది రాయిని మహాత్మా గాంధీగారు 1946 ఫిబ్రవరి ఐదవ తేదీన ఆశీర్వదించారు. దక్షిణ





ప్రజలకు కానుకలు అందచేస్తున్న బాద్షాఖాన్

భారత హిందీ ప్రచారసభ,(మద్రాసు)రజత జయంతి ఉత్సవాలలో పాల్గొని మహాత్ముడు సేవాగ్రాం తిరిగి వెళ్ళేప్పుడు ది. 5-2-1946 నాడు విజయవాడ రైలుస్టేషను సమీపాన పెద్ద సభ ఏర్పాటుచేయ బడింది. ఆ సభలో బాపూ యీ పునాది రాయిని ఆశీర్వదించగా, పూజ్య వినోబాభావే ది. 1-10-1949 నాడు విజయవాడ విచ్చేసి ఆ పునాది రాయిని మాచవరంలో ఈసభ జరుగుతున్న చోటునందు ప్రతిష్ఠించారు. అప్పటినుండి కుటీరాలు నిర్మాణం చేయబడి వాటియందు షుమారు 1200 మంది హిందీ పండితులు హిందీ ట్రైనింగ్ పొంది ఆంధ్ర దేశంలోని వివిధ హైస్కూళ్ళలో హిందీ బోధిస్తున్నారు.



విజయవాడలో హిందీప్రచార విద్యాలయ నూతన భవనానికి జ్యోతి వెలిగించడంద్వారా ప్రారంభోత్సవం చేస్తున్న గఫార్ ఖాన్

4 వేల గజాల విశాలమైన మైదానమంతా అందమైన షామియానాలతో అలంకరించబడింది. మూడు వేల మంది ఆహ్వానితులకు కూర్చోవడానికి ఏర్పాట్లు చేయబడ్డాయి. మైదానమంతా జనంతో కిట కిటలాడింది. మహిళలు ఎక్కువ సంఖ్యలో సభలో పాల్గొన్నారు. గఫార్ ఖాన్ జ్యోతి వెలిగించి భవనానికి ప్రారంభోత్సవం చేశారు. మహాత్మాగాంధీ, వినోబాభావేలతో బాటు తన పేరుగల ఫలకంకూడా భవనంలో అమర్చినందుకు హర్షం ప్రకటించారు. ప్రత్యేకించి ఏర్పాటు చేయబడిన వేదికపై స్వామీ రామా



విజయవాడలో గఫార్ ఖాన్‌కు స్వాగతం పలుకుతున్న పౌరులు

నంద తీర్థ, ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్, కాసు బ్రహ్మానందరెడ్డి, డా. కె. ఎల్. రావు గారలు ఆశీనులైనారు. ప్రచారక విద్యాలయ విద్యార్థినులు మీరా భక్తిగీతం, గాంధీ గీతం గానంచేశారు. స్వామీ రామానందతీర్థగారిని, గఫార్ ఖాన్ గార్ని పుష్పమాలాలంకృతుల్ని గావించారు. స్వామీ రామానందతీర్థ స్వాగతోపన్యాసం చేస్తూ దక్షిణ భారత హిందీ ప్రచారసభ చరిత్రను గురించి, దాని వివిధ కార్యక్రమాలను గురించి వివరించారు. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖానును తమ మధ్యచూచి భారతదేశ ప్రజలు మహాత్మా గాంధీని చూస్తున్నట్లు భావిస్తున్నారని, దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్ర శాఖ ఆహ్వానాన్ని అంగీకరించి నూతన భవన నిర్మాణ ప్రారంభోత్సవానికి గఫార్ ఖాన్ విచ్చేయడం సభ అదృష్టమని అన్నారు.



హైదరాబాదులోని 'ఎగ్జిబిషన్' మైదానంలో గఫార్ ఖాన్ ప్రసంగిస్తున్న దృశ్యం.



బాద్షాఖాన్ 80వ పుట్టిన రోజు సందర్భంగా (రాజ్‌భవన్‌లో) జరిగిన ప్రార్థనా కార్యక్రమం

ఖాన్ గఫార్‌ఖాన్ ఈ సందర్భంలో ప్రసంగిస్తూ—

"మీరు నాయెడ చూపిన ప్రేమకు, ఆదరణకు కృతజ్ఞుణ్ణి. మీరు చేస్తున్న సేవా కార్యాన్ని గురించి నేను విశేషించి చెప్పగలిగిన దేమీ లేదని మనవి చేస్తున్నాను. మీరు చేస్తున్నది గొప్ప సేవాకార్యం. ఇలాంటి సేవా కార్యాలవల్లనే దేశం అభివృద్ధిలోకి వచ్చి గమ్యాన్ని చేరుకొంటుంది.

"జాతీయ సమైక్యత ఒక్క భాషవల్లే సమకూరుతుంది. ఒకే భాష జాతిని ఏకంచేస్తుంది. దేశ సమైక్యతకు ఒకే భాష అవసరమని నేను మా దేశ ప్రజలకు, ఆఫ్ఘనిస్తాన్ ప్రజలకు కూడా చెబుతూ వుంటాను. మీరంతా యిట్టి మంచి పనికి పూనుకొని యున్నందుకు నాకు సంతోషంగా ఉంది. ముఖ్యంగా జాతీయ భాషా విషయంలోను, సంస్కృతీ విషయంలోను సేవచేయాలెననే తలంపు స్త్రీలకు కలగడంచూచి అమితంగా సంతోషిస్తున్నాను. ప్రపంచంలో నిస్వార్థులే జాతికి, భాషకు, మతానికి నిజమైన సేవ చేయగలుగుతారు. ఇట్టివారు చేసే సేవయే దేశాన్ని గమ్యానికి చేరుస్తుంది. ప్రపంచ చరిత్రను చూడండి ప్రతి జాతిలోను, ప్రతి దేశంలోను నిస్వార్థపరులు, నిజాయతీపరులు ఉద్భవించారు. వారు చేసిన ఘన కార్యాలవల్లనే ఆయా దేశాలు, జాతులు పైకి వచ్చాయి.



హైదరాబాదులోని ఆంధ్రమహిళా సభలో గఫార్‌ఖాన్




హైదరాబాదులో న్యాయశాస్త్ర విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగిస్తున్న గఫార్‌ఖాన్



విజయవాడలో గాంధీ కొండమీద కాంతి, శబ్ద, ప్రదర్శనా కార్యక్రమాన్ని తిలకిస్తున్న గఫార్‌ఖాన్

"భారతదేశంలోనే గాక, మా దేశంలోని స్త్రీలు కూడా చేసే పని నిస్వార్థమైనది. మనం—అనగా పురుషులం చేసే పనుల్లో కొంతైనా స్వార్థం నిండివుంటుంది. కాని స్త్రీలు నిస్వార్థ బుద్ధితో సేవారంగంలో పనిచేస్తారు. జాతీయ భాషావ్యాప్తికి స్త్రీలు ఎక్కువగా కృషిచేస్తున్నందుకు ఆనందంగా ఉంది." అన్నారు శ్రీ గఫార్‌ఖాన్.

*

సీరియల్

# గృహాదరి

పిలకా గణపతి శాస్త్రి

గుప్త రాసిన ఉత్తరం చదివి అతని సౌజన్యం సంపూర్ణంగా ఆకళించుకొన్న పార్థసారథి కెంతయినా ఆశ్చర్యము, ఆనందము కలిగాయి. చేతికి తగిలిన సొమ్ము వెంటనే పంపించవలసినదని గుప్త కోరలేదు సరికదా, ముమ్ముందు ఎప్పుడయినా కృష్ణతులాభారం వేసినప్పుడు ఆ ఖర్చులతో ఆ మొత్తం సరిపెట్టుకో వచ్చునని రాస్తున్నాడు! పాపం! కృష్ణ తులాభారం మీద, తనమీద అతని కెంతటి అభిమానం.

ఆ నాటకం ప్రదర్శనాల వ్యవహారంలో పార్థసారథి కెంతో మంది వ్యాపారస్థుల అంచనాల అను పానులన్నీ తెలిశాయి. వారిలో చాలా మందికి నాటకాలంటే మోజు లేదు. ఎంత సేపూ లాభాలమీదే కన్ను! వారిలో కొంతమంది సరోజ చాకచక్యంతో బాటు అందచందాలు, అవయవసౌష్ఠవము నిశితంగా పరిశీలించడం కోసమే అమాంతంగా నాటకాలమీద అంత అభిమానం పెంచుకున్నారు. పాపం! గుప్త ఒకడు వారిలో తప్ప పుట్టినట్టున్నాడు! నాటకాలంటే అతనికి ఎంత అభినివేశము! ఎంత సరదా! సహజంగా ఎంతటి సౌజన్యమూర్తి! అదే సమయంలో రాఘవ వట్టి జానపద చిత్రం 'బంగారు నౌక' లో మాంత్రిక వేషంకోసం అకస్మాత్తుగా నాటకాలమీద తన అభిమానం అంతా విడిచిపెట్టి వెళ్ళిపోయిన సంగతి అతనికి జ్ఞాపకం వచ్చింది! అతడు చిన్నప్పటినుంచి, నిజమయిన నాట్యకళాభినివేశంతోనే రంగస్థలంలో అడుగుపెట్టాడు, కాని అభినయానికే మాత్రము అవకాశంలేని సామాన్యమయిన చవకబారు జానపద చిత్రంలో మారుమూల మాంత్రిక వేషం దొరకగానే మరీ వెనకముందు లేమాత్రము ఆలోచించుకోకుండా అతి రహస్యంగా దానిలో చేరిపోయాడు! గుప్త సహజంగా వ్యాపారస్థుడు! అయినా నాటకాల మీద వెర్రి వ్యామోహంతో సతమత మవుతున్నాడు! ఎన్నెన్ని కష్టనష్టా లెదురుపడినా లక్ష్యపెట్టక తిరిగి కృష్ణతులాభారం ప్రదర్శనం కోసం ఉవ్విళ్లూరుతున్నాడు! రాఘవకు ఆ అభిమానంలో శతాంశమయినా మనసులో మిగిలిఉంటే తమ మండలి ఈనాడీ విధంగా ఛిన్నాభిన్నమయి ఉండేదా?

పార్థసారథికి ఆ సమయంలో సరోజా రాఘవల కిద్దరికి బదులుగా వేరుగా ఇద్దరు నటీనటుల నేర్పాటు చేసి ఎలాగో అలాగ కృష్ణతులాభారం ప్రదర్శనం కొనసాగిస్తూ తిరిగి తమ మండలి పేరు ప్రతిష్ఠలు నిలబెట్టుకోవాలని ఒక తీవ్రమయిన సంకల్పం కలిగింది. కాని దానికెక్కడ కనుచూపు మేరలో దారి కనబడలేదు. చిర కాలంనుంచి, పునాదుల దగ్గరనుండి ఎంతో శ్రమించి నిర్మించుకొన్న కృష్ణతులాభారం గోపురం అంతా ఒక్కమారుగా నేలమట్టంగా కూలిపోయింది. చేతులతో బాటు గుండెకూడా కాలిపోయాయి. ఆస్తులు అప్పుడే దరిదాపుగా సగంవరకు హరించుకు పోయాయి ఆపైన నైరాశ్యంవల్ల నవనాడులు కుంగిపోయాయి. నాటకాలమీద ఎంత అభిమానమున్నా తానొక్కడు ఏమి చెయ్యగలడు?

ఆపైన ఇటీవల విరుచుకుపడిన దారుణ మరణభీతి ఆఘాతం వల్ల అతనిలో కొంత లోతయిన ఆత్మ విమర్శ చెలరేగింది. ఇంతకాలంనుంచి తానొక ఎన్నదగిన నటుడయినట్టు భ్రమించాడు! కాని తనకొక్క శరీర సౌష్ఠవం తప్ప తగినంత అభినయశక్తి లేదని ఇంతకుమునుపు కొంతమంది అనుకుంటున్నారని పరోక్షంగా విన్నాడు. అప్పుడామాట అంతగా లక్ష్యపెట్టలేదు. ఇప్పుడా

## జరిగిన కథ

పార్థసారథి నాటకాలు వేస్తుంటాడు. ఏలూరులో ఒకసారి శ్రీకృష్ణ తులాభారం వేద్దామని బ్రహ్మాండంగా ఏర్పాటు చేసుకున్నాడు. ఆ నాటకంలో హీరోయిన్ వేషంవేసే సరోజకు సినిమాలో ఛాన్సు దొరకడంవల్ల ఆమెరావడం పడలేదు. నాటకం అభాసైంది. ఆమెను వెంట బెట్టుకుని వద్దామని పార్థసారథి మద్రాసు వెళ్ళాడు. అక్కడ సరోజ మేనమామతో ఘర్షణపడ్డాడు. మనసంతా వికలమైంది. జ్వరంతో కదలలేకుండావున్న అతన్ని అతని బంధువు కృష్ణమూర్తి, యింటికి చేరవేశాడు. చావు బ్రతుకుల్లో కొన్నిరోజులు కొట్టుకొని చివరకు తేరుకున్నాడు పార్థసారథి. ఏలూరు నించి నాటకం కంట్రాక్టరు గుప్త ఉత్తరం రాశాడు.

విమర్శ చాలావరకు యధార్థమే అని నిశ్చయించుకున్నాడు. కృష్ణతులాభారానికేదయినా పేరువస్తే దానికి సరోజా రాఘవల అభినయ చాకచక్యాలే ప్రధాన కారణాలని కూడా గ్రహించుకున్నాడు. కొంత విగ్రహపుష్టివల్ల ఎదో రవంత శ్రావ్యంగా పాడడంవల్ల మాత్రమే తనకాపాటి కీర్తి వచ్చిందని కూడా నిర్ణయించుకున్నాడు. నిజానికి సంగీతానికి, శరీర సౌష్ఠవానికి నాటకాభినయానికి సంబంధం ఏమి ఉంది. అలాంటప్పుడు ఇంకా నాటకాలమీద వ్యామోహంవల్ల ప్రయోజన మేమిటి?

అదీగాక సమర్థులయిన నటులకందరికి, ఎలాంటి జటిలమయిన భావమయినా ఇట్టే వ్యక్తీకరించగలిగిన శక్తితోబాటు, గొప్పలోకజ్ఞత, మానవ స్వభావ విజ్ఞతకూడా ఉండితీరాలని బళ్లారి రాఘవ ఒకప్పుడేదో ఉపన్యాసంలో చెప్పిన సూక్తులు కూడా అతనికాసమయంలో తటాలున స్ఫురించాయి. అప్పుడవి విని

ఔనౌనని తల ఊగించి అభినందించాడు. కాని ఇప్పుడు ఆలోకజ్ఞత, మానవ స్వభావ విజ్ఞత తనకేమాత్రము లేవని అనుకున్నాడు ఏ మాత్రం లోకజ్ఞత ఉన్నా ఈ నాటక వ్యవహారం అంతా ఇలాగ అస్తవ్యస్తంగా అధ్వాన్నంగా తయారయి ఉండేదా? సరోజ రాఘవ చాలాకాలంనించి సినిమాలో చేరిపోవాలని నిర్ణయించుకున్నారు తాను చూచాయగా నయినా ఆ సంగతి పసిగట్టలేకపోయాడే! మానవ స్వభావ విజ్ఞత అన్నమాటయినా తలపెట్టడానికి తనకర్హత ఉన్నదా? ఇటీవల సరోజ తన మీద ఇష్టం లేకపోయినా ఉన్నట్టు ఎంత గొప్పగా నటించింది? అంతటి నటనాశక్తి లేదు సరిగదా, దానిలో శతాంశమయినా తనలో లేదు!

మొత్తంమీద తోటి నటీనటులలో చాలామంది కొంత ముందుజాగ్రత్తతో వ్యవహరిస్తున్నారు! సాధ్యమయినంత వరకు తమ సంసారాలు చక్కగా నడిపించుకుంటున్నారు! తానిన్నాళ్లనించి తన సంసారం సంగతి ఏ మాత్రమయినా పట్టించుకున్నాడా? పోనీ అనుకుంటే ఈ నాటకాల్లో దిగి తానేమి బావుకున్నట్టు? ఇక అవి పట్టుకుని వేళ్లాడితే ప్రయోజనమేమిటి? పోనీ అనుకునిఆత్మాభిమానం చంపుకోలేక ఎలాగో అలాగ కృష్ణతులాభారం ప్రదర్శనం కొనసాగించినా దేశంలో నాటకాలంటే చెవికోసుకునేవాళ్లు ఎంత మంది ఉన్నారు? ఊరికే వీపుతట్టి ఉపన్యాసలిస్తారుగాని నిజమయిన అభిమానము, ఆసక్తి ఎంతమందికి ఉన్నాయి? ఇక ఇప్పటికయినా తోటి నటీనటులందరిలాగే తానుకూడా కొంచెం ముందు జాగ్రత్తతో కుటుంబ క్షేమం చూసుకోవడం న్యాయంకాదా?

తమ శక్తిసామర్థ్యాలు, లోటుపాట్లు, మంచిచెడులు నిశితంగా గ్రహించుకోవాలని ఆలోచించేవారే చాలా అరుదుగా ఉంటారు. వారిలోకూడా అవి వాస్తవిక దృష్టితో యథార్థంగా అవగాహన చేసుకోగలవారు అంతకన్నా అరుదుగా కనిపిస్తారు. అయితే ఇటీవల కలిగిన తీవ్ర శారీరక మానసాఘాతాల వల్ల పార్థసారథికి అటువంటి ఆత్మ వివేచనా శక్తి కొంత అలవడింది. లోకం తీరుతెన్నులు చాలావరకు యథాతథంగా ఉన్నవి ఉన్నట్టుగా అవగాహన చేసుకున్నాడు. అయితే విపరీతమైన నైరాశ్యం నిరుత్సాహంవల్ల తన శక్తిసామర్థ్యాలు, అభినయ నైపుణి బాగా తక్కువగా అంచనావేసుకున్నాడు అయినా నాటకాల ప్రమేయం పూర్తిగా విడిచి పెట్టడం అంటే అతని కెంతో వ్యధకలిగింది. తన నిండు గుండెలో వేడి నేత్తురంతా పిండివేసుకున్నట్టు తీరని యాతన చెలరేగింది కాని మరి మార్గాంతరం కనబడలేదు! ఆపైన నటనలో కాని, లౌకికవ్యవహారాలలో కాని తగినంత శక్తి, సామర్థ్యములేని తనవంటి వ్యక్తి నాటకాలెలాగ నిర్వహించగలడని కూడా ప్రశ్నించుకున్నాడు. పోనీ ఇక పోగా మిగిలిన ఆస్తితో నయినా తనకుటుంబ క్షేమంకోసం శాయశక్తులా ప్రయత్నించాలని సంకల్పించుకున్నాడు. అంతలోనే కృష్ణతులాభారంమీది మమకారం తిరిగి అతన్ని వెనక్కి లాగింది! ఎలాగయినా ఆ నాటకం మళ్లీ ప్రదర్శించడం అంత కష్టమా? తానెందుకలాగ నిరాశపడి తలవంచుకుని వెళ్లిపోవాలి? ఎదుకంతటి నైరాశ్యం? సరోజ, రాఘవ లేకపోయినంత మాత్రాన ఆ నాటక ప్రదర్శనం ఛిన్నాభిన్నమయి పోవలిసినదేనా? పట్టుదలతో ప్రయత్నిస్తే ఆమాత్రం నటీనటులే దొరక్కపోతారా?

ఆ విధంగా మరికొంత సేపు ఆ నాటక ప్రదర్శనాన్ని గురించి ఆలోచించిన తరవాత తిరిగి అతనిలో తీవ్రమయిన ఆత్మపరిశీలనం ప్రారంభమయింది ఆ నాటకం తిరిగి అంత గొప్పగా ప్రదర్శించడం మరి తనవల్లకాదని తోచింది. మరి కొంత సేపలాగ మదనపడిన తరవాత అసలా నాటకం పరమార్థం తన కేమాత్రము అర్థం కాలేదని స్ఫురించింది దానిలో సత్యభామ అనురాగం కన్న రుక్మిణీదేవి ప్రేమ ఎంతగొప్పది! ఎంత గంభీరమయినది! కాని ఇన్నాళ్లనించి ఆమె గొప్పతనం అంత విస్పష్టంగా తనకు అవగాహన కాలేదు! ఇటీవల విజయలక్ష్మి ఆత్మీయత పరిశీలించిన తరవాతే రుక్మిణీదేవి ప్రేమకిలోగల లోతెంతటిదో స్పష్టంగా అవగాహన అయింది అంతకుమునుపు ఆ ప్రేమ గాంభీర్యమేమాత్రము తన అనుభూతికి రాలేదు. ఆ మాత్రం ఆకళింపు లేనప్పుడు తానెందుకిక ఆ నాటకం సంగతి తలపెట్టాలి! ఆ పైన ఇక కృష్ణ తులాభారం మాటే ఆలోచించ కూడదని నిశ్చయించు కున్నాడు.

వెంటనే గుప్త కెంతో కృతజ్ఞతతో సమాధానం రాశాడు. ఎంతగా ప్రయత్నించినా తలకు మించిన అనివార్య కారణాలవల్ల తాని కృష్ణతులాభారం ప్రదర్శించదలుచుకోలేదని విస్పష్టంగా వెల్లడించాడు దానికి మన్నించక తప్పదని మర్యాదగా బ్రతిమాలు కున్నాడు. త్వరలోనే పదిహేను వందల రూపాయలు మనియార్డరుద్వారా పంపించివేస్తున్నట్టు తెలియజేశాడు. ఆ పైన ఖర్చయిపోగా మిగిలిన తన ఆస్తి పాస్తుల సంగతీ ఆలోచించాడు. తండ్రి సంపాదించి బ్యాంకిలో వేసిన ప్రాతిక వేల రూప్తాయలలోను ఇంచుమించుగా ఎనిమిదివేలప్పుడే కరిగిపోయాయి! భూవసతిలో మాత్రం పది పన్నెండు ఎకరాల కొంద్రదాకా మిగిలింది. ఆ పైన తాను ఉంటున్న మేడకూడా చెక్కు చెదరకుండా నిలబడింది. లేని పోని ఆర్భాటాలన్ని కట్టిపెట్టి జాగ్రత్తగా కాలక్షేపం చేస్తే తానా మిగిలిన ఆస్తితో కొంత మర్యాదగా, గుంభనగా కాలక్షేపం చెయ్యవచ్చును!

అయితే చాలా కాలంనించి పొద్దున్న లేచినది మొదలుకొని సాయంకాలందాకా నాటకాల హంగామాలతోనే సరదాతోనే తన కాలం అంతా గడిచిపోయింది మరి తన కిక కాలక్షేపం కావడమెలాగ? పోనీ తన మండలిలో ఒకరిద్దరు నటీ నటుల నెవరినయినా చేర్చుకుని కొత్త నాటకమేదయినా ప్రదర్శించడం ప్రారంభిస్తే? అప్పటి కది పార్థసారథి కొంత ఆలోచించదగిన మార్గంలాగే కనబడింది అయితే ఇదమిద్ధంగా నిశ్చయించడానికి మాత్రం తగినంత ధైర్యం కలగలేదు. సరే దానిమాట తరవాత ఆలోచించుకోవచ్చునని నిశ్చయించుకున్నాడు. నాలుగైదు పద్యాలు వంటబట్టిన తరవాత బ్యాంకిలోనించి కొంత సొమ్ముతీసి దానిలో పదిహేనువందల రూపాయలు వెనువెంటనే గుప్త పేర మనియార్డరు పంపించాడు. మిగిలిన మరి కొంత మొత్తంతో తన మండలి నటీ నటుల కివ్వవలసిన బాకీలన్ని పూర్తిగా తీర్చివేశాడు.

అదే సమయంలో తన ప్రభా టాకీస్ పన్నెండువేలకి కొనుక్కోవలిసినదని ఒక మధ్యవర్తి ద్వారా రామ సుబ్బయ్య అతనికి కబురు పంపించాడు. అది చాలా లాభసాటి బేరమని

రాఘవ అంతకు మునుపే అతని కొక చక్కని సలహా ఇచ్చాడు! ఆ హితోపదేశంలోగల వేళాకోళము, విషయము అతని కర్థం కాకపోలేదు! 'నువ్విక నాటకాల కెందుకు పనికిరావు! ఏదో ఒక టాకీస్ దుకాణం పెట్టుకొని పెళ్ళాం పిల్లల్ని పోషించుకో! ఇక నీపని అయిపోయిందిలే! చూశావా? నువ్వు చూస్తూండగానే సరోజ నేను ఎంత గొప్పవాళ్ళ మయిపోయామో! ఇక ఆలస్యం చెయ్యక నెత్తిమీద ముసుగు ఎసుకుని ఇంటికి వెళ్ళిపో!" అదే దాని అంతరార్థం!

ఒకవేళ రామ సుబ్బయ్య వ్యవహారంలో ఏమయినా లాలూచీ ఉందేమో! అతనివల్ల నాలుగు రాళ్లు తిని రాఘవ తన సవిధంగా ఒక పెద్ద గోతిలోకి తోసివేస్తున్నాడేమో! లేకపోతే ఆ టాకీస్ ఇంతకు మునుపేదయినా తణఖాలో ఉన్నదేమో! పార్థసారథి దాని అనుపానులన్ని పూర్తిగా తెలియనిదే ఆ సంగతే తలపెట్టకూడదని నిర్ణయించుకున్నాడు. రెండు మూడు రోజుల పాటు ఆ టాకీస్‌ను గురించి బాగా వాకబుచేశాడు అది పనికట్టిన రామ సుబ్బయ్యా దానికి ఏలాంటి లావాదేవీలు లేనట్టు తాను పూచీ పడగలనని తిరిగి కబురు పంపించాడు.

అయితే తగినంత కట్టుదిట్టమయిన అజమాయిషీ లేక ప్రస్తుతం ప్రభా టాకీస్ కొంత నష్టంతో నడుస్తున్నదని పార్థసారథికి తెలిసింది. అందుచేత దాని కొనుగోలు వ్యవహారంలో బాగా తటపటాయించాడు. ఆ దండుగ వ్యవహారంలో తా నెందుకు తలదూర్చాలి? పోనీ మరి కొంతకాలంపాటు ఆగకూడదా? ఇప్పుడంత కాళ్లు విరగదొక్కుకో వలిసినంత అవసరం ఏమి వచ్చింది? ఆ పెన పార్థసారథి మరి రెండు మూడు రోజులదాకా దాని మాటే తలపెట్టలేదు.

ఆ తరవాత అతనికి ఒక పెద్ద షావుకారది కొనాలని ఆలోచిస్తున్నట్టు తెలిసింది? ప్రభా టాకీస్ సరిగ్గా ఊరికి మధ్యగా ఉంది అది ఇటీవల కొంత నష్టంమీద నడుస్తున్నది కాని ఇంతకు మునుపది ఖర్చులన్ని పోను అయిదారు వందల దాకా లాభం గడించింది. తాను కష్టపడి పనిచేస్తే క్రమ క్రమంగా ఆమాత్రం లాభం రాకపోదు ఆ తరవాత ఒకనాడు ఆ టాకీస్ కొనదలిచి నది. లేనిది నిక్కచ్చిగా తేల్చి చెప్పవలిసినదని తిరిగి రామ సుబ్బయ్యా మధ్యవర్తి ద్వారా తొందరచేశాడు. రెండు మూడు రోజులలోగా ఏదో మాట తప్పకుండా తేల్చివెయ్యగలనని పార్థసారథి అతనికి వాగ్దానం చేశాడు.

అయితే అతనిలో తిరిగి మండలిని గురించిన మదన ప్రారంభమయింది. సరోజా, రాఘవల వంటి నటులు లేకపోయి నందువల్ల కృష్ణతులాభారం ప్రదర్శించడం కష్టం కావచ్చును. కాని వారికి బదులుగా ఇద్దరు నటీనటులను చేర్చుకుని తిరిగి తన కృష్ణ వేషంతో గయోపాఖ్యానం ప్రదర్శించి తిరిగి పేరు ప్రతిష్ఠలు సంపాదించుకోవచ్చును. ఆ నిర్ణయం విని మిగిలిన మండలి సభ్యులెంతయినా ఆనందిస్తారు. అదీగాక జనం కృష్ణతులాభారం కన్న గయోపాఖ్యానమే ఎక్కువగా అభిమానిస్తున్నారు. అందువల్ల తగినంత కట్టుదిట్టంతో ఆ నాటకం ఆడితే లబ్ధి కూడా కొంచెం ఎక్కువగానే ఉంటుంది. తన కంతగా లోకజ్ఞత లేకపోయినా పూర్వానుభవంతో ముమ్మందు జాగ్రత్తగా వ్యవహరించవచ్చును. అయితే దానికోసం రాత్రింబవళ్లు విద్రాహారాలు లేకుండా శ్రమించాలి మండలి తిరిగి ప్రారంభించ దలుచుకున్నప్పుడు ఇక ప్రభా టాకీస్ మాటే తలపెట్ట కూడదు. దానికి దీనికి లంగరం దదు. ఒకవేళ ప్రభా టాకీస్ కొంటే తానిక నాటకాలమాటే తలపెట్ట కూడదు. రాత్రింబగళ్లిక దాని అభివృద్ధి కోసమే పని చెయ్యాలి. తానిప్పుడేమి చెయ్యాలి? ప్రభా టాకీస్ కొనాలా? మండలి తిరిగి ప్రారంభించాలా? ఏదో ఒకటి చేసి తీరాలిగాని తానింటిదగర ఊరికే గోళ్లు గిల్లుకుంటూ కూర్చోలేదు. ఆ విషయంలో మాత్రం సందేహమేమిలేదు. ఏమి చెయ్యాలి?

నాటకాలమీద చిరకాలం నుంచి పేరుకొన్న అభిమానం అతనిని మండలివైపు లాగింది. తన శక్తి సామర్థ్యాలెలాంటివో తిరిగి సరోజా రాఘవల కిద్దరికి చవి చూపించాలని అనిపించింది. అంతలోనే కృష్ణతులాభారం వల్ల వచ్చిన కష్ట నష్టాలతనిని ప్రభా టాకీస్ వైపు మళ్ళించాయి. ఇప్పటికయినా కాస్త కుటుంబం మంచి చెడ్డల సంగతి ఆలోచించాలన్న సంకల్పం కలిగింది. అందుచేత మరి మండలి మాటే తలపెట్టకుండా ప్రభా టాకీస్ కొనాలని ఆలోచించాడు. అది నడిపించడంలో అంతటి కష్టమేమిలేదు. కొన్నాళ్ళపాటు శ్రమపడితే ఆపైన అది ఒక దారిలో పడుతుంది. అయితే తానిక నాటకాల వ్యవహారానికి పూర్తిగా స్వస్తి చెప్పవలసినదేనా? రంగస్థలంమీద సంపూర్ణంగా పరాజయం పొందినట్టు అంగీకరించి తల వంచుకుని వెళ్ళిపోవలసినదేనా? ఎంత సేపటికి అతనికెటూ తెగలేదు. ఆపైన వ్యవహారం తానంతట తానై నిర్ణయించుకోవడం మంచిది కాదని నిశ్చయించుకున్నాడు.

* * *

ఆ మరునాడు పొద్దున్న కాఫీ తీసుకున్న తరువాత విజయలక్ష్మితోను. కృష్ణమూర్తితోను తన సమస్య సంగతి ప్రస్తావించాడు. విజయలక్ష్మి దానికేమి బదులు చెప్పలేదు. పార్థసారథి నాటకాల పీడ పూర్తిగా వదిలిపోయిందని కృష్ణమూర్తి అంతకు మునుపెంతో సంతోషించాడు. అందుచేత అతడు తిరిగి మండలి వ్యవహారాలలోగాని, ప్రభా టాకీస్ బెడదలోగాని తల దూర్చడం కృష్ణమూర్తి కేమాత్రము రుచించలేదు! అదేమాట కుండ బద్దలు కొట్టినట్టు నిష్కర్షగా చెప్పివేశాడు. నాటకాలవల్ల అంతటి కష్ట నష్టా లెదురయినప్పుడు మళ్ళీ వాటి మాట తలపెట్టడం మంచిది కాదని చల్లని మాటలతో హితబోధ చేశాడు. ప్రస్తుతం కొంత నష్టంతో నడుస్తున్న ప్రభా టాకీస్ మాత్రం మాట దక్కించ గలదని నమ్మక మేమిటని వాదించాడు. అందుచేత కడుపులో నీళ్లు కదలకుండా సుఖంగా కాళ్ళమీద కాళ్ళు వేసుకుని ఇంటి దగ్గర కూర్చోవడమే మంచిదని సలహా ఇచ్చాడు.

ఆదేసమయంలో ఆ వేళ వంటకాలేమి చెయ్యాలని విజయలక్ష్మిని అడగడానికని వర్ధనమ్మ అక్కడికి వచ్చింది. ఆమె మనవరాలి సలహా తీసుకున్న తరవాత పార్థసారథి ఆ వ్యవహారం ముచ్చటించి సలహా చెప్పవలసిందని అడిగాడు. వర్ధనమ్మ రవ్వంత సేపు తటపటాయించింది.

'ఏమోనాయనా ! ఆడదాన్ని, నాకా గొడవలేమి తెలుస్తాయి! కాస్త పిల్లలు కలవాడవు, నువ్వే ఆలోచించుకోవాలి కాని ! అయినా పుట్టెడు రోగంపడి లేచినవాడవు, ఇంతలోనే ఈ గొడవలన్ని నెత్తిమీద వేసుకోవడం ఎందుకు?"

మండలి ప్రారంభించడంకాని, ప్రభాటాకీస్ కొనడంగాని ముసలావిడ కిష్టంలేదని పార్థసారథి క్షణంలో పసికట్టి వేశాడు. ఎంతో ఆప్యాయంగా భార్యవైపు చూశాడు.

'"విజ్జీ ! మరి నువ్వేమంటావో చెప్పు ! ఇక ఏ వ్యవహారమయినా నీ పేరుతోనే నడిపిద్దామని అనుకుంటున్నాను ! నీ జాతకం చాలామంచిదని కృష్ణమూర్తి అంటున్నాడు ! నేనిలాగ బ్రతికి బయటపడడానికి కూడా ఆదేకారణమని వాదిస్తున్నాడు ! నాకీ జాతకాలంటే అంతగా నమ్మకం లేదుగాని పోనీ అతని మాటలు కొట్టెయ్యడ మెందుకని అనుకుంటున్నాను ?"

అయినా విజయలక్ష్మిమాట్లాడలేదు. చిరునవ్వులు చిలకరిస్తున్న చూపులతో భర్తధోరణి పరిశీలించింది. అంతలోనే పార్థసారథి తిరిగి అందుకున్నాడు.

'ఇక నేనిలాగ ఇంటిదగ్గిర గోళ్లు గిల్లుకుంటూ కూర్చోలేను! నాకేమీ తోచడంలేదు. ఏదో ఒకటి చెయ్యక తప్పదు. మండలి ప్రారంభిస్తే దానికి నీ పేరే పెడతాను. ప్రభాటాకీస్ కొంటే నీ పేరంటే కొందామని అనుకొంటున్నాను. ఏదో ఒకటి త్వరగా ఆలోచించి చెప్పు !'

కాపరానికి వచ్చినప్పటినించి విజయలక్ష్మిని పార్థసారథి 'విజయా!' అని మాత్రమే పిలిచాడు. ఇప్పుడెంతో ఆత్మీయతతో 'విజ్జీ!' అని పిలిచినంతనే ఆమె పట్టరాని సంతోషంతో తలమునకలయింది. అదీ గాక ఇంతకాలంనించి ఏ వ్యవహారమూ రవంతయినా ఆమెతో ఆలోచించలేదు ! ఇప్పుడు మండలి తిరిగి ప్రారంభించినా, టాకీస్ కొన్నా అంతా తన పేరుమీదుగానే నడిపించాలని ఆలోచిస్తున్నారు ! ఆ పైన ఆ తుదినిర్ణయం తన మీదే విడిచిపెట్టినందుకు ఆమె మరింతగా ఆనందించింది. చిరునవ్వులు సుడులు కట్టిన చెక్కిళ్లతో రవంత సేపు భర్త నేత్రాలలో ప్రతిఫలిస్తున్న ఆతృత పరీక్షించింది.

'ఇక ఇప్పటినించి తప్పకుండా నా మాటమీద నిలబడతారా?'

'ఆం ముమ్మాటికి ! ఇక అన్ని వ్యవహారాలలోను అక్షరాలా నీ మాట ప్రకారమే నడుచుకుంటాను !"

'మాట తప్పరుకదా !'

'తప్పను !'

విజయలక్ష్మి నాలుగయిదు క్షణాలపాటు ఆలోచించింది.

'ఇన్నాళ్లనించి ఈ నాటకాలవల్ల లేనిపోని ఇబ్బందులు తప్ప మీరేమి బాపుకున్నారు! కనక మరి ఆ మండలి మాట తలపెట్టకండి! ఆ టాకీస్ కొంటే దానివల్ల ముమ్ముందు కొంత లాభము వస్తుంది. మీకు కాలక్షేపమూ అవుతుంది. ఈ వేళ పొద్దుటినించి నాకు ఎడమ కన్ను అదురుతూంది. ఇది శుభశకునమే. కనక మరి ఆలస్యం చెయ్యక ఈ వేళే ఆ టాకీస్ కొనే ఏర్పాటులన్ని చెయ్యండి !"

విజయలక్ష్మి అలాగన్న తరవాత వర్ధనమ్మ, కృష్ణమూర్తి కూడా మండలి తిరిగి ప్రారంభించడంకన్న టాకీస్ కొనడమే కొంతమెరుగని అంగీకరించారు. ఇంటిల్లపాది అలాగ సలహా చెప్పిన తరవాత పార్థసారథికి కూడా ఆదే మంచిమార్గమని అనిపించింది.

ఆనాడే ఆ టాకీస్ కావాలని నిశ్చయించుకున్నట్టు మధ్యవర్తి ద్వారా రామసుబ్బయ్యకు కబురు పంపించాడు మధ్యాహ్నం బేంకికి వెళ్ళి మిగిలిన సొమ్మంతా తీసుకు వచ్చాడు. మొట్టమొదటగా ఇంచుమించుగా వెయ్యి రూపాయలదాకా ఆయన ఇద్దరి డాక్టర్ల బిల్లుల మొత్తము చెల్లించి వేశాడు. ఇంకొక పదిహేను వందలతో ఇటీవల విజయలక్ష్మి తన నగలు కొన్ని తాకట్టుపెట్టించి చేసిన అప్పులన్ని పూర్తిగా తీర్చివేశాడు. ఆ మరునాడే ప్రభా టాకీస్ విజయలక్ష్మిపేర కొని దానికి సంబంధించిన రాతకోతల వ్యవహారం అంతా పూర్తి చేశాడు ! రాఘవ పేరుతోఉన్న నాట్యకళామండలిని రద్దు చేయించి లైట్లు మొదలయిన కొన్ని విలువయిన వస్తువులన్ని చాలా వరకు అమ్మివేశాడు. ఇక మిగిలిన దుస్తులు మొదలయినవన్ని మండలి నటీనటుల కందరికి వేర్వేరుగా బహూకరించాడు. వారేదయినా కొత్త మండలి స్థాపించుకున్న పక్షంలో యథాశక్తిగా తోడ్పడగలనని వాగ్దానం చేశాడు. అంతేగాని తానిక రంగస్థలంమీద అడుగు పెట్టదలుచుకోలేదని నిష్కర్షగా చెప్పివేశాడు. దానితో అతనికి ఒక్కమాటుగా కొండంత బరువు గుండెమీదినుంచి దించివేసినట్టనిపించింది. కాని అంతరాంతరాలలో మాత్రం ఎంతో ఇష్టమయిన నాటకాభినయం విడిచివేస్తున్నందుకు కొంచెం కించ కలగకపోలేదు.

(సశేషం)

అనివార్య కారణాలవల్ల ఈ సంచికలో "తిరస్కృతి" సీరియల్‌ను ప్రచురించ లేక పోతున్నందుకు చింతిస్తున్నాము.

సం. ఆం. ప్ర.




## వీచికలు

(కవితా సంకలనం)

ప్రచురణ: యువభారతి

ప్రాప్తిస్థానం: యువభారతి, 5, కింగ్స్‌వే, సికింద్రాబాదు

మూల్యం : ఒక రూపాయి.

"మేము సైతం వచన కవితకు
రచన నొక్కటి ధారవోశామం"టూ

నలుగురు నవీన వచన కవితా రచయితల 34 ఖండికల సంపుటి యిది. 'యువ భారతి' సాహితీ సంస్థ ఐదవ వార్షికోత్సవ సందర్భమున వెలువరించిన సమితి మూడో ప్రచురణం.

ఇందులోని నలుగురు కవులు : శ్రీయుతులు ఇరివెంటి కృష్ణమూర్తి, చక్రవర్తి వేణుగోపాల్, అల్లంరాజు వెంకట్రావు, వంగపల్లి విశ్వనాథంగారలు.

మొదటి రచయిత శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి. "ఆయనొకడున్నాడు", "దీపిక", "నేను మనగల్గితివి", "నీవు చూడలేవు", "గతాన్ని నమ్మకు", "బ్రాహ్మీమయమూర్తి" — అనే ఆరు రచనలున్నాయి వీరివి. ఇందులో మొదటి రచన చివరి రచన పరస్పర విరుద్ధ భావాల ప్రతిబింబాలు ఈ రెండు కవితలు.

"నీవు చూడలేవు" అన్న ఖండికలో ఒకచోట

"సరస్సులు చాందినీలు పరచి
తెల్ల బావుటాలు నెగురవేసినవి".

అంటూ చక్కటి కవిత్వం వ్రాసి తన ప్రతిభ చాటుకున్నాడు ఈ కవి.

రెండవ రచయిత శ్రీ చక్రవర్తి వేణుగోపాల్. ఇందులో ముఖ్యంగాచెప్పుకోదగ్గవి "శీర్షిక", "కర్తవ్యం", "స్వోపశమనం" ఖండికలు. ఈ కవిలో తాత్వికవాద సూచనలు బాగాకన్పిస్తున్నాయి.

ఈయన శైలిగూడ గ్రాంథిక భాష వాసనలను పోగొట్టుకోలేదు.

ఉదాహరణకు "నాగరికత" అన్న కవితలో

"తరంగచుంబిలో నభోగంగా ముఖాంభోజమై" అనీ,

మరోచోట

"ప్రగాఢ ప్రజ్వలితౌజ్వల్య ప్రఘూర్ణ ప్రచండ పరిస్ఫోటన ప్రాణాపాయ పరికరాలు సృజించి" మొదలైన దీర్ఘ సమాసాలను వాడారు.

మూడవ రచయిత శ్రీ అల్లంరాజు వెంకట్రావు. ఈ సంకలనం మొత్తంమీద పఠితల హృదయాలలో లోతైన ఆలోచనలను రేకెత్తించే ఖండికలు యెక్కువగా ఈ కవివేనని నిస్సందేహంగా చెప్పవచ్చు.

"కనీస కోర్కెలు", "నిరాశావాదం", "నేనేం వ్రాసేది ?" "దాగుడుమూతలు" ఖండికలు చక్కని భావావేశము, భాషా సంపదా కలిగివున్నాయి.

నాలుగవ రచయిత శ్రీ వంగపల్లి విశ్వనాథం. వీరివి మొత్తంఏడు ఖండికలున్నాయి. ఇందులో "మట్టి కణం", "ప్రేమ-పగ", "నానీడ" అను రచనలు కవికి సమాజంమీద కలిగిన ఏవగింపును ప్రతి ధ్వనింపజేస్తూ, చక్కని భావ పటిమను కలిగి వున్నాయి.

"మనవి మాటలు"లో సంపాదకవర్గం వారు వెలిబుచ్చినట్లు ఈ నలుగురిలోనూ కవిత్వానికి కావలసిన "వూహించే మేథ" స్పందించగల హృదయాలతోబాటు రాటుదేరిన కలంగూడ ఉందని చెప్పవచ్చు.

మొత్తంమీద శ్రీ కుందుర్తి అన్నట్లు వచన కవితా ప్రక్రియ ఒక ఉద్యమంగా ప్రాకింది. శ్రీ శ్రీ ప్రభృతులతో మొదలైన ఈ ఉద్యమం తెలుగుదేశం నలుదిశలా ప్రాకి, ప్రతి యువ రచయితనూ ఆకర్షిస్తున్నదనడానికి, నేడు విరివిగా వెలువడుతున్న వచన కవితలు, కవితా సంపుటాలే తార్కాణం. ఈ ఉద్యమానికి "యువభారతి" సమర్పించిన కానుక "వీచికలు". అందరూ చదివి ఆనందించాల్సిన పుస్తకం.

—గుత్తికొండ సుబ్బారావు

## స్తంభాద్రి (ఖమ్మం) చరిత్ర

రచయిత : శ్రీ ముదమసింహం సత్యనారాయణాచార్య,
శాంతినగరు, ఖమ్మంకు వ్రాయండి.

ప్రతులకు : రచయిత పేర

పేజీలు : 118 వెల : రు. 4—50

ఆంధ్రప్రదేశ్‌లోని జిల్లాలలో ఇప్పటివరకు వయసులో పిన్న ఖమ్మం జిల్లా. అట్టి ఖమ్మం చరిత్రను సమగ్రంగా పుస్తక రూపంలో అందించడానికి రచయిత సంవత్సరాల తరబడిగా చేసిన విశేష కృషి, పరిశోధనలను, ఈ గ్రంథం ప్రతిబింబిస్తున్నది శ్రీ కొమరగిరి సుందరరావు గారు తమ పరిచయ వాక్యాలలో చెప్పినట్లు 'ఈ రోజు వరకు ఖమ్మం చరిత్రను తెనుపుటకు ప్రయత్నము చేసినవారిలో యీ రచయితయే అగ్రగణ్యుడని చెప్పుకొనుటలో ఏ మాత్రము అతిశయోక్తి లేదు'.

పుస్తకం చిన్నదయినా యిందు వివరించబడిన విషయాలు అనేకం. ఖమ్మం పట్టణ చరిత్ర, ఈ కృతి భర్త అయిన స్తంభాద్రి నృసింహుని ఆలయచరిత్ర మొదలైన అంశాలతోపాటు

జిల్లాలోని అనేక క్షేత్రాల స్థల పురాణాలుకూడ యిందులో యివ్వబడినవి. హరిభట్టు, రామదాసు మొదలైన మహనీయుల చరిత్రలు యిందు వర్ణించబడినవి. ఇంతేకాక, ఈ జిల్లాలో నివసించే కొండజాతులు, వారి ఆచార వ్యవహారాలు, ఈ ప్రాంతాలలో కనుగొనబడిన చరిత్ర, పూర్వ యుగానికిచెందిన సమాధులు, నీటి పారుదపా జెక్టులు, బొగ్గు గనులు, భూ సంస్కరణలు అమలు జరిగిన తీరు మొదలైన అనేక విషయాలు ఇందు ప్రస్తావించబడినవి.

రచయిత కృషి, పరిశోధన ఎక్కువగా సాహిత్యపరంగా ఉన్నట్లు కన్పిస్తున్నది. నిజాం ప్రభుత్వం 19 వ శతాబ్ది అంతంలో తయారు చేయించిన సర్వే రిపోర్టులు, పురాతత్వ శాఖవారు ప్రచురించిన నివేదికలు మొదలైన చారిత్రికాధారాలు రచయిత దృష్టిని ఆకర్షించకపోవడం దురదృష్టం. అనేక విషయాలను సమగ్రంగా వివరించాలన్న తొందరలో రచయిత విషయక్రమాన్ని సరిగా పాటించినట్లు కన్పించదు. చెప్పిన విషయాన్నే పదే పదే చెప్పడం కూడ కన్పిస్తుంది. (ఉదా : రామదాసు చరిత్ర, భద్రాది రాముల విగ్రహాలను పోలవరంలో దాచిపెట్టిన సంఘటన) ఈ గ్రంథంలో చోటు చేసుకొనదగిన ముఖ్య విషయాలలో జమలాపుర క్షేత్ర ప్రాశస్త్యం, దాలి గూడెలోని కేదారేశ్వర ఆలయం (శివుడు లింగాకారంలోకాకుండా చతుర్బాహువులతో కేదారేశ్వరమూర్తి ధరించి ఉండటం యిచటి విశేషం), శబరి నదిని గురించిన ప్రస్తావన. ఈ జిల్లాలో జాతీయోద్యమం మొదలైనవి పేర్కొనదగినవి. ఇటువంటి పరిశోధక గ్రంథాల చివర - జిజ్ఞాసువులు చూడదగిన యితర గ్రంథాల పట్టిక (Select Biliography). ముఖ్య పద అకారాది పట్టిక (Inder) చేర్చడం అవసరం. ఇంకా ఎక్కువ వివరాలతో జిల్లా పటాన్నికూడ ఇస్తే బాగుండేది. రెండవ కూర్పులో రచయితయిట్టి విషయాలను గురించి శ్రద్ధ చూపగలరని ఆశించవచ్చు.

మొత్తంమీద ఖమ్మం చరిత్రపై సమగ్రమైన గ్రంథం లేని లోటును తీర్చినందులకు రచయిత అభినందనీయుడు.

—'బిపిన్'

# నిరీక్షణ

ఉప్పాడ ధర్మారావు

ఆరని అంతర్గత దావాగ్ని జ్వాలలు
నిలువునా దహించి వేస్తున్నా,
నా కనుల ముందు 'చంద్ర దీపం' వెలిగి
వెన్నెల సెలయేళ్లు పొంగాలని,
అహర్నిశలు అభిలషిస్తున్నాను.
ప్రేమపూరితమైన కన్నీటి చుక్కకోసం
దాహంతో పరితపిస్తున్నాను.
కరుణవర్షం కోసం
కాచుక్కూర్చున్నాను.
జాలి చల్లగాలి కోసం
జాగరణ చేస్తున్నాను.
అందరి హృదయాల స్పందననుండి
బయల్దేరే ఒక కాంతి తరంగం కోసం
నిరీక్షిస్తున్నాను.
బీళ్ళయిన హృదయాలలో
సౌభ్రాతృత్వాన్నీ, సౌహార్ద్రితనీ
సస్యశ్యామలంగా పండించాలని—
మమతనూ, మానవతనూ కూడబెట్టే
వివేకిగా జాతి జీవించాలని
మనసారా వాంఛిస్తున్నాను.
ఆ ఆశతోనే జీవిస్తున్నాను.

# కాగితం బంగారం

--వావిలాల గోపాలకృష్ణయ్య

క్రాకి బంగారం కాదు కాగితం బంగారం అంతర్జాతీయ ద్రవ్యమానం అయిపోయింది. 1969 అక్టోబరు 1 వ తేదీ అంతర్జాతీయ బ్యాంకి వాషింగ్టన్‌లో సమావేశమై అంతర్జాతీయ ద్రవ్యంగా చలామణి అవుతున్న బంగారం బదులు కాగితం బంగారంను యేర్పాటుచేశారు. అంటే స్పెషల్ డ్రాయింగు రైట్సు '(యస్. డి. ఆర్.)ను నిర్ణయించారు. అంటే ఎవరెవరి తరపున యేయే దేశాలు ఎంతెంతనిధులు వుంచుకుంటాయో ఆ అంతర్జాతీయ బ్యాంకులో దానికి తగినట్లు మాత్రమే ఆ యా దేశాలు వివిధ దేశాలతో వ్యాపారం చేసి వాడుకోవాలి. ఇదివరకు యే దేశానికి ఆ దేశం తన తాహతుకు తగ్గట్టు వివిధ దేశాలతో తమకున్న గౌరవం, పలుకుబడి, అవకాశాలను బట్టి ఎగుమతి దిగుమతులు చేసుకుంటూ బంగారాన్ని_లేక మార్పిడి చేసుకో అవకాశంవుండేది.

పలుకుబడిగల పది దేశాలు తమ యిచ్ఛ వచ్చినట్లు ఆధిపత్యం గలిగివుంటాయి. వివిధ దేశాల 950 కోట్ల డాలర్ల పరపతి వివిధ దేశాలకు వాటాల ప్రకారం పంచటానికి నిర్ణయం తీసుకున్నారు. ఇదివరకు మాదిరి బంగారం మీదకాక పరస్పర సహకారం మీద ఆధారపడింది. ఈ పరపతి_చలామణి అని కూడ నిర్ణయించారు. ఈ 950 కోట్ల డాలర్ల కాగితాలో 350 కోట్ల డాలర్ల పరతి 1970 జనవరి నుండి అమలుకు వస్తుంది. అల్లే 1971 జనవరికి 1972 జనవరికి ప్రతి సంవత్సరం 300 కోట్ల డాలర్లు సమకూర్చుకొని 1972 నుండి 950 కోట్ల డాలర్ల పరపతిని అమలు జరుపుతారు.

ఈ నాడు ఔన్సు బంగారం 35 డాలర్ల విలువవుంది సెంట్రల్ బ్యాంకులన్నీ మారకపు ధరకు ఔన్సును 35 డాలర్లు నిర్ణయించుతూ వ్యాపార విషయంలో కాని మరి యితర వాటిని బంగారం ఔన్సు 41 డాలర్లుగానిర్ణయించడానికీకూడా నిశ్చయించారు.

ఈ నిర్ణయం కాగానే ఇంగ్లాండు ఆర్థికమంత్రి రేజన్‌కిన్స్ తమ దేశం రెండు సంవత్సరాల క్రితం చలామణిలో అవస్థలు పడి పౌండ్ రేటు తగ్గించుకొని బయటపడికూడా ఈ సంవత్సరం యిప్పటికి 20 కోట్ల స్టర్లింగులు తిరిగి ఋణాలు చెల్లించినదని, యీ పద్ధతివల్ల తమకు 45 కోట్ల స్టర్లింగులు మిగులు ఉంటుందని చెప్పారు. నాలుగు రోజులలో స్టెర్లింగ్ 31 పాయింట్లు పుంజుకుంది. పశ్చిమ జర్మనీ ఎన్నికలకు పోతున్న బ్యాంకు లావాదేవీలు మూసివేసిన వారములో_ అంటే 1969 సెప్టెంబరు 27 నాటికి ఫ్రాన్సు సెంట్రల్ బ్యాంకి 6.27 కోట్లడాలర్లు నష్టపడినదని, ఆగస్టు 8 న తమ ఫ్రాంక్ విలువ తగ్గించిన వారములో 3.6 కోట్ల డాలర్లు నష్టపడిందని ఫ్రెంచి అధికారులు చెప్పారు. ఇప్పుడు దీనితో బయటపడవచ్చు. ఫ్రెంచి ప్రభుత్వము ఇదివరలో (సి. ఆర్. యు) కలెక్టివ్ రిజర్వు యూనిట్లు కావలెనన్నది. అంటే అందరిదీ కలుపుకొని విల్వలు అవుతవి. జర్మనీ తన మార్కు_కు విలువ 2 3 డాలర్లనుండి 4.2 డాలర్లకు పెంచినద్ది. అన్ని దేశాలు ఇండియా, ఇంగ్లాండు, ఫ్రాన్సుతో సహా విలువలు తగ్గించుకుంటుంటే, అమెరికా వత్తిడి ఫలితంగా పశ్చిమ జర్మనీ డి మార్కు_ విలువను పెంచడం జరిగింది. అందుచే జర్మనీ దేశంలో అమెరికా నుండి వస్తువులు అదే పనిగా దిగుమతులు అవుతున్నవి. అమెరికా వస్తువులు అమ్ముడు పోవడానికి, అమెరికా తన వస్తువులతో జర్మనీ మార్కెటును ముంచివేయటానికి మంచి అవకాశం లభించింది. జర్మనీ పరిశ్రమలు అమెరికా పోటీకి నిలువగలగాలి, లేకపోతే దెబ్బతింటుంది. ఇదే మొన్నటి జర్మనీ ఎన్నికలలో అమెరికా జోక్యం కలిగించుకొని సాధించింది. ఇది నిజంగా అమెరికా ఆర్థికవేత్తల ఘనవిజయం.

జర్మనీ ఎన్నికలలో వుండి నూతన ప్రభుత్వ నిర్మాణములో ఉన్నందున 'డి మార్కు_ను యేమిచేయాలా అని ఇంకా తటపటాయింపులో వుంది. యీ జర్మనీ 'డి' మార్కు_ అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్స్‌ల చలామణి విధానాన్ని 3 సంవత్సరాలనుండి అల్లడి తల్లడి చేస్తున్నది. దానిపై పైచేయి అయి యీ నిర్ణయానికి రావడం జరిగిందని తెలిపోతున్నది.

అభివృద్ధి అయిన దేశాల చేతుల్లోకి అంతర్జాతీయ బ్యాంకి ఎటూ యిదివరకన్నా అధికంగా పోయింది. ఈ విషయం రెండు సంవత్సరాల క్రితం చర్చించినప్పుడు వెనకబడిన దేశాల భవిష్యత్తు భయంకరంగా ఉంటుందని అభాండం వేసి వాయిదా వేయించ గలిగారు. తరువాత మరల రియోడిజనీరాలో సమావేశమై యీ కాగితం బంగారం వాటాలు యీ క్రింది విధముగా నిశ్చయించారు. సంవత్సరానికి 100 కోట్ల డాలర్లు సమకూర్చడానికి, 200 కోట్ల డాలర్లు సమకూర్చడానికి అంటూ రెండు విధాలుగా ఆయా దేశాలు చెల్లించవలసిన ధనం కోట్ల డాలర్లు నిర్ణయించారు.

వార్షిక కోటా

| | సంవత్సరానికి 100 కోట్ల డాలర్లు. | సంవత్సరానికి 200 కోట్ల డాలర్లు. |
|---|---|---|
| అమెరికా | 24.6 | 49.2 |
| బ్రిటన్ | 11.6 | 23.2 |
| పశ్చిమ జర్మనీ | 5.7 | 11.4 |
| ఫ్రాన్స్ | 4.7 | 9.4 |
| ఇండియా | 3.6 | 7.2 |
| జపాన్ | 3.5 | 7.0 |
| కెనడా | 3.5 | 7.0 |
| ఇటలీ | 3 0 | 6 0 |
| నెదర్లాండ్ | 2.5 | 5.0 |
| ఆస్ట్రేలియా | 2.4 | 4.8 |
| బెల్జియం | 2.0 | 4.0 |
| స్వీడన్ | 1.0 | 2.0 |
| ఇతర దేశాలు | 31.9 | 63.8 |
| | 100.0 | 200.0 |

ఈ నిర్ణయం ప్రకారం తమ ధనం ఎంత ఉందో విదేశ మారకం ద్రవ్యం అంతకన్న వాడుకోరాదు. ఈ నిర్ణయం చేసిన నాటికి ఆయా పశ్చిమ దేశాల్లో ఉన్న బంగారం నిల్వలు యివి :—

| | కోట్ల డాలర్లు విలువ | | |
|---|---|---|---|
| | అక్టోబరు 31, 1967 | జనవరి 31, 1968 | తేడా |
| అమెరికా | 1304.0 | 1200 0 | 104.0 |
| బ్రిటన్ | 183 1 | 129.2 | 53.9 |
| పశ్చిమ జర్మనీ | 428.1 | 414.0 | 14.1 |
| ఇటలీ | 239 8 | 236.4 | 3.4 |
| బెల్జియం | 151.2 | 146.0 | 5.4 |
| నెదర్లాండ్ | 173.1 | 168 2 | 4.9 |
| స్విట్జర్లాండ్ | 284.0 | 297.6 | 13 8 |
| మొత్తం | 2763.3 | 2591.6 | 171 7 |

ఈ దేశాలలో వారి వద్ద ఉన్న నిల్వలు, ఆస్థులు ఈ క్రింది విధముగా ఉన్నవి.

| | నిల్వలు | కోట్ల డాలర్లు | |
|---|---|---|---|
| | 1959 | 1965 | 1969 మొదలు |
| బంగారం | 37.90 | 41.00 | 38.90 |
| విదేశీ నిధులు | 16.60 | 23.20 | 31.00 |
| అంతర్జాతీయ బ్యాంకులలో నిల్వలు | 3.80 | 5.40 | 6 50 |
| మొత్తం | 58.30 | 69.60 | 76.40 |

ఇంతవరకు 1968 వరకు నిర్ణయించిన వాటాలు గమనించ గలిగితిమి. ఇప్పుడు 1969 అక్టోబరులో ఈ సమావేశం నిర్ణయించిన వాటాలు ఈ క్రింది విధంగా వున్నవి.

**అంతర్జాతీయ ద్రవ్యనిధి కోటాలు**

| | కోట్ల డాలర్లు | |
|---|---|---|
| దేశం | ఇంతవరకు | 1967కు |
| అమెరికా | 516 0 | 670.0 |
| బ్రిటను | 244.0 | 305.0 |
| జర్మనీ (ప) | 120 0 | 165.0 |
| ఫ్రాన్సు | 98 5 | 150 0 |
| కెనడా | 74.0 | 110 0 |
| జపాన్ | 72.5 | 120.0 |
| ఇటలీ | 62.5 | 100.0 |
| ఇతర పారిశ్రామిక దేశాలు ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ స్పెయిన్ వగైరా | 167.2 | ? |
| అభివృద్ధి దేశాలు | 176.0 | ? |
| ఇండియా | 75 0 | ? |
| ఇతర బడుగు దేశాలు | 520.6 | ? |
| మొత్తం | 2126.4 | 2860.0 |

ఈ నిర్ణయాలను అమలు జరుపుటకు ఆయా దేశాలు ద్రవ్యనిధి శాసనాలు సవరించవలసివుంది. మన లోక్‌సభలో 1969లో 79వ బిల్లు క్రింద 23 ఆగస్టు 1969న ప్రతిపాదించారు. 1945లో లోక్‌సభ అంతర్జాతీయ ద్రవ్యనిధి శాసనంలో 2వ సెక్షనులో భారత' దేశపు సంచిక నిధి నుండి' అన్నదానికి బదులు పార్లమెంటు శాసనం నుండి నిర్దేశించిన విధంగా భారత దేశపు సంచిక నిధి నుండి చెల్లించవలసినవిగా మార్చారు. అంతేకాకుండా అదనంగా (ఎ) సెక్షను నుంచి అంతర్జాతీయ ద్రవ్యనిధి బ్యాంకులలో ఆసలు నుండి గాని దాని అనుబంధము నుండి-గాని కేంద్ర ప్రభుత్వం వరకును స్పెషల్ డ్రాయింగ్ హక్కులు కాగితం బంగారం నిర్వహించుట, మార్చుట, వాడుట, సంపాదించుట, ఉంచుకొనుట రిజర్వు బ్యాంకు చేయవలెనని అధికారం యివ్వదలచారు.

ఈ నిర్ణయించబడిన దేశాల స్థితి స్థిరంగా బడుగు దేశాలుగాను వుండిపోవడం జరుగుతుంది ఇదివరకు భారత దేశానికి ప్రపంచ బ్యాంకు కార్యవర్గంలో ఒక స్థానం వుంది. దీనితో అది పోతున్నది. ఢిల్లీలో ప్రపంచ ఆర్థిక సమావేశం జరిగినప్పుడు సంపన్న దేశాలు తమ ఆదాయంలో కనీసం ఒక్క వంతు అయినా సహాయం చేయడంలేదని ఋజువు అయింది. ఈ మహాసభనివేదిక సమర్పించినప్పుడు, అమెరికాలో అప్పటి మన వ్యాపారాభివృద్ధి మంత్రి దినేశ్‌సింగ్ ఇది చాలా అన్యాయం అని కూడా చెప్పారు. జైశుకాల్‌హథీ ప్రపంచ కార్మిక మహాసభకు క్రిందటి సంవత్సరం వెళ్ళినప్పుడు బడుగు దేశాల అభివృద్ధికన్న సంపన్న దేశాలు ప్రపంచ సంస్థలను కైవశం చేసుకొనే ప్రయత్నాలే అధికంగా ఉన్నవన్నారు. ఈ నిర్ణయంలో ప్రపంచ బ్యాంకికి అన్ని దేశాల ద్రవ్య స్థితిపై, వ్యాపార స్థితిపై ఫలితంగా రాజకీయాధికారం హస్తగతం అయిపోయింది. *

# కన్నుల పండువుగా జరిగిన యాత్రా వారోత్సవాలు



జనవరి 16న ఫతేమైదానంలో యాత్రా వారోత్సవాలకు ప్రారంభోత్సవం చేస్తున్న భారత దేశంలో అమెరికన్ రాయబారి కెన్నెత్ బి. కీటింగ్

రాష్ట్రంతో పర్యటనను అభివృద్ధి పరచే నిమిత్తం జనవరి 16 నుంచి ఒక వారం రోజులపాటు యాత్రా వారోత్సవాలను ప్రభుత్వం జరిపించింది. భారత దేశంలో అమెరికా రాయబారి కెన్నెత్ కీటింగ్ ఈ యాత్రా వారోత్సవాలకు జనవరి 16వ తేదీన హైదరాబాదులో ప్రారంభోత్సవం చేశారు. ప్రారంభోత్సవ సందర్భంగా ఏర్పాటైన సమావేశానికి రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ అధ్యక్షత వహించారు. ఈ సందర్భంలో అమెరికా రాయబారి మాట్లాడుతూ, భారత దేశం కన్న ఎంతో తక్కువగా ప్రకృతి సౌందర్యంగల దేశాలు అనేకం యీనాడు విదేశీ పర్యాటకుల ద్వారా కోట్లాది రూపాయల విదేశీ మారకాన్ని సంపాదించుకుంటున్నాయని అన్నారు. "భారత దేశంలో అత్యంత సుందర సీమలు అపారంగా వున్నాయి. పురాతన చారిత్రిక నిర్మాణాలు అసంఖ్యాకంగా వున్నాయి. ఆప్యాయాదరణలను కురిపించే ప్రజలు వున్నారు. వీటన్నిటి దృష్ట్యా భారత దేశం ముందు ముందు ప్రపంచప్రసిద్ధ యాత్రా కేంద్రం కాగలద"న్న ఆశాభావాన్ని అమెరికా రాయబారి వ్యక్తపరిచారు.



యాత్రా వారోత్సవాల సందర్భంగా హైదరాబాదునించి మహారాష్ట్రలోని ఔరంగాబాదులోగల బీబీకా మక్‌బరాకు వినోదయాత్రకై వెళ్ళిన ఒక పర్యాటకుల బృందం

జాతీయ, అంతర్జాతీయ యాత్రాపర్యటనల వల్ల వివిధ ప్రాంతాల ప్రజల హృదయాలు మరింతగా సన్నిహితమవుతాయనీ, వివిధప్రజల మధ్య మరింతగా అవగాహన ఏర్పడుతుందనీ, అంతర్జాతీయ అవగాహనకు దీని వల్ల ఒక మార్గం ఏర్పడుతుందనీ రాష్ట్ర గవర్నరు తమ అధ్యక్షోపన్యాసంలో తెలియ జేశారు.



ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్‌కు హైదరాబాదులో రాష్ట్ర గవర్నరు 1969 సం.పు సమైక్యతా బహుమతిని అందజేస్తున్న దృశ్యం

ముందుగా, యాత్రావిషయాల మంత్రి శ్రీమతి రోడామిస్త్రీ సభికులకు స్వాగతం పలికారు. పర్యటనలను అభివృద్ధి చేసే విషయంలో ప్రజల వద్దనుంచి అంతగా సహకారం రావడం లేదనీ, ప్రభుత్వం ఒకటే ఈ పని చేయలేదనీ, యాత్రలు పర్యటనలనేవాటి అభివృద్ధి అందరి సహకారంతోనూ జరగవలసిన పని అనీ శ్రీమతి రోడా మిస్త్రీ అన్నారు. సమాచార, పౌరసంబంధ, యాత్రిక శాఖ డైరెక్టరు వందన సమర్పణచేశారు.

ఈ యాత్రా వారోత్సవాలలో కాంతి, శబ్ద చిత్ర కార్యక్రమం, వింటేజ్ కార్ల వూరేగింపు, రవీంద్ర భారతిలో సాంస్కృతిక కార్యక్రమాలు ప్రధానంగా చెప్పుకోదగ్గవి.

బంగ్రానృత్యం, బంజారానృత్యం ప్రదర్శనలతో ఆనాటి కార్యక్రమం ముగిసింది. సైన్యానికి, పోలీసుకు చెందిన అశ్వికుల గుర్రపు స్వారీ ప్రదర్శన, మోటారు సైకిల్ ఫీట్సు కూడా యీ సందర్భంలో జరిగాయి.

ప్రారంభోత్సవ కార్యక్రమంలో ప్రత్యేకంగా చెప్పుకోదగిన అంశం ఈ ఉత్సవానికి విదేశీ దౌత్యవర్గ ప్రముఖులు అనేకులు హాజరుకావడం. ఆనాటి ప్రదర్శనా కార్యక్రమంలో పాల్గొన్న కళాకారులకు, అశ్వికులకు కేంద్ర యాత్రా విషయాల ఉపమంత్రి శ్రీమతి సరోజినీ మహిషి, ప్రశంసాచిహ్నాలను బహూకరించారు.



ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ ఇటీవల హైదరాబాదు వచ్చినపుడు వనితామహా విద్యాలయానికి శంకుస్థాపన చేశారు

జనవరి 17న గోలుకొండ కోటలో ప్రత్యేక ఆహ్వానితుల సమక్షంలో కాంతి, శబ్ద ఛాయా కార్యక్రమంలో గోలుకొండ వైభవాన్ని చూపించడం జరిగింది. దీనిని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి ప్రారంభించారు.

జనవరి 18వ తేదీన కోకాకోలా కంపెనీ వారు వింటేజ్ కార్ల ఊరేగింపును ఒకదానిని ఏర్పాటు చేశారు. ఆ రాత్రి అనేక సాంస్కృతిక కార్యక్రమాలతో బాటు టేంక్ బండ్ వద్ద బాణా సంచాను కాల్పించడం కూడా జరిగింది. రవీంద్ర భారతిలో ఆరోజు కన్నుల పండువుగా సాంస్కృతిక కార్యక్రమం జరిగింది. ఆ మరుసటి రెండు రోజులలో కూడా రవీంద్రభారతిలో సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి.



డిశంబరు 31వ తేదీన, 10వ ఆంధ్రప్రదేశ్ సంక్షేమనిధికి సంబంధించిన లాటరీ టిక్కెట్లను తీస్తున్న ముఖ్యమంత్రి

## ఇందిరా సేవా సదనంలో భోజన గృహానికి ప్రారంభోత్సవం

కేంద్ర పారిశ్రామికాభివృద్ధి మంత్రి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్, ఇందిరా సేవా సదనంలో భోజన గృహానికి జనవరి 5 వ ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో ఆయన మాట్లాడుతూ ఈ సేవా సదనం చేస్తున్న కృషికి తాను ముగ్ధుడనయ్యానని పేర్కొన్నారు. దిక్కులేని వారిని మిత్తం యీ సదనాన్ని నడు



జాతీయ పొదుపుసంస్థ రాష్ట్ర సలహామండలి ఉపాధ్యక్షుడు శ్రీ ఎన్. టి. రామారావు; ఎ.పి.ఎస్.ఆర్.టి.సి. సిబ్బంది ప్రావిడెంట్ ఫండ్‌నుంచి మదుపుపెట్టిన 6 లక్షలకూ జాతీయరక్షణ సర్టిఫికెట్లను ఎ. పి. ఎస్. ఆర్. టి.సి అకౌంట్సు ఆఫీసర్‌కు అందజేస్తున్న దృశ్యం



ఇందిరా సేవా సదనంలో భోజనగృహానికి ప్రారంభోత్సవం చేస్తున్న కేంద్ర పారిశ్రామికాభివృద్ధి మంత్రి శ్రీ ఫకృద్దీన్ అలీ అహమ్మద్



డిశంబరు 30న తెలుగుభూమి జాతీయ వారపత్రికను ఆవిష్కరించిన అనంతరం ప్రసంగిస్తున్న సమాచార, పౌరసంబంధ శాఖమంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావు

పుతూ నిస్వార్థ సేవతో, నిరంతరంగా పాటు పడుతున్నందుకు శ్రీమతి సంగం లక్ష్మీబాయిని మంత్రి అభినందించారు. ఇతర కార్యక్రమాలతో పాటు యీ విధమైన సాంఘిక సేవా కార్యక్రమాలను మన గ్రామాలలోనూ, పట్టణ ప్రాంతాలలోనూ ఏర్పాటు చేయవలసిన అవసరాన్ని గూర్చి మంత్రి పేర్కొన్నారు. ఇటువంటి వాటిని నిర్వహించేందుకు ప్రభుత్వమూ, దాన శీలురూ, సంస్థలూ ముందుకు రావాలని అన్నారు. ఈ ప్రారంభోత్సవానికి కేంద్ర న్యాయ శాఖ ఉప మంత్రి శ్రీ యూనుస్ సలీం కూడా హాజరయ్యారు.

---

( 10వ పుటనుండి )

స్వాతంత్ర్యం వున్నాయి. ప్రత్యేక తెలంగాణాను కోరుతున్న మిత్రులు తమ ఆందోళనను శాంతియుత పద్ధతిలో కొనసాగించవచ్చు కాని వారు తమ ఈ వాదాన్ని యితరులమీద బలవంతంగా రుద్దరాదు. దుకాణంమీద రాయి విసిరినప్పుడు దుకాణదారుడు కూడా ప్రతి చర్యకు పూనుకున్నప్పుడు తప్పనిసరిగా ఘర్షణలు, హింసా చర్యలు జరుగుతాయి, ఇటువంటి వాటిని అనుమతించరాదు.

## ఆర్థికాభివృద్ధిపట్ల దృష్టిని కేంద్రీకరించాలి

ప్రత్యేక రాష్ట్రం కావాలనుకున్నప్పుడు ఆందోళన చేయవలసిన పద్ధతి యిదా? ఒక సందర్భంలో మన ముఖ్యమంత్రి పేర్కొన్నట్లు ఆయన భారతదేశ మంతటికోసం "శిలువ"ను పట్టుకొని వున్నారు. బొంబాయికి చెందిన ఒక ప్రముఖ వార్తా పత్రికలో ఈ భావాన్ని ప్రదర్శించే ఒక చక్కటి వ్యంగ్యచిత్రాన్ని ప్రచురించారు. ఫజల్ అలీ కమీషను ప్రత్యేక విదర్భ రాష్ట్రానికి కూడా ఒప్పుకున్నది కాబట్టి తెలంగాణా రాష్ట్రాన్ని యివ్వడానికి పూర్వం విదర్భనుకూడా యివ్వవలసి వుంటుంది. తరువాత పాత మైసూరు రాష్ట్రం మొదలైనవాటి సంగతి కూడా వస్తుంది. భారత దేశాన్నంతటినీ విభాగించాలంటే 50 వరకు చిన్న రాష్ట్రాలు ఏర్పడవచ్చు. అందుకు నాకు అభ్యంతరమేమీలేదు; నాకు వచ్చిన నష్టమేమీలేదు. ఆందోళనవల్ల చెలరేగిన హింసను గురించీ, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు కలిగిన అవరోధాన్ని గురించీ నేను బాధపడుతున్నాను. ఇప్పుడు మనం ఆర్థిక పురోభివృద్ధిపట్ల దృష్టిని కేంద్రీకరించాలి. మన ప్రణాళికను గురించీ, అనేక యితర విషయాలను గురించీ ఆలోచించాలి.

రాజకీయాలలో ఆసక్తి వున్న మిత్రులు తమ కార్యకలాపాలను అహింసామార్గంలో సాగించుకొననివ్వండి గాంధీ శత జయంతి సంవత్సరంలో యింతటి హింసాచర్యలకు పూనుకోవడం శోచనీయం. ఎవరి ఇంటిమీదికైనా బాంబు విసరడానికి ప్రయత్నించినప్పుడు ఆ యింటి యజమాని అక్కడ వున్నట్లయితే కాల్పులు ప్రారంభిస్తాడు. కనుక నిందించవలసింది ప్రభుత్వాన్ని కానీ, పోలీసువారిని కానీ కాదు. ఇటువంటి తీవ్ర ఉద్రిక్త పరిస్థితిని సృష్టించిన వారిని మాత్రమే నిందించవలసివుంది. శాంతికాముకులైన మన పౌరులను రక్షించవలసిన బాధ్యత మనకు వుంది. మీకు నష్టం జరిగితే రాష్ట్రానికి జరిగినట్టే. తెలంగాణాకు నష్టం జరిగినట్లే. ఈ నష్టాలవల్ల ఆంధ్రకేమీ చెడు జరుగదు. మనతెలంగాణా మిత్రులు తెలంగాణాకే నష్టం కలిగిస్తున్నారు మనం అనేక కోట్ల రూపాయలను నష్టపోయాము. మన పిల్లలు విద్యను కోల్పోయారు.

ప్రజాస్వామిక విధానంలో చిన్న రాష్ట్రాల వాదానికి బలాన్ని సంపాదించుకొనదలిస్తే అలా నిరభ్యంతరంగా చేయవచ్చు. ఇందుకొరకు పార్లమెంటులో శాసనాన్ని ఆమోదింపజేసుకోవచ్చు. ఎవరూ అడ్డుపెట్టరు. 1972లో మమ్ములను అధికారంలో నుంచి తొలగించదలిస్తే అది చేయవచ్చు. అధికారం ఎవ్వరి గుత్తాధికారం కాదు. మేము ఎల్లప్పుడూ అధికారంలో వుండడానికి రాలేదు ప్రజాస్వామ్యంలో అనుసరించాల్సిన విధానమంటూ ఒకటివుంది. కార్యసాధన మార్గం వుంది. మనం నిజమైన ప్రజాస్వామిక దృక్పథాన్ని అలవర్చుకున్నప్పుడే మన ప్రజాస్వామ్యం కలకాలం వర్ధిల్లుతుంది.

[ 1969 ఆగష్టు 22వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వాణిజ్య, పరిశ్రమల మండలుల ఫెడరేషన్ సమావేశంలో చేసిన ప్రసంగం ఆధారంగా ]

# జిల్లాలనుంచి

## ఎంగొండలో మహిళామండలికి శంకుస్థాపన

రెవిన్యూ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి, డిసెంబరు 21వ తేదీన మహబూబ్ నగర్ జిల్లా ఎంగొండలో జయలక్ష్మి మహిళా మండలి భవన నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. నీటిపారుదలశాఖా మంత్రి, శ్రీ ఎన్. సిద్దారెడ్డి అధ్యక్షత వహించారు.

శ్రీ తిమ్మారెడ్డి ప్రసంగిస్తూ బాలలు ఉత్తమ పౌరులుగా రూపొంది, బాధ్యతలను స్వీకరించడానికి వీలుగా శ్రద్ధాసక్తులతో బాలలను పెంచాలని అన్నారు.

జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ కె.కె. రెడ్డి ప్రసంగిస్తూ పంచాయతీ రాజ్ సంస్థలు ఎదుర్కొంటున్న వివిధ సమస్యలను గూర్చి వివరించారు.

మహిళా సంక్షేమశాఖా డైరెక్టరు, శ్రీమతి శ్రీరాజ్యం సిన్హా ప్రసంగిస్తూ రాష్ట్రంలో మహిళల, పిల్లల సంక్షేమ కార్యక్రమాలను అమలు జరపడంలో మహబూబ్‌నగర్ ప్రథమస్థానం ఆక్రమించిందని ఆమె వెల్లడించారు.

## తెలంగాణా అభివృద్ధి కొరకు నిధులు

హోం శాఖా మంత్రి శ్రీ జె. వెంగళరావు డిసెంబరు 18వ తేదీన, హైదరాబాదు సమీపంలోని హయత్‌నగర్‌లో శాఖా గ్రంథాలయానికి ప్రారంభోత్సవంచేస్తూ అభివృద్ధి కార్యకలాపాల నిమిత్తం తెలంగాణాలోని అన్నిజిల్లాలకూ, యేటా జిల్లాకు కోటి రూపాయల చొప్పున మరో నాలుగు సంవత్సరాలపాటు యివ్వడం జరుగుతుందని అన్నారు. తెలంగాణా జిల్లాల ఆర్థికాభివృద్ధి కొరకు ప్రభుత్వం యిదివరకే యిచ్చిన రూ. 9 కోట్లుకాక యిది అదనమని ఆయన తెలిపారు. గ్రామ ప్రాంతాల అభివృద్ధిని సాధించడం పంచాయతీరాజ్య సంస్థల ద్వారా మాత్రమే సాధ్యమవుతుందని చెబుతూ గతఎనిమిది తొమ్మిది సంవత్సరాలలో గ్రామీణుల ఆర్థికాభ్యున్నతి కొరకు పంచాయతీరాజ్య సంస్థలు గణనీయమైన కృషిచేశాయని మంత్రి పేర్కొన్నారు.

ఇటీవలి ఆందోళనవల్ల తెలంగాణా జిల్లాలకు తీరని నష్టం వాటిల్లిందని హోం మంత్రి అన్నారు. నిర్మాణాత్మకమైన మార్గాలలో గ్రామాలను అభివృద్ధిపరచడం కొరకు ప్రభుత్వం కల్పించే అవకాశాలను వినియోగించుకుని రాష్ట్ర అభివృద్ధి కొరకు ప్రతి ఒక్కరూ తమశక్తిసామర్థ్యాలను ధారపోయాలని ఆయన ఉద్ఘాటించారు.

జిల్లాలో గ్రంథాలయోద్యమాన్ని అభివృద్ధిపరచడానికి అన్ని సౌకర్యాలు కల్పించబడగలవని ఆయన చెప్పారు. పౌరగ్రంథాలయాల శాఖా డైరెక్టరు శ్రీ అబ్దుల్ మహమూద్ అధ్యక్షత వహించారు. జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షుడు శ్రీ ఎన్. చెన్నారెడ్డి, శాసన సభ్యురాలు శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి, పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ ప్రభాకరరెడ్డి ప్రసంగించారు.



పట్టాలను పంపిణీచేస్తున్న రెవెన్యూమంత్రి

## రెవిన్యూమంత్రిచే పట్టాసర్టిఫికెట్ల పంపిణీ

రెవిన్యూ శాఖామంత్రి శ్రీ పి తిమ్మారెడ్డి జనవరి 6వ తేదీన పరిగిలో భూమిలేని పేదప్రజలకు 268 ఎకరాలకు సంబంధించిన 112 పట్టాలను పంపిణీచేశారు.

## ఖండసారి చక్కెర ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవం

శ్రీకాకుళం జిల్లా, సాలూరు తాలూకా, తాడిలోవగ్రామంలో విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి శ్రీ వి. కృష్ణమూర్తినాయుడు డిసెంబరు 16వ తేదీన ఖండసారి చక్కెర ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవంచేశారు.

ప్రభుత్వం లభింపజేసే సౌకర్యాలను వినియోగించుకోవలసిందిగా మంత్రి వ్యవసాయదార్లకు విజ్ఞప్తి చేశారు. మనదేశపు ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయం ప్రధాన పాత్ర వహిస్తున్నదృష్ట్యా యిచ్చట వ్యవసాయాన్ని అభివృద్ధిపరచవలసిన అవసరం ఎంతైనా వుందని ఆయన ఉద్ఘాటించారు.

సాలూరు మునిసిపాలిటీ అధ్యక్షుడు శ్రీ ఎ. ఎరుకునాయుడు సభకు అధ్యక్షత వహించారు. చక్కెర ఫ్యాక్టరీ అధ్యక్షుడు శ్రీ ఎ. సత్యనారాయణ, మంత్రికి స్వాగతం చెప్పారు.

## కడెంకాలువల నమూనాలో మార్పులు
## డా. కె ఎల్. రావు సూచన

కేంద్ర నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి డా॥ కె. ఎల్. రావు, ఆంధ్రప్రదేశ్ ఉప ముఖ్యమంత్రి, శ్రీ జె. వి. నర్సింగరావు, చీఫ్ ఇంజనీరు, ఆదిలాబాదు జిల్లా కలక్టరు, జిల్లా పరిషత్తు అధ్యక్షుడు, ఇతర అధికార అనధికార ప్రముఖులు యిటీవల కడెండామ్‌ను సందర్శించారు, షట్టర్స్ పనిపరిస్థితులను కూడా ఆయన తనిఖీచేసి తన సంతృప్తిని వ్యక్తం చేశారు. ఈ ఋతువులో 31000 ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం కల్పించాలని ప్రాజెక్టు అధికారులు మంత్రికి వివరించారు.

ఖానాపూర్ కాలువల హెడ్‌వర్క్సు పరిశీలించిన తర్వాత రు. 16 లక్షల ఖర్చుతో నీటి విడుదల శక్తిని 200 క్యూసెక్కుల నుండి 800 క్యూసెక్కులకు పెంచడానికి ప్రత్యామ్నాయ మార్గాలను మంత్రి సూచించారు. జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ జి. నారాయణ రెడ్డి, శాసన సభ్యుడు శ్రీ పి. నర్సారెడ్డి మంత్రితో పరిస్థితులు చర్చించిన తర్వాత కడెండామ్ క్రింద 65,000 ఎకరాల ఆయకట్టుకు నీటిపారుదల సౌకర్యంకల్పించే దృష్టితో రూ. 35 లక్షలఖర్చుతో కడెం డామ్‌కు నీటిసరఫరా జరిగే విధంగా ప్రస్తుత కాలువలు, రెగ్యులేటర్ నమూనాలను తిరిగి రూపొందించాలని మంత్రి సూచించారు. ఖానాపూర్, ధర్మాజీపేటలలోని కాలువలను డా. రావు సందర్శించారు.



మానేరు డామ్‌స్థలాన్ని పరిశీలిస్తున్న శ్రీ డా. కె. ఎల్. రావు

## డా॥ కె.ఎల్. రావు మానేరు డామ్‌స్థలం పరిశీలన

కేంద్ర నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి, డా॥ కె.ఎల్. రావు జనవరి 4వతేదీన కరీంనగర్‌లో దిగువమానేరు డామ్‌పథకాన్ని పరిశీలించారు. మానేరుడామ్ పథకాన్ని ప్రత్యేక ప్రాజెక్టుగా 1996 లో రూపొందించారు. ఈ ప్రాజెక్టు నిర్మాణం ఖర్చు రు. 911 లక్షలు. 87,000 ఎకరాలకు నీటిసరఫరా జరుగుతుంది.

డామ్ స్థలాన్ని పరిశీలించిన తర్వాత డా. కె. ఎల్. రావు ప్రసంగిస్తూ లోతట్టు ప్రాంతంనుండి 70 అడుగుల ఎత్తున డామ్ నిర్మించినప్పుడు, రెండవ పంటకు నీరు సరఫరా చేయడానికి వీలుగా పోచంపాడు ప్రాజెక్టునుండి నీరు నిల్వచేయవచ్చునని అన్నారు. ఎగువస్థాయిలలోని క్షేత్రాలకు నీటి సరఫరా చేయడానికి వీలుగా ఎత్తుప్రదేశాలలో డాములను నిర్మించడానికి గల అవకాశాలను పరిశీలించాలని ఆయన ఇంజనీర్లకు విజ్ఞప్తిచేశారు.

## సబ్ పోస్టాఫీసు ప్రారంభం

మహబూబ్‌నగర్ సమితి అధ్యక్షుడు, శ్రీ కె. రామకృష్ణారెడ్డి గత సోమవారంనాడు తిరుమలదేవి గుట్టలో సబ్ పోస్టాఫీసు కార్యాలయానికి ప్రారంభోత్సవంచేశారు. పట్టణంలోని సగంమంది జనాభా అవసరాలను యీ కార్యాలయం తీరుస్తుంది.

## ఆంధ్రప్రదేశ్‌లో రేవుల అభివృద్ధి

మత్స్యపరిశ్రమ, రేవులశాఖలమంత్రి శ్రీ ఎస్. ఆర్.ఎ.ఎస్. అప్పలనాయుడు, గత శుక్రవారంనాడు భద్రాచలంలో పత్రికా ప్రతినిధులతో ప్రసంగిస్తూ రూ. 250 లక్షల ఖర్చుతో కాకినాడరేవును, రూ. 87 లక్షల ఖర్చుతో బందరు రేవును అభివృద్ధి పరుస్తున్నారని అన్నారు.

కాకినాడ రేవు అభివృద్ధికి అయ్యే మొత్తం ఖర్చును కేంద్రం ఇచ్చే గ్రాంటుమండి భరిస్తారనీ, బందరు రేవు అభివృద్ధికి అయ్యే ఖర్చును రాష్ట్ర ప్రభుత్వం భరిస్తుందనీ ఆయన అన్నారు. బందరు రేవు అభివృద్ధికి యీ సంవత్సరం రూ. 10 లక్షలను రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసింది.

జపానుకు ముడి ఇనుము ఎగుమతి చేయడానికి, లండన్ తదితర దేశాలకు తవుడు ఎగుమతి చేయడానికి, యీ రెండు రేవులు ఉపకరిస్తాయని ఆయన అన్నారు. నెల్లూరు జిల్లాలోని కృష్ణాపట్నం రేవుద్వారా ఎరువులను దిగుమతి చేసుకుంటున్నారనీ, మరో గోదామును నిర్మించితే అన్ని హంగులుగల రేవుగా యిది రూపొందుతుందనీ ఆయన అన్నారు

## బోధనా భాషగా తెలుగు విద్యామంత్రి అభిభాషణ

విద్యాశాఖ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు శ్రీకాకుళం జిల్లా పాలకొండలో డిసెంబరు 19వ తేదీన వెంకటేశ్వర ప్రభుత్వ జూనియర్ కాలేజికి ప్రారంభోత్సవంచేస్తూ, జూనియర్ కాలేజీలలో తెలుగు బోధనాభాషగా ప్రవేశపెట్టడం జరిగిందనీ, ఈ పథకాన్ని విజయవంతంగా అమలు పరచడం ఉపాధ్యాయులకు అగ్నిపరీక్ష వంటిదని చెప్పారు.

బోధనా భాష, విద్యాస్థాయిని పెంచడం మున్నగు విషయాలకు సంబంధించిన సమస్యలను పరిష్కరించవలసి ఉంటుందనీ ఆయన అన్నారు. ప్రతి జిల్లాలో 3, 4 రోజులు పర్యటించి ప్రతి జూనియర్ కాలేజీలో కనీసం 5 గంటలు గడిపి, ఆ కాలేజి సమస్యలను పరిశీలించి వాటి పరిష్కారానికి మార్గాలు అన్వేషించడానికి ప్రయత్నిస్తున్నానని ఆయన తెలిపారు.

విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు మాట్లాడుతూ కళాశాల అభివృద్ధిపట్ల ప్రజలు శ్రద్ధవహించాలని వినతి చేశారు. జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ జి. శ్రీరాములు నాయుడు మాట్లాడుతూ జూనియర్ కాలేజీ పట్టభద్ర కాలేజీగా మార్చడానికి సహకరించవలసిందని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

## గిరిజన కాలనీకి శంకుస్థాపన

టెక్కలి అసిస్టెంటు కలక్టరు, శ్రీ టి. మునివెంకటప్ప, శ్రీకాకుళం జిల్లా, సరవకోట పంచాయతీ సమితిలోని బందపల్లి గిరిజన గ్రామంలో గిరిజన కాలనీకి శంకు స్థాపన చేశారు. 40

గిరిజన కుటుంబాలకు ఇండ్ల సౌకర్యం కల్పించడానికి యీ పథకం ఉద్దేశించబడింది.

సమితిలోని పూలసర కొండప్రాంతానికిచెందిన 150 మంది గిరిజనులకు ఆయన వస్త్రాలను పంపిణీ చేశారు.

ఈ సందర్భంగా 3000 మంది పేద గిరిజనులకు అన్న దానం ఏర్పాటు చేశారు.

## నెల్లూరులో తిక్కన స్మారక చిహ్నం ఏర్పాటుకు అభ్యర్థన

ఆంధ్ర సాహిత్యానికి యెనలేని సేవచేసిన కవిబ్రహ్మ తిక్కన పేరుతో ఒక స్మారక చిహ్నాన్ని నెల్లూరులో ఏర్పాటు చేయడం చాలా అవసరమని సుప్రసిద్ధ తెలుగు పండితులు శ్రీ పింగళి లక్ష్మీకాంతం ఇటీవల తిరుపతిలో జరిగిన తిక్కన జయంతి ఉత్సవాల సందర్భంలో ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

తెలుగును జీవనోపాధికొరకుగాక ఒక భాషగా నేర్చుకోవాలని ఆయన ఉద్బోధించారు. ఆంధ్ర పత్రిక సబ్ - ఎడిటర్ శ్రీ విద్వాన్ విశ్వం, తెలుగు సాహిత్యానికి తిక్కన చేసిన సేవను శ్లాఘించారు.

బీహారు మాజీ గవర్నరు శ్రీ ఎం. అనంతశయనం అయ్యంగార్ ప్రారంభోపన్యాసంలో మాట్లాడుతూ ప్రజలు ప్రాచ్యభాషలు నేర్చుకోవాలని అభ్యర్థించారు. సాహిత్య ప్రపంచంలో ఆంధ్ర కవులు చేసిన సేవను ఆయన ప్రశంసించారు.

## మల్యాల సమితిలో హరిజనులకు మంచినీటి సౌకర్యం

కరీంనగర్ జిల్లా, మల్యాల పంచాయతీ సమితికి చెందిన సాంఘిక సంక్షేమ స్థాయీసంఘం సమావేశం డిశెంబరు 16వ తేదీనాడు జరిగింది. సమితి అధ్యక్షుడు శ్రీ పి. లక్ష్మణరావు సమావేశానికి అధ్యక్షత వహించారు. సమితిలోని 12 గ్రామాలలో హరిజన వాడలలో మంచినీటి బావులను త్రవ్వడానికి రు. 31,200 లను మంజూరు చేశారు.

సమితి అధ్యక్షుడు ప్రసంగిస్తూ యీ 12 బావుల త్రవ్వకం పని పూర్తి అయితే సమితిలోని ప్రతి హరిజనవాడకు మంచినీటి సౌకర్యం కల్పించే పథకంఅమలు పూర్తి అవుతుందని అన్నారు.

## రామన్నపేటలో వర్కుషాపు

నల్గొండజిల్లా రామన్నపేటలోని మోటారు మెకానిక్ శ్రీ ఎ. రాజయ్య ఇప్పుడు బాపూజీ జనరల్ ఇంజనీరింగ్ వర్కుషాపుకు యజమాని.

స్థానిక పరిశ్రమల శాఖాధికారుల కృషి ఫలితంగా జాతీయ లఘుపరిశ్రమల కార్పొరేషన్‌ద్వారా అద్దె- కొనుగోలు పద్ధతిపై రు. 12,000లు విలువచేసే యంత్రాలు, నల్లగొండలోని గ్రామీణ పరిశ్రమల ప్రాజెక్టుద్వారా 75 శాతం విరాళం ప్రాతిపదికపై డ్రిల్లిగ్రైండర్ప మొదలైన యంత్రపరికరాలతోపాటు రు. 4,000ల ఋణం ఆయనకు లభించాయి. బ్లాకు ప్రాంతమంతటా అవసరాలను తీర్చడానికి వీలుగా ఇప్పుడు యీ యూనిటు అన్ని హంగులు కలిగి ఉన్నది.

## రష్యా మంత్రి నాగార్జునసాగర్ సందర్శన

రష్యా ప్రభుత్వ విద్యుచ్ఛక్తి, పరిశ్రమల మంత్రి శ్రీ అంటొనోవ్, నాగార్జునసాగర్ ప్రాజెక్టును ప్రశంసిస్తూ ఇది "అద్భుతమైన సాంకేతిక ప్రక్రియ" "నిర్మాణ కౌశలానికి ప్రతీక" అని అభివర్ణించారు.

శ్రీ అంటొనోవ్ వెంట రాష్ట్ర మహిళా సంక్షేమ, యాత్రా వ్యవహారాల మంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీ ఉన్నారు. వీరు నాగార్జున సాగర్, నాగార్జున కొండలను సందర్శించారు.

రష్యామంత్రి ఢిల్లీ వెళ్ళేముందు సాలార్ జంగ్ మ్యూజియాన్ని చూచారు. విమానాశ్రయం వద్ద ఆయనకు ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు, భారత భారీ విద్యుత్పరికరాల ఫ్యాక్టరీ జనరల్ మేనేజరు శ్రీ సి. బి. కరియప్ప ఇతరులు వీడ్కోలు ఇచ్చారు.

## సన్నకారు రైతుల అభివృద్ధి కార్యక్రమం

డిసెంబరులో ప్రణాళికా సంఘం సభ్యులు శ్రీ బి. వెంకటప్పయ్య, శ్రీకాకుళంలో జిల్లా అధికారులతో, బ్లాకు అభివృద్ధి అధికారులతో, బ్యాంకుల ప్రతినిధులతో సమావేశమయి సన్నకారు రైతుల కార్యక్రమం అమలును గూర్చి చర్చించారు.

ఈ కార్యక్రమం క్రింద అధిక దిగుబడి రకాల పైర పెంపకం, బావుల త్రవ్వకం వగైరా, గొర్రెలు, కోళ్ళ పెంపకం వగైరా ఉన్నాయని ఆయనఅన్నారు. సన్నకారు రైతుల అభివృద్ధికీ, అధిక ఆహారోత్పత్తికీ యీపథకం ఉద్దేశించబడింది. సన్నకారు రైతులకు సహాయపడడానికి తగిన పథకాలను రూపొందించాలని వాణిజ్య బ్యాంకులకు ఆయన విజ్ఞప్తి చేశారు.

శ్రీకాకుళం జిల్లా కలక్టరు, శ్రీ బి. ఎన్. యుగంధర్ ప్రసంగిస్తూ గిరిజన రైతులతో సహా సన్నకారు రైతులకు పరపతి సౌకర్యాలు అందజేయడానికి తగిన చర్యలు తీసుకోవాలని ప్రణాళికా సంఘం సభ్యునికి విజ్ఞప్తి చేశారు.

విశాఖపట్నంలోని ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు తెగల ఆర్థిక కార్పొరేషన్ జనరల్ మేనేజరు, శ్రీ వి. చంద్రమౌళి ప్రసంగిస్తూ గిరిజనులనుండి ఋణమొత్తాల వసూళ్లు ప్రోత్సాహకరంగా ఉన్నాయన్ని అన్నారు.

## బావులక్రింద సేద్యపు నీటిపారుదల సౌకర్యం

బావులక్రింద సేద్యపు నీటి పారుదల సౌకర్యాన్ని కల్పించేందుకై తీవ్రంగా కృషిచేయడానికి ఒక పథకాన్ని అమలుచేయాలని కరీంనగర్ పంచాయతీ సమితి నిర్ణయించింది.

ఈ పథకం క్రింద వచ్చే రెండు నెలలో కొత్తగా 43 బావుల త్రవ్వకం, ప్రస్తుతం ఉన్న సుమారు 20 బావుల మరమ్మతులను పూర్తి చేస్తారు.



PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS AND TOURISM, ANDHRA PRADESH HYDERABAD.
AND PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH

# తెలంగాణా గురించి...

**వ్యవసాయపు పనుల్లో వున్న శ్రామికులు**

| | వ్యవసాయ శ్రామికులు (రైతులు, వ్యవసాయ కూలీలు) | వ్యవసాయ కూలీలు | వ్యవసాయ శ్రామికుల్లో వ్యవసాయ కూలీల శాతం |
|---|---|---|---|
| | | (వేలలో) | |
| తెలంగాణా | 4,570 | 1,719 | 37.6 |
| ఆంధ్రప్రదేశ్ | 12,825 | 5,336 | 41.6 |

**అక్షరాస్యులు 1951-61**

| | 1951 | 1961 | పదేళ్ళలో పెరుగుదల శాతం |
|---|---|---|---|
| | | (వేలలో) | |
| తెలంగాణా | 1000.9 | 2204.1 | 120 |
| ఆంధ్రప్రదేశ్ | 3750.2 | 7626.5 | 103 |

**వృత్తులవారీ కార్మికుల వర్గీకరణ శాతం 1961**

| | వ్యవసాయదారులు | వ్యవసాయ కార్మికులు | నిర్మాణాలు | వర్తక వాణిజ్యాలు | రవాణా కార్యక్రమాలు | ఇతర పనులు |
|---|---|---|---|---|---|---|
| తెలంగాణా (హైదరాబాదుతో సహా) | 41.8 | 25.2 | 1.5 | 4.0 | 1.1 | 26.4 |
| ఆంధ్రప్రదేశ్ | 40.1 | 28.6 | 1.2 | 4.3 | 1.3 | 24.5 |

